# అపరాధ పరిశోధన

రు. 4 | ఏప్రెల్ '80

సప్లిమెంట్

'PRABHAKAR'



అపరాధ పరిశోధన అనుబంధం — 76

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ఫారిన్ సెంట్
రచన : వసుంధర

## చేదు నిజం
రచన: వాణిశ్రీ

## తోడు దొంగలు
రచన: ప్రతాప రవిశంకర్

## కంబళి కప్పిన శవం
రచన: సికిందర్

పొగమంచు — నాలుగవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 76
ఏప్రెల్, 1980
వెల: రు. 4-00
ఏడాది చందా 49 రూపాయలు
జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. ఏ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# ఫారిన్ సెంట్?

వసుంధర

"ఒక డబల్ రూం కావాలి" అన్నాడతను.

"నో ప్రాబ్లం. మీ పేర్లు చెప్పండి" అంది రిసెప్షనిస్టు.

"నా పేరు రంగారావు" అన్నాడతను.

"ఆమె పేరు...."

"ఆమె నా భార్య...." అన్నాడతను.

రిసెప్షనిస్టు సన్నగా నవ్వుకుని "అదుగో బేరర్-రూం నంబర్ పదిహేడని చెప్పండి" అంది. రంగారావు, అతని భార్య బేరర్ సాయంతో గదికి చేరుకున్నారు.

"మీ కేం కావాలంటే అది తెస్తాను" అన్నాడు బేరర్.

"నాక్కావలసిందల్లా ఒక్కటే-తెల్లారేదాకా యీ గదికి యింకెవ్వరూ రాకపోవడం" అన్నాడు రంగారావు. బేరర్ రంగారావును చూసి నవ్వుకున్నాడు. కొత్తగా పెళ్ళైనా అయుండాలి లేదా చాలా రోజుల తర్వాత భార్యను కలుసుకుంటూ వుండివుండాలి అని అనుకున్నాడు.

# 4

బేరర్ వెళ్ళగానే తలుపులు వేసి "అమ్మయ్య!" అని శీఘ్రంగా ఆమెను సమీపించి బలంగా కౌగలించుకున్నాడు రంగారావు. ఆమె అతని కౌగిట్లో ఒదిగిపోయింది. అలా యిద్దరూ పదినిముషాలైనా వుండిపోయారు.

ఆమె నెమ్మదిగా అతన్ని విడిపించుకుని "ఫ్రెష్‌గా వుంటుంది. స్నానంచేసి వస్తాను" అంది.

"స్నానం నేనూ చేస్తాను" అన్నాడు రంగారావు.

ఆమె బుగ్గలు సిగ్గుతో ఎరుపెక్కాయి. సిగ్గు కళ్ళలో ఏ రంగూ లేకుండా స్పష్టంగానే ప్రతిఫలించింది. ఆ సిగ్గు అతనికెంతో నచ్చినట్టుంది. అందులోనూ సిగ్గు తప్ప అభ్యంతరం లేని ఆమె చూపులు అతన్ని ఉత్సాహపరిచాయి.

ఇద్దరూ స్నానాలగదిలో గంటసేపు జలక్రీడలాడారు.

"ఈ హోటల్ బాగుంది కదూ?" అన్నాడతను స్నానం పూర్తయ్యాక.

"నాకు హోటల్ కనబడటంలేదు. ఎటు చూసినా మీరే కనబడుతున్నారు-మీరు నాకు యెప్పుడూ బాగుంటారు" అందామె.

అతనామెను దగ్గరగా లాక్కుని "నీకు భగవంతుడు చక్కని రూపు యిచ్చాడు. నీ కళ్ళకు వశపర్చుకునే చూపు ఇచ్చాడు. ఈ రెండింటికీ మతిపోయి చస్తూంటే యింకా అద్భుతమైన ఆ పలుకులెందుకు? ఆడదానికి తెలివితేటలు జతగూడితే మగాడు చిత్తే!" అన్నాడు.

ఆమె నవ్వి—"మిమ్మల్ని చిత్తుచెయ్యాలన్న సరదా నాకు లేకపోలేదు. మిమ్మల్ని చూస్తూనే పరవశించి వశం తప్పే నా మనసు అందుకు సహకరించడంలేదు—" అంటూ ఆవులించింది.

"ఇప్పుడే ఆవులిస్తున్నావు...." అని నవ్వాడతను—"ఎన్ని దొంగవేషాలు వేసినా ఈ రాత్రికి నిన్ను నిద్ర పోనివ్వను...."

"మా ఎదుట నన్ను నేనే మరిచిపోతాను—నిద్రను మరువలేనా?" అని కిలకిలా నవ్విందామె.

## 2

"ఎస్—డిటెక్టివ్ వెంకన్న స్పీకింగ్!" అన్నాడు వెంకన్న.

"నేనండి ద్వారకా లాడ్జి ప్రొప్రయిటర్ సూరిబాబును మాట్లాడుతున్నాను. మీ రొక్కసారి దయతో మా హోటల్‌కు రావాలి—" అన్నాడవతలి వ్యక్తి.

"ఏమిటి విశేషం?"

"హత్య!" అన్నాడు సూరిబాబు.

వెంకన్న తక్షణం ఫోన్ పెట్టేసి—"ఫోన్ కాల్ విన్నారు కదా—ఏమని నోట్ చేసుకున్నారు—" అన్నాడు తన అసిస్టెంట్సు సీతమ్మ, రాజమ్మలవంక తిరిగి. అతనికి ఏ ఫోన్ కాల్ వచ్చినా అతనితోపాటే వాళ్ళు వినే ఏర్పాటుంది అక్కడ!

సీతమ్మ చాలా సీరియస్‌గా ముఖంపెట్టి—"రాత్రి మీకు చాలా కబుర్లు చెప్పాలనుకున్నాను. కానీ మీరు మంచం చేరుతూనే గుర్రుపెట్టి నిద్రపోయారు...." అని చదివింది.

వెంకన్న తన ముఖం గంభీరంగా చేసి—"వంటింటి ఫోన్ కాల్స్ మీరు వినకూడదని నేను చెప్పలేదూ?" అన్నాడు.

అతని ఆఫీసూ, ఇల్లూ ఒకటే! కానీ వెంకన్న భార్య పద్మావతీదేవి ఆఫీసులో అడుగు పెట్టదు. అతనితో

మాట్లాడాలంటే వంటింట్లోంచి ఫోన్ చేస్తుంది. ఆ ఫోన్ కాల్ అసిస్టెంట్సు వినకూడదని అతను శాసించాడు. వాళ్ళు అతని శాసనం మన్నించినా అప్పుడప్పుడు చనువు కొద్దీ అతన్ని ఎగతాళి పట్టిస్తూంటారు.

"చిన్న పొరపాటు .... మన్నించండి...." అంది సీతమ్మ.

"ఇది చిన్న పొరపాటు కాదు. అవతల నూరిబాబు హత్య అంటున్నాడు. మీరేమో నామీద జోకులు వేస్తున్నారు. హత్య గురించి విన్నప్పుడు సీరియస్‌గా ఉండడం నేర్చుకోండి—" అని వెంకన్న వాళ్ళకు తన తదుపరి కార్యక్రమం చెప్పి అక్కణ్ణించి కదిలాడు.

వెంకన్న వెళ్ళేసరికి రిసెప్షనిస్టు అతన్ని విష్ చేసి రూం నంబరు పదిహేనుకు వెళ్ళమంది. అతనక్కడికి చేరుకునేసరికి పోలీసు బలగం సిద్ధంగా వుంది. ప్రొప్రయిటర్ నూరిబాబు కూడా అక్కడే వున్నాడు. వెంకన్న కళ్ళు శవంకోసం వెతికాయి.

మంచంమీద వుంది శవం! గుండెల్లో పిడివరకూ దిగి వుంది చాకు!

నూరిబాబు అతనికి వివరాలు చెప్పాడు.

నిన్నరాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో రంగారావు అనే అతను తన భార్యతో కలిసి ఈ గది తీసుకున్నాడు. ఉదయం ఏడుగంటలకు బేరర్ వెడితే గది తలుపులు తోయగానే తెరుచుకున్నాయి. మంచంమీద రంగారావు చచ్చి పడున్నాడు. అతని భార్య గదిలో లేదు.

"వెంకన్నగారూ! మన పోలీసు డిపార్టుమెంటుపై నాకు చాలా గౌరవం వుంది. కానీ వారు కొన్ని పద్ధతులకు కట్టుబడి పరిశోధించాలి కదా—అందువల్ల పరిశోధనకు

కాస్త ఆలస్యం కావచ్చు. ఇది ముందుగా పధకంవేసి చేసిన హత్య అని నాకు అనుమానం. నా హోటల్ గదిని హత్యాస్థలంగా ఎన్నుకోవడం నాకు చాలా విచారంగా వుంది. ఆ హంతకుడు లేక హంతకురాల్ని మీరు వీలైనంత త్వరగా పట్టుకోవాలి. నా హోటల్లో హత్య జరగడం హంతకులకు ప్రమాదకరమని రుజువుకావాలి. మీరు కోరిన ఫీజు యిస్తాను" అన్నాడు సూరిబాబు.

ఇన్‌స్పెక్టర్ జగదీష్ చాలా హడావుడిగా వున్నాడు. అక్కడ చేరిన కొంతమందిని అతను వరుసగా ప్రశ్నలు వేస్తున్నాడు. అతను వెంకన్నను చూసి పెద్దగా ఏమీ చలించకుండా "మీరిక్కడికి యెలా వచ్చారో చెప్ప గలరా?" అనడిగాడు.

"నడిచి వచ్చానంటే పాతజోకు అవుతుంది. పోలీస్ ఇన్‌స్పెక్టర్లకు పాతజోకులు చాలునని నాకు తెలుసు. అయినా పాతజోకులు వెయ్యడం ఈ వెంకన్నకు పరువు తక్కువ. కాబట్టి కొత్తజోకు వేస్తాను."

"వెయ్యండి" అన్నాడు జగదీష్.

"ఈ హత్యను నేను కలలో చూశాను. కలలో నిజం ఎంతుంటుందో తెలుసుకుందామని ఇక్కడకు వచ్చాను. కొంతయినా వుంది" అన్నాడు వెంకన్న.

"కలలో హత్య చూస్తే హంతకుణ్ని కూడా చూసే వుంటారు" అన్నాడు జగదీష్.

"అవును చూశాను...." అన్నాడు వెంకన్న.

"పోలీసుల దగ్గర జోకులువేసే పీక పట్టుకుంటుంది. హంతకుడెలా వుంటాడో చెప్పాల్సిన బాధ్యత ఇప్పుడు మీకుంది" అన్నాడు జగదీష్ సీరియస్‌గా.

"నేను ఉత్తముపౌరుణ్ని. నా బాధ్యతలు సక్రమంగా

నిర్వహిస్తాను. ఎటొచ్చీ నేను కవిని, చిత్రకారుణ్ని కాను కాబట్టి హంతకుణ్ని వర్ణించలేను, చిత్రించలేను. మీరు ఫోటోలు చూపిస్తే గుర్తించగలను" అన్నాడు వెంకన్న అమాయకంగా ముఖం పెట్టి.

జగదీష్ నవ్వేసి "మీతో నేనెక్కడ మాట్లాడగలను కానీ-సూరిబాబుగారు ఈ కేసు మీకు అప్పగించారు. నా పద్ధతిలో నేను పరిశోధించుకుంటాను. మీ పద్ధతిలో మీరు పరిశోధించండి. ఎప్పుడు ఏ సహాయం అవసరమైనా నిస్సంకోచంగా నన్నడగండి" అన్నాడు.

"థాంక్స్!" అన్నాడు వెంకన్న.

వెంకన్న హోటల్లో సేకరించిన సమాచారాన్నిబట్టి రంగారావు, తనతో వచ్చిన యువతితో ఏకాంతం కోసం తహతహలాడాడని ఆ రాత్రికి ఎవర్నీ గదిలోకి రావద్దని చెప్పాడనీ మాత్రం తెలిసింది. ఈ సమాచారంవల్ల రంగారావును అతనితో వచ్చిన యువతియే చంపివుండాలని ఊహించుకోవచ్చు.

అయితే ఆమె ఈ హత్య యెందుకు చేసింది? ఎందుకు చేసినా ఈ హోటల్లోనే యెందుకు చేసింది? తన ముఖం నలుగురికీ కనబడితే ఏదో ఒకరోజున తను పట్టుబడుతుందని తెలియదా?

ఆ యువతి ఈ హత్య చేయడానికి అవకాశముంది. కానీ అందరి అనుమానాలూ తన మీదకు విధిగా మళ్ళించబడే పద్ధతిలో హత్య చేసిందంటే ఆమె చాలా తెలివి తక్కువదై వుండాలి.

పోనీ హత్య చేయలేదని అనుకుందామంటే ఆమె ఏమయింది?

హఠాత్తుగా వెంకన్న బుర్రలో కొత్త ఆలోచన

వచ్చింది. హంతకుడు రంగారావును హత్యచేసి ఆమెను అపహరించుకుని పోయాడేమో?

హంతకుడు మరియొకడైన పక్షంలో రెండు కారణాల వల్ల ఆమెను అపహరించుకుని పోయివుండవచ్చు.

మొదటిది ఆమె అందం! ఆమె అద్భుతసౌందర్యరాశి అని బేరర్ చెప్పాడు. రెండవది ఆమె ఈ హత్యకు ప్రత్యక్షసాక్షి!

అటువంటప్పుడు హంతకుడు ఇద్దర్నీ చంపేయక— ఒక్కరినే యెందుకు చంపాడు? రెండో వ్యక్తిని ఎందుకు మాయం చేశాడు?

బాగా ఆలోచించగా వెంకన్నకు కొన్ని కారణాలు తోచాయి. హంతకుడు రంగారావును చంపేశాడు. ఆమెనూ చంపేయాలనే అనుకున్నాడు. అయితే ఆమె అతని కాళ్ళావేళ్ళాపడి వుంటుంది. ఆడదని జాలిపడి, ఆమె అందానికి భ్రమపడి హంతకుడామెను కూడా తీసుకుపోయి వుంటాడు. అందువల్ల మరో ప్రయోజనం- అందరి అనుమానమూ ఆ యువతిమీదకు పోతుంది. కొంత కాలంపాటు ఆమె అజ్ఞాతవాసంలో ఉన్నదంటే కేసు ఒక్కడుగు కూడా ముందుకు నడవదు.

దురదృష్టమేమిటంటే హోటల్‌కు రాకపోకలకు సరైన ఆంక్షలులేవు. ఎవరైనా సరే హోటల్ ఆవరణలో అడుగుపెట్టి బయటకు పోవచ్చును. అయినా ఇంతవరకూ ఏ విధమైన ఇబ్బందులూ యెదురుకాలేదు. ఎటొచ్చీ వెంకన్న పరిశోధనకే ఇబ్బంది వచ్చింది. హోటల్లో వుంటున్నవారు కాక మరెవరైనా హోటల్లో అడుగుపెట్టిన విషయంకానీ, ఆ యువతి ఎప్పుడు హోటల్ వదిలి బయటకు పోయిందీ అతనికి తెలియలేదు.

వెంకన్న హోటల్ గదిని బాగా పరీక్షించి కాస్త ధైర్యంచేస్తే బాత్రూండ్వారా బయటినించి లోపలకు ప్రవేశించవచ్చునని తెలుసుకున్నాడు.

బేరర్, రిసెప్షనిస్టు చెప్పిన వర్ణనలు వెంకన్నకు ఆట్టే పనికివచ్చేవి కావు. ఆ వర్ణనలు దేశంలోని అందమైన ఆడవాళ్ళందరికీ వర్తిస్తాయి.

# 3

ఇన్స్పెక్టర్ జగదీష్ దగ్గరకు వెళ్ళి కొన్ని వివరాలు తెలుసుకున్నాడు వెంకన్న.

హత్య రాత్రి రెండుగంటల ప్రాంతాల జరిగింది. హత్య జరిగినప్పుడు హతుడు పెనుగులాడలేదు. బహుశా నిద్రపోతూ వుండివుండాలి. గదిలో వేలిముద్రలు ఇద్దరివే. అవి రంగారావువీ, అతని భార్యవీ అయుండవచ్చును. మరోవ్యక్తి గదిలోకి వచ్చిన జాడలేదు. రంగారావు గురించిన భోగట్టా యింకా తెలియలేదు. అతనీ ఊరు వాడు కాదనిమాత్రం తెలుస్తోంది. అతని ఫోటోను కొన్ని పేపర్లలో వేయించడం జరిగింది. ఒకటి రెండు రోజుల్లో ఏవైనా వివరాలు తెలియవచ్చును.

"పాపం, రంగారావు!" అన్నాడు వెంకన్న "ఎక్కణ్ణించో వచ్చి ఈ వూళ్ళో బలైపోయాడు."

జగదీష్ నవ్వి "చనిపోయినవాడల్లా పుణ్యాత్ముడు. అసలు పాపం నాది. ఈ హత్యకేసు పరిశోధించాల్సి వచ్చింది" అన్నాడు.

"అయితే కొంతపాపం నాకూ వుందికదా" అన్నాడు వెంకన్న.

"మీదేముందిలెండి పరిశోధిస్తే డబ్బొస్తుంది. లేకపోతే లేదు. నాదైతే ఉద్యోగధర్మం. కేసు ముందుకు

నడవకపోతే పైవాళ్ళకు జవాబిచ్చుకోవాలి" అన్నాడు ఇన్‌స్పెక్టర్ జగదీష్.

"మీరు చెప్పిందీ నిజమే!" అని నిట్టూర్చాడు వెంకన్న. అతని నిట్టూర్పు ఇంకా సగంలో వుండగానే ఒక నడి వయస్కుడు ఆత్రుతగా స్టేషన్లో ప్రవేశించాడు.

"ఎవరు కావాలి?" అడిగాడు జగదీష్.

"ఇన్‌స్పెక్టర్ జగదీష్ మీరేనా?" అనడిగాడు నడి వయస్కుడు.

"నేనే? ఏం కావాలి మీకు?" అన్నాడు జగదీష్ మళ్ళీ.

"మీరు పేపర్లో వేశారుగదా—ఆ రంగారావుగారి తాలూకు మనిషిని" అన్నాడతను.

జగదీష్, వెంకన్న కూడా వులిక్కిపడి సర్దుకుని కూర్చున్నారు.

ఆ వ్యక్తి రంగారావు వివరాలు చెప్పాడు.

రంగారావుకు కాకినాడలో బట్టలవ్యాపారం వుంది. ఆ బట్టలషాపులో ఈ నడివయస్కుడు మేనేజర్‌గా వుంటున్నాడు. పేరు గురుమూర్తి.

అతను రంగారావు శవాన్ని గుర్తుపట్టి భోరున ఏడ్చేశాడు.

పేపర్లో ఫోటో చూసి కాస్త కంగారుపడ్డా మనిషిని పోలిన మనుషులుండకపోతారా అని మనసుకు ధైర్యం చెప్పుకున్నాట్ట. ఇప్పుడవన్నీ తీరిపోయాయి. రంగారావుకు కాస్త మెడక్రిందుగా వీపుమీద సన్నని పొడుగాటి నల్లని మచ్చ ఒకటి వుంటుంది. అది తిరుగులేని గుర్తింపు చిహ్నం.

జచదీష్ గురుమూర్తిని ఓదార్చి త్వరత్వరగా కొన్ని

ప్రశ్నలు వేశాడు.

రంగారావు చాలా మంచివాడుట. దయామయుడట. అతని పేరుచెప్పి అయిదుమంది విద్యార్థులు కాకినాడ పి. ఆర్. కాలేజీలో చదువుకుంటున్నారుట. తన దుకాణం లోని పనివాళ్ళను అతడు కన్నబిడ్డల్లా చూసుకుంటాడుట. గురుమూర్తిని యెప్పుడూ పెద్దన్నగా భావించి గౌర విస్తాట.

"అలాంటివాణ్ని చంపడానికి ఏ వెధవకు చేతు లొచ్చాయో?" అన్నాడు గురుమూర్తి.

"రంగారావును అతడి భార్యే చంపింది" అన్నాడు వున్నట్లుండి వెంకన్న.

గురుమూర్తి కనురెప్పలు టపటపలాడించి, తల అటూ యిటూ ఆడించి "ఏమిటన్నారు?" అన్నాడు.

"రంగారావును చంపింది అతడి భార్య" అన్నాడు ఈసారి జగదీష్.

"ఆవిడెలా చంపుతుంది - అయమ్మెప్పుడూ ఇల్లైనా కదలదే?" అన్నాడు గురుమూర్తి.

"ఇప్పుడు రంగారావు భార్య కాకినాడలోనే వుందా?" అన్నాడు జగదీష్.

"పదిరోజుల క్రితమే ఆవిడ పుట్టింట్నించి తిరిగొచ్చింది. అప్పట్నించీ కాకినాడలోనే వుంది" అన్నాడు గురు మూర్తి.

"రంగారావు ఇక్కడికి భార్యాసమేతంగా రాలేదా?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

వాళ్ళే విధంగా తనెందుకు ప్రశ్నిస్తున్నారో తెలుసు కోవడానికి గురుమూర్తికి కాస్సేపు పట్టింది. కథంతా విన్నాక అతను చిరాగ్గా "చిలకా గోరింకల్లా కాపురం

చేసుకుంటున్నారు. ఆయమ్మ మొగుణ్ణొందుకు చంపుతుందీ- అన్నవాళ్ళకే కాదు, అనుకున్నవాళ్ళకూ_డా పుట్టగతు లుండవు" అన్నాడు.

"కా స్త రంగారావు భార్యను వర్ణించగలరా?" అన్నాడు వెంకన్న.

అంత దుఃఖంలోనూ గురుమూర్తి సిగ్గుపడ్డాడు. రంగా రావు భార్య పరాయి ఆడదేకాక తనకు యజమానురాలు కూడా! అయినప్పటికీ ఇనస్పెక్టరు బలవంతంమీద గురు మూర్తి ఆమెను వర్ణించాడు. ఆ వర్ణన ద్వారకా లాడ్జిలోని రిసెపనిస్టు, బేరర్ చెప్పిందానికి సరిపోయింది.

"అయితే రంగారావు భార్యతో హోటల్లో దిగా డన్నది నిజం!" అన్నాడు జగదీష్.

"అదేంకాదు. హోటల్లో దిగిన యువతిలాగే రంగా రావు భార్యకూడా సౌందర్యవతి అని తెలుసుకోవడానికి మాత్రమే ఈ వర్ణన ఉపయోగపడుతుంది. ఇద్దరూ ఒకరు కావచ్చు, వేరు కావచ్చు" అన్నాడు వెంకన్న.

"వెళ్ళి చూస్తే సరిపోతుందిగా" అన్నాడు జగదీష్.

## 4

కళ్ళు చెదిరే అందం రంగారావు భార్యది. మూర్తీభ వించిన శోక దేవతలా వుండి కూడా ఆమె ఆకర్ష ణీయంగా వుంది. అందరి అందాన్నీ శోకదేవత హరించ లేదని ఆమెను చూసి తెలుసుకోవచ్చు.

"మీరే పరిస్థితిలో వున్నారో తెలిసికూడా మిమ్మల్ని కొన్ని యిబ్బందికరమైన ప్రశ్నలడగవలసి వచ్చినందుకు నాకు విచారంగా వుంది. అన్యథా భావించరని తలుస్తాను" అన్నాడు జగదీష్.

"మీ బాధ్యత మీది...." అందామె రుద్ధకంఠంతో.

రుధ్రకంఠం కూడా ఎంతో తీయగా వుండడానికి కారణం ఆడదాన్ని ఆడదాన్నిగా చూసే మగబుద్ధి కాక, ఒక విచిత్రమైన విషయమని వెంకన్న అనుకున్నాడు.

జగదీష్ ప్రశ్నలు వేస్తూంటే వెంకన్న అట్టే మాట్లాడడు. ఎలా స్ఫురిస్తాయో కానీ జగదీష్ ఒక్క ప్రశ్న కూడా మిస్సవడు. తన శక్తి వృథా చేసుకోవడ మెందుకని వెంకన్న ఉత్తర ప్రత్యుత్తరాలు వింటూంటాడు.

రంగారావు చాలా మంచివాడు. భార్య అతని ఆరో ప్రాణం. పరస్త్రీని కన్నెత్తి కూడా చూడడతను. సర దాకు భార్యతో కూడా పరస్త్రీ గురించి మాట్లాడడు.

ఈమె చెప్పిన మాటలు నిజమైతే రంగారావు చాలా జాగ్రత్తపరుడై వుండాలని వెంకన్న అనుకున్నాడు.

"మీ ఆయన చనిపోయింది హోటల్ గదిలో. ఆ గదిలో ఆయనతోపాటు రాత్రి ఒక స్త్రీ కూడా వుంది. ఆ స్త్రీ తన భార్య అని ఆయన చెప్పాడు. అది నిజ మవునో కాదో అని తెలుసుకోవాలని వచ్చాం" అన్నాడు జగదీష్.

రంగారావు భార్య ముఖం వెలవెలబోయింది. "ఆయన ఇంటిదగ్గర్నించి ఒంటరిగానే బయలదేరారు. తను హైదరాబాదు వెడుతున్నానని నాకు చెప్పారు...."

అంటే రంగారావు భార్యకు అబద్ధం చెప్పాడన్న మాట!

"ఎంతో మంచివాడైన మీ భర్త మీకు హైదరాబాదు అని అబద్ధం చెప్పి - మా వూరు వచ్చి ఓ స్త్రీతో హోటల్ గదిలో కొన్నిగంటలు గడిపి మరణించాడు. ఈ సంఘటనపై మీ అభిప్రాయం" అన్నాడు జగదీష్.

"ఏ పరిస్థితుల్లోనూ ఆయనన్ననుమానించలేను. నన్ను బాధపెట్టే ఏదో వ్యాపార రహస్యం వుండి వుండాలి. ఆ స్త్రీతో ఆయన కొన్నిగంటలు గడిపారంటే — ఏదో విషయాలు మాట్లాడడానికే అయుండాలి" అందామె.

తమకూడా వచ్చిన బేరర్, రిసెప్షనిస్టుల ముఖకవళికలను, కనుసైగలనుబట్టి రంగారావుతో బసచేసిన స్త్రీ అతడి భార్యకాదని ఇన్‌స్పెక్టరుకూ, వెంకన్నకూ అర్థమైపోయింది. అయితే ఆ స్త్రీని గుర్తుపట్టడం కోసం బేరర్, రిసెప్షనిస్టులు వచ్చినట్లు రంగారావు భార్యకు తెలియనివ్వరాదని వెంకన్న జగదీష్‌కు సలహా యిచ్చాడు.

ఆ స్త్రీ రంగారావు భార్య కాకపోయినప్పటికీ— ఆమె కాకినాడలోనే వుంటున్నదని వెంకన్న అనుమానించాడు. ఎందుకంటే రంగారావు తమ ఊరు రైలు ప్రయాణంచేసి చేరాడు. అతను ఫస్టుక్లాసులో ప్రయాణం చేశాడు. ఫస్టుక్లాసులో ఆ రోజు టిక్కెట్లు రంగారావు, శ్రీమతి రంగారావు పేర్లపై బుక్ చేయబడ్డాయి. భార్యను మోసగించి రంగారావు కాకినాడలోని ఓ యువతితో సంపర్కం పెట్టుకున్నాడు. ఆమెతో కలసి బయల్దేరాడు. బహుశా సుఖానుభవాల కోసమే అయుంటుంది.

రంగారావు విషయం చాలా తమాషాగా వుంది. అతను ఏం చెయ్యబోయాడో, ఎందుకు చచ్చిపోయాడో అర్థం కావడంలేదు.

అక్కణ్ణించి బయటకు వచ్చాక "మిస్టర్ జగదీష్! మీరు తిరిగి వెళ్ళిపొండి. నేను ఊళ్ళో కొద్దిరోజులుండి ఆ హోటల్లో రంగారావుతో బసచేసిన యువతి గురించి ఆరా తీస్తాను" అన్నాడు.

"గడ్డిమేటులో సూదికోసం వెదుకుతున్నారేమో—" అన్నాడు జగదీష్.

"అయితే ఫరవాలేదు. కొండను తవ్వి ఎలుకను పట్టడం అవుతుందేమోనని భయపడుతున్నాను" అన్నాడు వెంకన్న.

జగదీష్ నవ్వి—"మరి సెలవు తీసుకుంటాను"అన్నాడు.

వెంకన్న హోటల్ బేరర్‌తో మాత్రం—"నాది రాచ పుట్టుక కాదుకానీ అప్పుడప్పుడు తిరగడానిక్కూడా తోడు కావాలనిపిస్తుంది. నువ్వు నాతో యిక్కడుండిపో. హోటల్లో కిట్టేదానికి రెట్టింపు కిడుతుంది. అయినా నేను మీ సూరిబాబుగారి తరఫునేగా పనిచేస్తున్నంది" అన్నాడు.

"అయ్యబాబోయ్—మీరు చెప్పినట్లు వినమన్నారండి ఆ బాబు. డబ్బులుకూడా అడగొద్దన్నారు" అన్నాడు బేరర్ కంగారుగా.

"అడగొద్దన్నారు గానీ యిస్తే పుచ్చుకోవద్దనలేదు కదా!" అని ఓ అయిదు రూపాయలనోటు బేరర్‌కి అందించి—"ఈ వెంకన్న ఎవ్వరికీ ఉత్తినే డబ్బులు యివ్వడు. ఆ విషయం గుర్తుంచుకుంటే నీకు యింకా డబ్బులొస్తాయి" అన్నాడు.

## 5

రంగారావు గురించి వెంకన్న చాలా వాకబులు చేశాడు. రంగారావుకు స్నేహితులేగానీ స్నేహితురాళ్ళు యెవ్వరూ లేరు. రంగారావు స్నేహితుల లిస్టు మరీ చిన్నది కాదు.

వెంకన్న తన వాకబులోకి వచ్చిన ప్రతి యింటికీ వెళ్ళాడు. ఎవరి వద్దనూ కూడా రంగారావు గురించి పని

కొచ్చే సమాచారం అతనికి దొరకలేదు. అయినా ఓపికగా అతను ఒకో వ్యక్తి దగ్గరకీ వెడుతూంటే బేరర్— "కథల్లో చదివి డిటెక్షన్ అంటే సరదాగా ఉంటుందని తప్పు 'అభిప్రాయంలో వుండేవాణ్ని. ఇంత బోర్ వ్యవహారం ఎక్కడా వుండదు" అన్నాడు.

రంగారావుకు బాగా దగ్గరివాడుగా భావించబడే విశ్వనాథం వాళ్ళకు రెండ్రోజుల వరకూ దొరకలేదు. వాళ్ళెప్పుడు వెళ్ళినా అతడి ఇల్లు తాళంవేసి వుంటోంది.

మూడోరోజున ఆ ఇంటి తలుపులు తాళంతీసే వుండటంతో వెంకన్న, బేరర్ కూడా తేలిగ్గా నిట్టూర్చారు.

విశ్వనాథం ఇంట్లోనే వున్నాడు.

"మీ కోసం రెండ్రోజుల్నించి తిరుగుతున్నాం—" అన్నాడు వెంకన్న తనను పరిచయం చేసుకున్నాక.

"ఒంటరిగాణ్ని—అలా తిరుగుతూంటాను" అన్నాడు విశ్వనాథం.

వెంకన్న అడిగిన ప్రశ్నలకు అతను చాలా ఓపిగా సమాధానం చెప్పాడు. రంగారావు అంటే అతనికి చాలా గౌరవ భావముంది. అతన్నించికూడా వెంకన్నకు పనికొచ్చే సమాచార మేదీ దొరకలేదు.

ఇద్దరూ బయటకు వచ్చేక బేరర్ కంగారుగా, "అయనెదురుగా చెప్పడం బాగుండదని ఊరుకున్నాను. ఆ రోజు హోటల్ కు వచ్చిన అమ్మాయి ఫోటో మనం కూర్చున్న గదిలో ఫోటో ఫ్రేంలో వుంది" అన్నాడు.

వెంకన్న వులిక్కిపడి—"ఏమన్నావ్?" అన్నాడు. బేరర్ చెప్పబోతుంటే అతన్ని వారించి "మళ్ళీ చెప్పనక్కరలేదులే—ఆశ్చర్యం పట్టలేక అలా అడిగానుకానీ

నువ్వు చెప్పింది నా బుర్రలోకి ఎక్కనే ఎక్కింది" అని చటుక్కున వెనక్కు తిరిగి మళ్ళీ విశ్వనాథం ఇంటితలుపు తట్టాడు.

విశ్వనాథం తలుపుతీసి వెంకన్నను చూసి ఆశ్చర్యపడి, "ఇప్పుడేగా...." అని ఏదో అనబోతూండగా "కొన్ని ముఖ్యమైన ప్రశ్నలు అడగడం మర్చిపోయాను. అన్యథా భావించకూడదు?" అన్నాడు వెంకన్న.

"అయ్యో-దానిదేముంది? రంగారావు నా ప్రాణ మిత్రుడు. అతన్ని హత్యచేసినవాణ్ని పట్టుకోవడానికి నేను చేయగలిగిందల్లా మీరడిగిన ప్రశ్నలకు జవాబుచెప్ప డమే గదా?" అన్నాడు విశ్వనాథం.

మళ్లీ ముగ్గురూ డ్రాయింగ్ రూంలోకి వెళ్ళారు— "ఈమధ్య ఎప్పుడయినా రంగారావు దిగులుగా కనబడ్డం గానీ బెంగతో అదోలా ఉండడంగానీ మీరు గమనిం చారా?" అన్నాడు వెంకన్న—"ఇదిచాలా ముఖ్యమైన ప్రశ్న. బాగా ఆలోచించి దీనికి జవాబివ్వండి—"

విశ్వనాథం ఆలోచనలో పడ్డాడు.

నిజానికి వెంకన్నకు విశ్వనాథ మివ్వబోయే జవాబుపై ఆసక్తిలేదు. అందువల్ల అతను గదిని శ్రద్ధగా పరిశీలించ సాగాడు.

గదిలో టేబుల్ మీద ఓ జంట ఫోటోఫ్రేం వుంది. ఒకపక్క విశ్వనాథం, మరోపక్క ఓ అందమయిన యువతి వున్నారు. సర్వర్ గుర్తుపట్టిన వ్యక్తి ఆమేనని వెంకన్న ఊహించాడు.

అద్భుత సౌందర్యంతో వెలిగిపోతున్న ఆ ముఖం కలి గిన మనిషి హృదయం ఒక హత్యకు ప్రోత్సహించగలదా? అని ఆలోచనలో పడ్డాడు వెంకన్న.

"నాకు గుర్తున్నంతవరకూ రంగారావులో ప్రత్యేకమైన మార్పేదీ గమనించలేదు నేను" అన్నాడు విశ్వనాథం కాసేపు ఆలోచించి.

"ఈ సమాధానం చెప్పడానికి చాలా కష్టపడ్డావులే" అని మనసులో అనుకొని—"ఆ ఫోటో(ఫ్రేంలో వున్న అమ్మాయెవరు?" అడిగాడు వెంకన్న.

"ఏం—అలా అడుగుతున్నారు. ఆమె నా భార్య!" అన్నాడు విశ్వనాథం ఆశ్చర్యంగా.

"మీరు ఒంటరిగాణ్నని చెప్పినట్లు గుర్తు" అన్నాడు వెంకన్న.

"భార్య పుట్టింట్లో వుంటే ఒంటరిగాణ్ని కాక ఏమవుతాను?" అని నవ్వాడు విశ్వనాథం.

"అలాగా—ఇందాకా నేనింకోలా అర్థం చేసుకున్నాలెండి—మీ ఆవిడ పురిటికెళ్ళిందా?"

"పురుడూ లేదు ఏం లేదు. తలిదండ్రుల కొక్కర్తే కూతురు. గారంగా పెరిగింది. వారం వారం అమ్మానాన్నల్ని చూడాలంటుంది. ఏదో నెలకీ రెండు నెల్లకీ ఓసారి తప్పనిసరయి పంపిస్తూంటాను...."

"పుట్టిల్లెక్కడేమిటి?"

"రాజమండ్రీయే లెండి. ఇలా వెళ్ళి అలా వచ్చేస్తుంటుంది. ఈసారి ఏమయిందో కాస్త ఆలస్యమయింది. అయినా నాకూ పెద్దబాధలేదు. ఎక్కువగా బయట తిరగటం నా కలవాటు" అన్నాడు విశ్వనాథం.

"మీ అత్తారిల్లు రాజమండ్రీయా — నా తోడల్లుడిది కూడా రాజమండ్రీయే. మీ వాళ్ళిల్లు దానవాయిపేటలోగానీ లేదుకదా?" అన్నాడు వెంకన్న.

విశ్వనాథం తనభార్య పుట్టిల్లు అడ్రసు చెప్పి "ఏమిటీ

వివరాలన్నీ అడుగుతున్నారు?" అన్నాడు.

వెంకన్న నవ్వి—"సంభాషణ ఒకోసారి మనకు తెలీకుండానే తప్పుదార్లు తొక్కుతుంది. ఒకసారి నేను పంచాంగం కోసం పక్కింటికి వెళ్ళి బ్రిడ్జిగురించి ఓ గంట సేపు చర్చించి పంచాంగం తేకుండానే వెనక్కి వచ్చేశాను. రంగారావు హత్యకేసు ముందుకెళ్ళేలా లేదు. కనీసం మీవంటి వాడితో పరిచయమైంది." అంటూ లేచాడు.

డిటెక్టివ్ మాటలు విశ్వనాథానికి అర్థంకాలేదు.

# 6

"నా పేరు వనజ. విశ్వనాథంగారి భార్యను—" అంది ఆమె.

ఫోటోను మించిన అందం కలిగిన ఆమెపైనుండి వెంకన్న చూపులు వెంటనే మరల్చుకోలేక పోయాడు.

"మీ పరిచయం నా అదృష్టం. కానీ నా పరిచయం మీకు అదృష్టమని నాకు తోచడంలేదు...." అన్నాడు వెంకన్న.

"ఎవరు మీరు?" అంది వనజ కంగారుగా.

"నా పేరు వెంకన్న. నేనొక డిటెక్టివ్‌ను" అన్నాడు వెంకన్న.

"నాతో మీకేం పని?" భయం ఆమె కళ్ళలో స్పష్టంగా కనబడింది.

"ద్వారకా లాడ్జిలో రంగారావనే అతను హత్యచేయబడ్డాడు...." అని ఆగాడు వెంకన్న.

"అయితే....?" అంది వనజ.

"ఆ రంగారావు మీ భర్తకు ఆప్తమిత్రుడు."

"అయ్యో—ఆ రంగారావుగారు చచ్చిపోయ్యారా?"

అంది వనజ ఆశ్చర్యంగా.

"నేను మీ ఇంటికొచ్చే సమయానికి ఇంట్లో మీరు ఒక్కరే వుండడం నా అదృష్టం. శాస్త్రీగా మాట్లాడే అవకాశం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. రంగారావు గారు చచ్చిపోయారన్న విషయం మీకు తెలుసు. అసలు రంగారావును చంపింది మీరేనని పోలీసులు అభిప్రాయ పడుతోన్నారు" అన్నాడు వెంకన్న తాపీగా.

"ఆయన్ను నే నెందుకు చంపుతాను?" అందామె వణికిపోతూ.

"ఎందుకు చంపుతారో నాకూ తెలియదు. శిక్షించ డానికి ఎన్నో ఇతర సాధనాలుండగా మనిషి మనిషిని ఎందుకు చంపుతాడన్నది నాకు ఆశ్చర్యం కలిగించే విషయం...." అన్నాడు వెంకన్న.

వనజ శరీరంలో వణుకు ప్రారంభమైంది. "మీ మాటలు నాకు అర్థంకావడంలేదు. మీరేం చెప్పదల్చు కున్నదీ వివరంగా చెప్పండి" అంది.

"మీరూ, రంగారావూ కలిసి ద్వారకాలాడ్జిలో రూం నెంబరు పదిహేడులో దిగారు. రాత్రి తొమ్మిది గంట లకు ఇద్దరూ తలుపులేసుకున్నారు. ఓ అర్ధరాత్రివేళ రంగా రావు చంపబడ్డాడు. గదిలోంచి మీరు మాయమయ్యారు. వీటన్నింటికీ బలమైన సాక్ష్యాలున్నాయి. మీరు కాదన లేరు. రంగారావు హత్యగురించి మీకు తెలియదనటానికి లేదు. గదిలోని మీ వేలిముద్రలుకూడా పోలీసులు తీసు కున్నారు."

"నా గురించి పోలీసులెలా తెలుసుకోగలిగారు?" అంది వనజ ఆశ్చర్యంగా.

"మీ గురించి ఇంకా పోలీసులకు తెలియదు. నేను

మాత్రమే తెలుసుకోగలిగాను" అన్నాడు వెంకన్న.

వనజ నిట్టూర్చి—"వెంకన్నగారూ! దయతో మీరు నన్ను అర్థంచేసుకోండి. మీకు అంతా నిజం చెప్పేస్తాను. నా పేరు పోలీసుల వద్దకు చేరకుండా చూడండి" అంది.

"నేరస్తుల్ని నేను కాపాడలేను" అన్నాడు వెంకన్న.

"నేను చేసింది నేరమో కాదో చెప్పేముందు నా కథ వినండి" అంది వనజ.

"చెప్పండి!" అన్నాడు వెంకన్న.

• • •

విశ్వనాథం, వనజ, రంగారావు, అతని భార్య సరిత నలుగురూ విశ్వనాథం ఇంట్లో భోజనాలు చేశారు. భోజనాలయ్యేక కాసేపు కబుర్లు జరిగాయి.

"వంటలు అద్భుతం" అన్నాడు రంగారావు.

"పొరుగింటి పుల్లకూర-అంతేలెండి!" అన్నాడు విశ్వనాథం.

"అదేం కాదు-మీ ఆవిడ చేయి మాహాత్మ్యం. ఇక్కడ భోంచేశాక మిమ్మల్ని మా ఇంటికి భోజనానికి పిలవాలంటే భయంగా వుంది" అంది సరిత.

"మా ఆవిడ ఇంతవరకూ ఎవరి వంటనూ మెచ్చుకోగా చూడలేదు. యూగాటే శేర్ సర్టిఫికేట్" అన్నాడు రంగారావు.

"మీ ఇంటికి భోజనానికి పిలవడం యెగేయాలని చూస్తున్నారేమో - అదేం కుదరదు" అంది వనజ.

అంతా నవ్వేశారు. రంగారావు నెమ్మదిగా- "ఋణముంచుకోవడం నా కిష్టముండదు. అందుకే కూడా ఓ అద్భుతం తెచ్చాను" అన్నాడు.

"ఏమిటది?" అంది కుతూహలంగా సరిత. తనకు

తెలియకుండా తన భర్త తెచ్చిన ఆ అద్భుతం ఏమిటో ఆమెకు తెలుసుకోవాలనిపించింది.

రంగారావు తన జేబులోంచి నాలుగు రుమాళ్ళు తీశాడు. వనజవంక చూసి "నాకు కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టగలరా?" అనడిగాడు.

"అయ్యో ఎంతమాట?" అంటూ వనజ అక్కణ్నించి లేచి లోపలికి వెళ్ళింది.

రంగారావు ఒక జేబురుమాలు విశ్వనాథానికీ, మరొకటి సరితకూ ఇచ్చాడు.

"ఇది ఒక అద్భుతమైన ఫారిన్ సెంట్! దీన్ని వాసన చూస్తే ఏవో ఇతర లోకాల్లోకి తేలిపోతున్నట్లు అనిపిస్తుంది. ఇది ఎంతో ఖరీదయినది. ఈ రోజుకోసం ప్రత్యేకంగా తెప్పించాను" అన్నాడు రంగారావు.

అతని నోటివెంట మాటలు పూర్తికావడం తడవుగా విశ్వనాథం, సరిత — ఇద్దరుకూడా రుమాలు వాసన చూశారు. తర్వాత వారి నోటివెంట మాటలురాలేదు. కూర్చున్నవాళ్ళు కూర్చున్నట్లుగానే సోఫాలో వెనక్కు జారగిలబడిపోయారు. ముఖాల్లోమాత్రం అద్భుతమయిన దృశ్యం చూస్తున్న అనుభూతి ఇద్దరికీ కనబడుతోంది. ఇద్దరి కనులూ మూతలు పడినాయి.

వనజ మంచినీళ్ళ గ్లాసుతో వెనక్కు వచ్చేసరికి కనులు మూసుకుని వున్న విశ్వనాథం సరిత కనబడ్డారు. "అదేమిటి—ఏమైంది వాళ్ళకు?" అందామె ఆశ్చర్యంగా.

"ఇద్దరూ నిద్ర నటిస్తున్నారు. మీకో తమాషా చెబుతాను. ఆ గదిలోకి రండి" అన్నాడు రంగారావు.

అతన్నామె ఏ మాత్రమూ అనుమానించలేదు.

రంగారావామెను పడకగదిలోకి నడిపించి చటుక్కున

తలుపులువేసి ఆమెను కౌగలించుకున్నాడు.

ఆమె కంగారుపడి "ఇదేమిటి?" అంది.

"ఇదో థ్రిల్ నాకు. నీ భర్త ఆహ్వానం మీద నీ యింటికి వచ్చి నిన్ననుభవించి వెళ్ళడం నాకు ఆనందం. ఎంతో కష్టపడి సంపాదించానొక ఫారిన్ సెంట్. అది వాసన చూసిన వాళ్ళకు మూడు నాలుగుగంటల దాకా స్పృహ తెలియదు. స్పృహ వచ్చేక కూడా ఎంతో ఆనందంగా వుంటారు. ఇప్పుడు వాళ్ళిద్దర్నీ ఆ స్థితిలో ఏం చేసినా ప్రతిఘటించలేరు. వాళ్ళనలా వదిలేసి మనం హాయిగా సుఖిద్దాం. మన ఇరువురికీ సంబంధించిన యీ అనుబంధం మన ఇద్దరి మధ్యనూ శాశ్వతంగా రహస్యంగా ఉండిపోతుంది" అన్నాడు రంగారావు.

వనజ కంగారుగా "మీకు థ్రిల్ కావచ్చు. నాకు యిష్టంలేదు" అంది.

"ఇష్టమున్నా లేకపోయినా నువ్వు అసహాయురాలివి. విస్తట్లో పంచభక్ష్య పరమాన్నాలున్నాయి. తినాలనుకునే వాణ్ని ఆ పంచభక్ష్య పరమాన్నాలూ అభ్యంతర పెట్టలేవు" అన్నాడు రంగారావు.

"నేను ప్రతిఘటిస్తాను" అంది వనజ.

"ప్రతిఘటించి చూడు" అన్నాడు రంగారావు.

వనజ ప్రతిఘటించడానికి ప్రయత్నించి ఓడిపోయింది. ఆ ఓటమి అంతటితో ఆగలేదు. ఆమె రంగారావుకు పూర్తిగా వశమైపోయింది.

తనకు లొంగిన ఆడదని వనజను రంగారావు ఏ మాత్రమూ అశ్రద్ధ చేయలేదు. మాటిమాటికీ వనజను పొగిడేవాడు. ఆమెను అర్ధాంగిగా పొందలేకపోవడం తన దురదృష్టమన్నాడు. ఆమెతో అనుభవమయ్యాక మళ్ళీ

ఆడదానిపైనా తన దృష్టిపోవడంలేదన్నాడు. రహస్యంగా డబ్బు ఇస్తూండేవాడు.

విశ్వనాథం వనజను బాగా అలక్ష్యం చేసేవాడు. అతనికి బాగా బయటతిరుగుళ్ళు యెక్కువ. ఎప్పుడైనా భార్య వారిస్తే విసుక్కునేవాడు.

కొంతకాలం గడిచేసరికి అటు తన యింట్లో భర్త ఎదుటా, సరిత యింట్లో ఆమె యెదుటా రంగారావుకు లొంగిపోవడంలో ఒకరకమైన థ్రిల్ కూడా కనబడింది వనజకు.

ఇవన్నీ కలిసి వనజను రంగారావుకు పూర్తిగా లొంగదీశాయి. అతన్ని ఆమె ఆరాధించటం ప్రారంభించింది.

* * *

"అతనిమీద ఆరాధనతో నేనేం చేస్తున్నానో నాకే తెలియదు. అలాగే ద్వారకా లాడ్జికి కూడా వెళ్ళాను" అంది వనజ.

"బాగుంది. మీ ఆయనతో పుట్టింటికని చెప్పి యిలా తిరిగేవారన్న మాట!" అన్నాడు వెంకన్న.

వనజ బాధగా నవ్వి తలాడించింది.

"అయితే రంగారావును యెందుకు చంపేశారు?"

"నేనతన్ని చంపలేదు. రాత్రి ఆలశ్యంగా పడుకున్నాం. ఆరుగంటల ప్రాంతంలో నాకు మెలకువ వచ్చింది. లేచిచూస్తే పక్కన అతను హత్యచేయబడి వున్నాడు" అంది వనజ.

"ఎవరైనా నమ్మే కథేనా యిది!"అన్నాడు వెంకన్న.

"మీరు నమ్మినా నమ్మకపోయినా యిది నిజం! హత్యకూ నాకూ ఏ సంబంధమూ లేదు. మీరు నన్ను రక్షించాలి" అంది వనజ.

"ఇప్పుడు రక్షించమని ఏం లాభం? వెంటనే పోలీసులకు చెప్పివుండాల్సింది."

"ఎలా చెప్పను? చెబితే రంగారావు గదిలో నేనెందుకున్నానో చెప్పాల్సి వస్తుంది. ఆ విషయం బయటపడితే నా భర్త నన్ను వదిలిపెట్టేస్తాడు. నా బ్రతుకు కుక్కలు చింపిన విస్తరి అవుతుంది" అంది వనజ.

"ఇప్పుడెలాగూ మీ కథ బయటపడక తప్పదు" అన్నాడు వెంకన్న.

"నన్ను కాపాడలేరా?" అంది వనజ దీనంగా.

"మీరు చెప్పినదంతా నిజమైతే కొంతవరకూ ప్రయత్నిస్తాను. మీరు చెప్పినదాంట్లో అబద్ధమున్న పక్షంలో నేను మీకు ఏ సహాయమూ చేయలేను!" అన్నాడు వెంకన్న.

"ఒక్క అక్షరం పొల్లుపోకుండా అంతా నిజమే చెప్పాను మీకు" అంది వనజ.

ఆమె నిజమే చెబుతున్నదని వెంకన్నకూ అనిపించింది.

## 7

"ఒక ముఖ్యవిషయం మాట్లాడాలని మళ్ళీ మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు వెంకన్న.

"మీరు నిజంగా డిటెక్టివ్ లేనా అని అనుమానంగా వుంది నాకు" అంది సరిత.

"ఏం?" అన్నాడు వెంకన్న ఆశ్చర్యంగా.

"ఒక పర్యాయం నాతో మాట్లాడిన మగాళ్ళు చాలా మంది యేదో వంక పెట్టుకుని మళ్ళీ వచ్చారు. మీరూ అలాంటివారే ననిపిస్తోంది" అంది సరిత.

"ఎంత మాటన్నావు తల్లీ!" అనుకున్నాడు వెంకన్న. పైకిమాత్రం "మగవాళ్ళలో లేని దురూహాల్ని స్ఫురింప

జేయడంకోసం యిలా కొందరు ఆడవాళ్ళు మాట్లాడ్డం నాకు అనుభవంలో వుంది. భర్తపోయి పుట్టెడు దుఃఖంతో వున్న మిమ్మల్ని అలా అనుమానించడం న్యాయమా అని తటపటాయిస్తున్నాను" అన్నాడు.

సరిత ముఖంలో కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు "నా గురించి యెవరైనా అడగండి చెబుతారు" అంది కోపంగా.

"నా ప్రవర్తనే నాకు గీటురాయి. నన్ను గురించి తెలుసుకోవడానికి ఒకరినడిగి తెలుసుకోమనడం అవమానంగా భావిస్తాను నేను" అన్నాడు వెంకన్న.

సరిత కంఠం దీనంగా మారిపోయింది "మన్నించండి-మీ మనస్సు నొప్పించినట్లున్నాను. అర్ధాంతరంగా నా భర్త హత్య కావించబడడంతో నా మనసు పాడయింది. మాటల్లో మర్యాద లోపిస్తోంది."

"అలా అన్నారు కాబట్టి చెబుతున్నాను. మీ అనుమానం అర్ధరహితం కాదు. ఒకసారి చూస్తే మళ్ళీ మళ్ళీ చూడాలనిపించే ఆకర్షణ మీలో వుంది. ఇలాంటి భార్య వుండీ మీ భర్త పరస్త్రీ వ్యామోహానికి గురికావడం నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు వెంకన్న.

"నా భర్తకు పరస్త్రీ వ్యామోహమా? అసాధ్యం!" అంది సరిత.

"ముందు నేను చెప్పే కథ వినండి" అంటూ వనజ చెప్పిన కథ సరితకు వినిపించాడు వెంకన్న.

"ఇవన్నీ మీ కెలా తెలిసాయి?" అంది సరిత ఆశ్చర్యంగా.

"ఇప్పటికైనా నన్ను గ్రహించగలరనుకుంటాను. నా పేరు వెంకన్న. నేను డిటెక్టివ్ ను."

"మీరు చెప్పింది కథలా వున్నప్పటికీ అందులో నిజం వున్నదనిపిస్తోంది. నా భర్త ఆ సెంటు వాసన చాలా పర్యాయాలు చూపించారు నాకు. చూసినప్పుడల్లా మరో సారి ఆ పరిమళాన్నాఘ్రాణించాలనిపించేది. అదొక అపూర్వ అనుభవం. వనజ సమక్షంలో ఎన్నో పర్యాయాలు నేనా పరిమళ ప్రభావానికి గురై అచేతనురాలిగా వున్నాను. ఇందులో యింతకథ వున్నదని తెలియదు నాకు" అంది సరిత బాధగా నిట్టూర్చి.

వెంకన్న ఆమెవంక చిత్రంగా చూసి "మీ భర్త గురించి యిప్పుడేమనిపిస్తోంది మీకు?" అనడిగాడు.

"చాలా బాధగా వుంది నాకు" అందామె. ఆమె కంఠం జీరవోయింది "నా భర్త యీ విధంగా ప్రవర్తిస్తున్నాడని ఈ క్షణంవరకూ తెలియదు. ఇప్పుడైనా నమ్మాలనిపించడంలేదు. నమ్మే పక్షంలో నా భర్తతో చేరింది ఒక్క విశ్వనాథం భార్య వనజ మాత్రమేకాదు. ఇంకా నలుగురున్నారు" అని ఆమె ముఖం కప్పుకుని ఏడవసాగింది.

"ఏడ్చి ప్రయోజనం లేదు. అందగత్తెనన్న అహంకారం మీకు బాగావుంది. ఆ అహంకారంపై దెబ్బ తీయడానికే మీకు భగవంతుడిలాంటి భర్తనిచ్చాడు...." అన్నాడు వెంకన్న.

సరిత అలాగే ఏడుస్తోంది.

"నేను వెళ్ళేక తీరుబడిగా శోకిద్దురుగాని ఇప్పటికి మీభర్త నిజస్వరూపం తెలిసింది. విశ్వనాథంగానీ, మిగతా ఆ నలుగురిలో ఒకరుకానీ మీవారి కథ తెలుసుకుని ఈ హత్య చేసివుండాలి. కాబట్టి ఆ నల్గురి గురించీ కూడా

"డిటెక్టివ్‌ను. పేరు వెంకన్న!"

ఆమె కాస్త తేలిగ్గా నిట్టూర్చింది "మీరడిగిన ప్రశ్నలన్నిటికీ నాకు తెలిసినంతవరకూ జవాబిస్తాను. నన్ను నలుగురి నోళ్ళలోనూ పడకుండా చేయండి" అందామె.

వనజకులాగే నీరజ కూడా రంగారావుకు లొంగిపోయింది. రంగారావంటే నీరజకు అసహ్యం లేదు కానీ ఆమె భర్తను ప్రాణాధికంగా ప్రేమిస్తోంది. భర్తను మోసం చేయవలసివచ్చినందు కామెకు యెంతో బాధగా వుంది. రంగారావుతో ఆమె యెప్పుడూ హోటళ్ళకు వెళ్ళడం జరగలేదు. రంగారావు చనిపోయాడని తెలిసి ఆమె ఎంతో సంతోషించింది. జరిగినదేదో జరిగిపోయింది. ఇకముందైనా నీతిగా బ్రతకవచ్చునని ఆమె అనుకుంటోంది.

వెంకన్నకు ఆమె దగ్గర్నుంచి అంతకుమించిన సమాచారం రాలేదు. ఆమె జవాబులు చెప్పిన పద్ధతినిబట్టి ఆమె నిజమే చెబుతోందని అతననుకున్నాడు.

తర్వాత వెంకన్న వసంతనూ, గౌరినీ కలుసుకున్నాడు. ఇద్దరూ కూడా తమ నేరాలను ఒప్పుకున్నారు. రంగారావు మరణం వారికి చాలా పెద్ద రిలీఫ్ ఇచ్చింది. ఇద్దరూ కూడా తమ భర్తలను మనసారా ప్రేమిస్తున్నారు. వాళ్ళూ రంగారావుతో హోటళ్ళకు వెళ్ళలేదు.

కథ ముందుకు వెడుతున్నకొద్దీ వెంకన్నకు ఆశ్చర్యం కలుగుతోంది. సరిత తనకు యిచ్చిన అడ్రసులు సరైనవి కావేమోనని అతననుమానించాడు కానీ ఆమె సరైనవే యిచ్చింది. ఎటొచ్చీ తను కలుసుకున్న ముగ్గురి దగ్గర్నుంచీ తను తెలుసుకున్న విషయాన్ని బలపరిచే సమాచారమైతే దొరికింది తప్పితే కొత్త సమాచారమేదీ దొరకలేదు. ఏదైనా లభిస్తే ఆఖరుమనిషి పద్మ దగ్గరే లభించాలి.

వెంకన్న పద్మ దగ్గరకు వెళ్ళాడు. మిగతా ముగ్గురి మీదా ఈమె యింకా యెక్కువ అందంగా వుంది. రంగారావు అభిరుచిని అభినందించక తప్పదు అను కున్నాడు వెంకన్న.

"మా వారింట్లో లేరు" అంది పద్మ.

"నాకు మీ తోనే పని!" అన్నాడు వెంకన్న.

"ఎవరు మీరు?"

"నా పేరు వెంకన్న. డిటెక్టివ్ ను."

ఆమె కాస్త కంగారుపడి "డిటెక్టివ్ లకు నాతో పనేమిటి?" అంది.

"రంగారావు హత్యకేసు విషయంలో పరిశోధిస్తూ ఇలా వచ్చాను."

భయం పద్మ కళ్ళలో స్పష్టంగా కనబడింది "రంగా రావు హత్యకూ నాకూ ఏమిటి సంబంధం?"

"ఫారిన్ సెంటు!" అన్నాడు వెంకన్న.

పద్మ వులిక్కిపడి "లోపలకు రండి!" అంది.

ఇద్దరూ కుర్చీలో కూర్చున్నాక వెంకన్న నెమ్మదిగా "రంగారావు గురించి మీకు తెలిసినదంతా చెప్పేయండి. తాళికట్టిన భార్య కాకపోయినా మీరాయనకు భార్యలా వ్యవహరించినట్లు నా దగ్గర రుజువులున్నాయి" అన్నాడు.

పద్మ ముఖం ఎర్రగా అయింది "మీరేమంటున్నారో నాకు తెలియడంలేదు" అంది.

"ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రంగారావుకీ మీకూ అక్రమ సంబంధం వుంది—" అన్నాడు వెంకన్న తాపీగా.

పద్మ కిలకిలా నవ్వి—"చాలా మంచి జోకు. ఇంకా ఏమైనా చెప్పాలా?" అంది.

చెప్పింది" అన్నాడు వెంకన్న.

"వెంకన్నగారూ! నా భర్తను చంపిన హంతకుడు తెలియనక్కరలేదు. ఆయన పాపం ఆయన్నే కొట్టింది. మీరీ విషయాన్నింతటితో వదిలిపెట్టేస్తే కనీసం మా కుటుంబపరువు దక్కుతుంది" అంది సరిత.

"చూడమ్మా! కేసులో కొంతవరకూ వచ్చేక దాని అంతు తేల్చకపోతే నా పరువు పోతుంది. మీ ఇంటిపరువు రచ్చకీడ్వక తప్పదు. ఎందుకంటే మీ భర్త చేసిన తప్పు సామాన్యమైనది కాదు. కులసతులను చెరుస్తున్నాడు. పూర్వకాలంలో విన్న రావణాసురుడు వగైరాలకంటె ఘోరమైనవాడు మీ భర్త. తమకున్న అద్భుత శక్తులతో రాజ్యాల్నేలడానికే చూశారు తప్పితే ఆడదాన్ని మాత్రం ఈ పద్ధతిలో వంచన చేయలేదు వాళ్ళు. ఇలాంటి వాళ్ళు కొందరుంటే యెంతో మంచిదైన మన సంస్కృతి మట్టిపాలు కావడానికి యెంతో వ్యవధి అవసరంలేదు. ఈ ఫారిన్ సెంట్ గురించీ దాని ప్రభావం గురించీ దీన్ని కొందరు ఉపయోగించుకునే పద్ధతి గురించీ అంతా తెలుసు కోవడం అవసరం" అన్నాడు వెంకన్న.

"అందువల్ల మరికొందరిని నేరాలకు ప్రోత్సహించిన వారౌతారేమో!" అంది సరిత.

"అందుకు అవకాశాలున్నాయి. కానీ కొందరు దుష్టులుంటారని భయపడి ఒక ప్రమాదకరమైన విషయం గురించి శిష్టులను హెచ్చరించకుండా ఊరుకోవడం మంచిదికాదు" అన్నాడు వెంకన్న.

ఏమనుకుందో సరిత వెంకన్నకు తన భర్త వెళ్ళే మిగతా నలుగురు స్నేహితుల గురించీ కూడా చెప్పింది.

# 8

వెంకన్న ముందుగా నీరజ యింటికి వెళ్ళాడు. రంగారావు ఫారిన్ సెంట్ ప్రభావం చూపించిన మిగతా నలుగురు ఆడవాళ్ళలోనూ నీరజ ఒకతె!

వెంకన్న ఆమె యింటికి భర్త లేని సమయం చూసి వెళ్ళాడు.

"ఆయన ఇంట్లో లేరు!" అంది నీరజ.

"నేను మీతోనే మాట్లాడ్డానికి వచ్చాను" అన్నాడు వెంకన్న.

ఆమె కళ్ళలో బెదురు కనిపించింది "ఎవరు మీరు?"

"రంగారావుకూ మీకూ వున్న ఫారిన్ సెంట్ వ్యవహారం గురించి తెలిసినవాణ్ని...."

ఆమె దాదాపు వణికిపోయింది "మీరేమంటున్నారో నాకు తెలియడంలేదు" అంది.

"అర్థమయ్యేలా చెబుతాను నన్ను లోపలకు రానిస్తే! ఇది బొత్తిగా గుమ్మందగ్గర మాట్లాడే విషయంకాదు. మీరు వీధితలుపులు తీసేవుంచండి-అక్కడ అలా కూర్చుని మాట్లాడుకోవచ్చు" అన్నాడు వెంకన్న.

ఇద్దరూ హాల్లోకి వెళ్ళి చెరో కుర్చీలోనూ కూర్చున్నారు.

"మీరు నా దగ్గర ఏం దాచినా ప్రయోజనంలేదు. నేను మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేయడానికి రాలేదు. నేను రంగారావు హత్యకేసు గురించి పరిశోధిస్తూ యిలా వచ్చాను. ఆ హత్య గురించి మీ వద్దనుంచి పనికివచ్చే విషయాలేమైనా తెలుస్తాయని నా ఆశ!" అన్నాడు వెంకన్న.

"ఎవరు మీరు?"

"అందమైన ఆడవాళ్ళతో జోక్ చేయడం నా హాబీ కాదు. పరాయి మగాడితో అక్రమ సంబంధముందని చెప్పగా విని హాయిగా నవ్విన ఆడదాన్ని మిమ్మల్నే చూశాను—" అన్నాడు వెంకన్న.

"ఉన్నమాటంటే ఉలుకు గానీ—జోక్సుకు కోప మెందుకు?" అంది పద్మ.

"నేను జోక్ చేయనని ముందే చెప్పాను...."

"మీరు చెప్పేది జోక్ కాదనుకోండి—ఒకసారి మా ఆయనతో ఇదే ముక్క అని చూడండి. అందులోని జోక్ మీకే తెలుస్తుంది—" అంది పద్మ.

"ఫారిన్ సెంట్ కథ విన్నాక కూడా మీ భర్త మిమ్మల్ని నమ్ముతాడనుకున్నారా" అన్నాడు వెంకన్న.

"యేమిటా ఫారిన్ సెంటు కథ?—" అనడిగింది పద్మ.

"యేమీ యెరుగనట్లు అడుగుతున్నారు. అయినా చెబుతున్నాను—" అంటూ వెంకన్న రంగారావు ఫారిన్ సెంటు ప్రభావంతో ఏ విధంగా వశపర్చుకుని ఉంటాడో చెప్పాడు.

"మీరు మంచి జోక్స్ వేయడమే కాదు. కథలు కూడా అల్లగలరు...." అని నవ్వింది పద్మ—"మీరు నిరభ్యంతరంగా యీ కథను మా వారికి చెప్ప వచ్చును—"

వెంకన్నకు చాలా కోపం వచ్చింది. పద్మ యిలాగన డానికి కారణం అతనికి తోచలేదు. భర్తకు చెబుతానని బెదిరించి సమాచారం లాగాలని అత ననుకున్నాడు. కానీ ఆమె బెదరడంలేదు. ఈ వ్యవహారం అంతుతేల్చాలంటే

పద్మ భర్తను కలుసుకోవాలి.

వెంటనే వెంకన్న పద్మ భర్త పని చేసే ఆఫీసుకు వెళ్ళాడు.

పద్మ భర్త పేరు ప్రకాశం. వెంకన్న ఎవరో తెలియక కంగారుపడ్డాడు.

"మీతో యేకాంతంగా మాట్లాడాలి!" అన్నాడు వెంకన్న.

ఆఫీసు భవనానికి ముందున్న పార్కులో ఇద్దరికీ ఏకాంతం లభించింది.

తన తెలివితేటలన్నీ క్రోడీకరించి వెంకన్న అతన్ని బుట్టలో వేయాలనుకొన్నాడు—"మీ మిత్రుడు రంగారావు హత్య కేసు విషయంలో మీమీద పోలీసులకు కొన్ని అనుమానాలు వచ్చాయి. వాళ్ళ దృష్టి మీపైన పడేలోగా మిమ్మల్ని హెచ్చరించాలని వచ్చాను...." అన్నాడు.

"రంగారావును నే నెందును చంపుతాను?" అన్నాడు ప్రకాశం.

"ఎందుకా?" అని నవ్వాడు వెంకన్న—"రంగారావు ఫారిన్ సెంటుతో మిమ్మల్ని నిద్రపుచ్చి మీ ఎదుటనే మీ భార్యను లొంగదీసుకొన్నాడు. ఆ విషయం మీరు గ్రహించి అందులో మీ భార్య దోషమేమీ లేదనీ—తప్పంతా రంగారావుదే ననీ తెలుకొని రంగారావును చంపేశారు. సహృదయంతో మీ భార్యను క్షమించారు...."

"అబద్ధం—! అంతా అబద్ధం!—" అన్నాడు ప్రకాశం.

"మీరది అబద్ధమని అన్నంత కాలమూ మీకు రక్షణ

లేదు. నిజం చెబితే మీకు రక్షణ లభిస్తుంది—"

"ఎవరు మీరు?" అన్నాడు ప్రకాశం.

"వెంకన్న నా పేరు. నా వృత్తి డిటెక్షన్—" అన్నాడు వెంకన్న.

"మీరు నన్నెలా రక్షించగలరో చెప్పండి!" అన్నాడు ప్రకాశం.

కుర్రాడు దారిలోకొస్తున్నాడు అనుకొన్నాడు వెంకన్న—"నేరస్తుల్ని పట్టివ్వడంలో నా ఆసక్తి లేదు. నేరాలు పరిశోధించి విషయాన్ని గ్రహించడం నాకు సరదా! నిజం తెలుసుకొన్నాక దాన్ని బయటపెట్టడం నా యిష్టాయిష్టాలపై ఆధారపడి ఉంటుంది. ఈ కేసులో నేను తెలుసుకొన్న ఫారిన్ సెంటు వ్యవహారం యింకా పోలీసులకు తెలియదు. పోలీసులు తెలుసుకొనే అవకాశం కూడా లేదు...."

ప్రకాశం కళ్ళలో మెరుపు కనిపించింది—"నేను నిజం చెబుతాను. ఎటొచ్చీ రంగారావును చంపలేదంటే అది అబద్ధమని మీరు అనుకోకూడదు...."

"మీరు చెప్పదల్చుకున్న నిజం చెప్పండి!" అన్నాడు వెంకన్న.

ప్రకాశం భార్య ఫారిన్ సెంటు ప్రభావానికి గురై రంగారావుకు లొంగిన మాట నిజం. అయితే ప్రకాశం రంగారావును అనుమానించలేదు. అయితే అతనికి వనజ కారణంగా ఈ ఫారిన్ సెంటు సంగతి తెలిసింది.

వనజ, ప్రకాశం గతంలో ప్రేమికులు. వయసు ఆకర్షణ వారిని కలిపింది. పెళ్ళి చేసుకోవాలని వారు అనుకోలేదు. పెళ్ళయ్యాక మళ్ళీ వాళ్ళు కలుసుకోలేదు. వనజ రంగారావు దగ్గర్నించి కొంత ఫారిన్ సెంటు సంగ్రహించి

దాన్ని భర్తమీద ప్రయోగించి, ఆ సమయంలో ప్రకాశాన్ని తనింటికి రప్పించుకొని సుఖించేది.

ఆమె ధైర్యానికి కారణం తెలిసిన ప్రకాశం, రంగారావు వనజనే కాక తన భార్యనుకూడా లోబర్చుకున్నాడని గ్రహించి కోపంగా ఇంటికి వెళ్ళాడు. పద్మ భర్త ముందు నిజం ఒప్పేసుకొని తను అసహాయురాలిననీ తనకు రంగారావు పైన ప్రేమాభిమానాలు లేవనీ చెప్పి యేడ్చింది.

ప్రకాశం భార్యను క్షమించాడు కానీ ఆమె అసహాయత నతనింకో విధంగా వుపయోగించుకొంటున్నాడు. అతను కావాలనుకొన్నప్పుడు వనజ సరాసరి అతని యింటికే వస్తుంది. వనజ మాత్రమే కాదు—అతను కావాలనుకున్న ఆడవాళ్ళు అతనింటికి వస్తారు. ఎవ్వరూ అనుమానించని ఈ పద్ధతి ప్రకాశానికీ బాగుంది.

"ఒక విధంగా రంగారావు నాకు మహోపకారం చేశాడు. పద్మను పురాణాల్లోని పతివ్రతల స్థాయికి దింపడానికి అతనే కారణం. అలాంటప్పుడు నేను అతన్నెందుకు చంపుతాను?" అన్నాడు ప్రకాశం.

అతని ప్రశ్న సబబేనని అనిపించింది వెంకన్నకు. కానీ ఫారిన్ సెంటు చూపిస్తున్న దుష్పరిణామాలు అతని మనసుకు బాధ కలిగించాయి. రంగారావు వనజను, మరి కొందరు ఆడవాళ్ళను లొంగదీసుకొన్నాడు. వనజ తన కిష్టమైన మగవాళ్ళతో సుఖిస్తోంది. ప్రకాశం—భార్య ఎదుటే వ్యభిచరిస్తున్నాడు.

అన్నింటికీ మూలం—ఫారిన్ సెంట్! ఆ ఫారిన్ సెంటు రంగారావు లాంటి వాడిచేత చిక్కడం!

"మీరు హత్య చేయలేదని నమ్మమంటారా?" అన్నాడు

వెంకన్న.

"నమ్మినా నమ్మకపోయినా ఈ ఫారిన్ సెంటు కథను బయట పెట్టకండి. మీకు కొంత ఫీజు కూడా యిచ్చుకుంటాను...." అన్నాడు ప్రకాశం.

వెంకన్న బాగా ఆలోచించి—"ఈ కథ బయట పెట్టకుండా ఎలా ఉండగలను? ఎందరో ఆడవాళ్ళు అన్యాయానికి బలైపోతున్నారు!" అన్నాడు.

"ఆడవాళ్ళు బలి కావడమేముంది? వాళ్ళూ సుఖిస్తున్నారు కదా—" అన్నాడు ప్రకాశం.

"ఇష్టంలేని మగవాడికి శరీరాన్నర్పించడాన్ని మించిన అన్యాయం ఏ ఆడదానికీ ఉండదు—" అన్నాడు వెంకన్న సాలోచనగా.

హఠాత్తుగా వెంకన్న బుర్రలో ఏదో మెరిసింది—రంగారావుకు లొంగిపోయిన ఆడవారిలో ఎవరో ఒకరికి అతనంటే అసహ్యమై ఉండవచ్చు. ఆమెను రంగారావు బలవంతంగా అనుభవించి ఉండవచ్చు. ఆమె అతనిపై పగ బూని అతన్ని చంపి ఉండవచ్చు.

ఇంతవరకూ అనుమానితులు ఆరుగురు తేలారు. వనజ, నీరజ, వసంత, గౌరి, పద్మ, ప్రకాశం. హత్య జరిగిన రోజు రాత్రి ఈ ఆరుగురూ ఏం చేస్తున్నారో తెలుసుకోగలిగితే హంతకుడు గానీ హంతకురాలు గానీ దొరికిపోతారు.

## 9

ఒక్క పద్మకు తప్ప మిగతా అందరికీ ఆరోజు అభేద్యమైన ఎలిబీ లున్నాయి.

పద్మ భర్త ప్రకాశం డ్యూటీమీద తన ఆఫీసరుతో కలిసి క్యాంపులో ఉన్నాడు. ఆ రోజు తను కాకినాడ

లోనే ఉన్నానని పద్మ అంటోంది కానీ ఋజువు చేసే సంఘటనలేమీ చెప్పలేక పోయింది.

హత్య యెందుకు జరిగిందో, యెలా జరిగిందో తెలిసింది కానీ ఎవరు చేశారో తెలియడంలేదు. మొదట్నుంచీ మంచి శీలం కలిగి ఉండని వనజ కీ హత్యతో సంబంధముండడానికి అవకాశం లేదు. ఆ పరిస్థితుల్లో హత్య చేస్తే తను పట్టుబడే అవకాశమున్నదని ఆమెకు తెలుస్తుంది. చూస్తూ చూస్తూ ఏ ఆడదీ నిండు సంసారంలో నిప్పులు పోసుకోదు! రంగారావు హత్య జరిగితే ఆ సమయంలో వనజ బ్రతుకు అన్ని విధాలా నాశనమవుతుంది. అందు వల్ల హత్య విషయంలో ఆమె యెవరికీ సహాకరించే అవకాశం కూడా లేదు.

వెంకన్న అనుమానమంతా పద్మ పైనే కేంద్రీకృతమై ఉంది. రంగారావు కారణంగా ఆమె భర్త ఆమె కళ్ళెదుటనే పర స్త్రీలతో సుఖించడం మొదలుపెట్టాడు. ఈ ఘోరాన్ని ఏ ఆడదీ సహించలేదు. భర్తను చేజేతులా చంపుకోలేదు. తన మనసులోని ద్వేషం నానాటికీ పెరిగి పోతూంటే ఆఖరికి ఒక రోజున ఆమె రంగారావును హత్య చేసింది.

అయితే రంగారావు ద్వారకా లాడ్జికి వెడుతున్నట్లు ఆమెకు ఎలా తెలిసింది?

ఒక పర్యాయం పద్మ యింటిని సోదా చేస్తే తప్ప, రహస్యం బయటపడదని వెంకన్నకు అనిపించింది.

భార్యా భర్త లిద్దరూ మొదటి ఆట సినిమాకు వెళ్ళిన సమయాన్నవకాశంగా తీసుకొని రహస్యంగా ఆ ఇంట్లో ప్రవేశించాడు వెంకన్న. తనకు పనికివచ్చే వివరాలేమైనా దొరుకుతాయేమోనని ఆరగా వెతికాడు. కానీ పనికొచ్చే

వేమీ దొరకలేదు.

పద్మ బట్టలపెట్టెలో ఒక ప్లాస్టిక్ సంచీ ఉంది. అందులో కొన్ని ఉత్తరాలు, బిల్లులు ఉన్నాయి. ఉత్తరాలు ప్రకారం పద్మకు రాసినవి. ప్రతి ఉత్తరం మొదలు చివర చదివి మళ్ళీ ప్లాస్టిక్ సంచీలోకి తోసేశాడు వెంకన్న.

బిల్లుల్ని కూడా పరీక్షించి చూశాడు. ఒకటి కాల్ గ్యాసు డిపాజిట్‌కు సంబంధించినది. మరొకటి బంగారానికి సంబంధించిన తూకం వివరాలున్నది. రెండూ కూడా కనీసం రెండేళ్ళవి. వాటిలో కొత్త బిల్లులు అయిదున్నాయి. నాలుగు బిల్లులు పాతవి. అంటే ఏదేని మిది నెలల క్రితంవి. ప్రెషర్ కుక్కర్, ఇస్త్రీపెట్టె వగైరా గృహసంబంధమైన వస్తువులవి. బహుశా గ్యారంటీ పీరియడ్ అయ్యేవరకూ జాగ్రత్తగా దాచి ఉండాలి.

పద్మ చాలా జాగ్రత్తైన మనిషేనని గ్రహించాడు వెంకన్న. అతను అయిదో బిల్లును పరీక్షగా చూశాడు.

వస్తువు వెల ఇరవై రెండు రూపాయలని ఉంది. అక్షరాలనుబట్టి ఆ వస్తువేదో గ్రహించడం కష్టమైంది. బిల్లు మిసెస్ అని ఏదో పేరున వ్రాసి వుంది. అక్షరాలను ఎంత పరిశీలించినా అర్థం కావడంలేదు. కానీ ఆ పేరు పద్మది కాదని అనిపిస్తోంది. మిసెస్ ప్రకాశం అనుకుందామనుకొన్నా సరిపోవడంలేదు. ఆ బిల్లు ప్రత్యేకత ఏమిటంటే అది రంగారావు హత్యకు రెండు రోజులకు ముందు వ్రాయబడింది.

ఆ బిల్లు తనకు పనికి వస్తుందని వెంకన్న అనుకోలేదు. కష్టపడి ఆ ఇంట్లో ప్రవేశించి ఉత్త చేతులతో వెనక్కు

పోవడం ఇష్టంలేక అతను నా బిల్లును జేబులో పెట్టుకొని జాగ్రత్తగా ఆ ఇంట్లోంచి బయటపడ్డాడు.

వెంకన్న ఆ బిల్లు తీసుకొని అందులో ఉన్న అడ్రసు ప్రకారం షాపు చేరుకున్నాడు.

అది మహాలక్ష్మి మెటల్ స్టోర్స్!

వెంకన్న ఆ బిల్లు తీసుకొని షాపులో అతనికి చూపించి "కొన్నాళ్ళ క్రితం ఇందులోని వస్తువు కొన్నారు. సరిగ్గా అలాంటిదే కావాలి...." అంటూ బిల్లు చూపించాడు.

షాపు అతను ఓ క్షణం బిల్లువంక చూసి లోపలికి వెళ్ళాడు. తిరిగివచ్చిన అతని చేతిలో తళతళ మెరిసే కత్తి ఉంది.

వెంకన్న ఉలిక్కిపడ్డాడు.

అదే—అది హత్యాయుధం! రంగారావు గుండెల్లో దిగబడిన కత్తి అదే!

వెంకన్న డబ్బు చెల్లించి ఆ కత్తి కొన్నాడు. బిల్లును జాగ్రత్తగా జేబులో పెట్టుకొని సుర్నాడు ప్రకాశం ఆఫీసుకు వెళ్ళేవరకూ వేచి అప్పుడు పద్మను కలుసుకొని— "ఇదివరలో మీ భర్తకు మీకు రంగారావుతో ఉన్న అక్రమ సంబంధం గురించి చెప్పేస్తానని బెదిరించాను. మీరు చలించలేదు. కానీ యిప్పుడు తిరుగులేని అభియోగంతో వచ్చాను. రంగారావును చంపింది మీరే! హత్యాయుధం ఒక కత్తి! దాన్ని మీరు మహాలక్ష్మి మెటల్ స్టోర్స్‌లో హత్యకు రెండు రోజుల ముందు కొన్నారు. ఇవన్నీ నేను ఋజువు చేయగలను...." అన్నాడు.

పద్మ తెల్లముఖం వేసి వెంకన్న వంక చూసింది— "ఇవన్నీ మీరెలా కనుక్కోగలిగారు? మీరు మనుషులా, దేవతలా!" అంది.

“ఎంచి పనికి పూనుకొన్న సామాన్యుణ్ని—” అన్నాడు.

“ఇన్ని కనుక్కోగలిగినవారు మరి అసలు హంతకురాలిని యెందుకు తెలుసుకోలేకపోయారు....?” అంది పద్మ.

“బుకాయించవద్దు. మీరే ఈ హత్య చేశారు....”

“నేను కాదు. ఇన్ని తెలిసిన మీకు అబద్ధం చెప్పను. అన్నీ చెప్పేస్తాను. యీ హత్య చేసినది సరిత?” అందిపద్మ.

వెంకన్న తెల్లబోయాడు. “నేను నమ్మలేను” అన్నాడు అప్రయత్నంగా.

“అంతా చెప్పేస్తాను—వినండి!” అంది పద్మ.

ప్రకాశం పద్మను క్షమించినా అది అవకాశంగా తీసుకొని ఆమెను లోకువ కట్టాడు. పగ పేరుతో రంగారావు భార్య సరితను తను లొంగదీసుకొంటానన్నాడు. అందుకు పద్మను సహకరించమన్నాడు. భర్తకూ మరో ఆడదానికీ తార్పుడుకత్తెగా పని చేయాల్సి వచ్చిన తన గతికి కుమిలి ఏడ్చింది పద్మ. మనసు రాయి చేసుకొని సరిత దగ్గరకు వెళ్ళి మొత్తం కథ అంతా వివరంగా చెప్పింది.

ఫారిన్ సెంట్ పేరుతో భర్త చేస్తున్న ఘోరాలు విని సరిత షాక్ తింది. ఆమె భర్తను యెంతగానో ఆరాధిస్తోంది. ఈ షాక్ తో ఆమె పూర్తిగా మారిపోయింది. ఆ క్షణంనుంచి భర్త చర్యలనోకంట కనిపెట్టసాగింది. వనజ, రంగారావు కలిసి వేసుకున్న కార్యక్రమం గురించి ఆమె నాలుగురోజులు ముందుగానే ఆరాతీసింది.

రంగారావులాంటి చీడపురుగును బ్రతకనివ్వకూడదనీ అందుకు సహకరించమనీ ఆమె పద్మను కోరింది. పద్మ సరిత పేరిట ఒక కత్తిని కొని ఆమెకు యిచ్చింది. ఎందుకైనా మంచిదని ఆ బిల్లు తనదగ్గర జాగ్రత్త పెట్టింది.

పద్మ భర్త క్యాంపులో వున్నాడు. పద్మ సరిత యింటికి మకాం మార్చింది.

సరిత తనకార్లో స్వంత డ్రయివింగ్ చేసుకుంటూ రాత్రికి రాత్రి ఊరు విడిచి ద్వారాకాలాడ్జి చేరుకొని వెనకనున్న బాత్రూం నుంచి లోపల ప్రవేశించి నిద్రలో వున్న రంగారావు, వనజలను ఫారిన్ సెంట్ ప్రభావానికి గురిచేసి రంగారావును కత్తితో పొడిచేసి చంపేసింది. సరిత యిల్లు వదలలేదన్నట్లుగా పద్మ మసలింది.

ఈ కథవిన్న వెంకన్న షాక్ తిన్నాడు. ఆ షాక్ నుంచి తేరుకోవడానికి అతనికి కాసేపు పట్టింది. ఆ తర్వాత వెంటనే సరిత యింటికి పరుగెత్తాడు.

అతను చెప్పిన కథవిని "ఈ కేసులో ఎందరో అభాగ్య జీవుల జీవితాలు ముడిపడివున్నాయన్న బాధ లేకుంటే నేను నా నేరానెప్పుడో ఒప్పుకొని వుండేదాన్ని!" అంది సరిత.

# 10

సరిత, నీరజ, వసంత, గౌరి, పద్మ, వనజ, ప్రకాశం, వెంకన్న—సరిత యింట్లో ఓ హాల్లో సమావేశమయ్యారు.

"మీలో రంగారావును చంపిన వ్యక్తి వున్నారు. ఆ వ్యక్తియెవరో నాకు తెలుసు. రంగారావు వంటి నయ వంచకుణ్ని చంపిన ఆ వ్యక్తిని నేనభినందించినప్పటికీ హత్యానేరాన్ని మన్నించలేను. అయినా ఆ వ్యక్తిని నేను ప్రస్తుతానికి బయటపెట్టడంలేదు. రంగారావులాంటి నయవంచకులు మీలో కూడా కొందరున్నారు. మీ ప్రవర్తనను సరిదిద్దుకోవడానికి నేను మీకు కొన్ని మాసాలు అవకాశమిస్తున్నాను. ఈలోగా సరిదిద్దుకోలేక పోతే రంగారావును చంపిన ఆ వ్యక్తి చేతిలోనే మీకూ

మరణిస్తారు. మీకు హెచ్చరికగా ఆ వ్యక్తిని వదిలిపెడుతున్నాను" అన్నాడు వెంకన్న.

ఎవ్వరూ మాట్లాడలేదు.

సరిత వెంకన్న చేతికి ఓ చెక్కు అందించి "ఈ కేసును అపూర్వంగా పరిశోధించారు మీరు. నా కుటుంబపు పరువు మర్యాదలను కూడా కాపాడారు. ఇందుకు మీకు కృతజ్ఞతలు" అంది.

ఆ చెక్కు విలువ పదివేల రూపాయలు! అది జేబులో ఉంచుకొని—"నేరస్థుల్ని పట్టివ్వడం నా అభిమతం కాదు. నేరాల్ని అరికట్టడం నా అభిలాష! ద్వారకా లాడ్జి ప్రొప్రయిటర్ సూరిబాబు కోరికపై ఈ కేసులో దిగినప్పటికీ—మీ అందరి క్షేమం దృష్ట్యా అతడి కోరికను మన్నించలేక పోతున్నాను...." అన్నాడు వెంకన్న.

* * *

"సీతమ్మా, రాజమ్మా...." అంటూ పిలిచాడు వెంకన్న.

ఇద్దరూ వంటింట్లోకి వచ్చారు.

"ఇది ఫారిన్ సెంటు. దీని వాసన అద్భుతం...." అంటూ వెంకన్న ఇద్దరికీ చెరో రుమాలూ యిచ్చాడు. యిద్దరూ వాసన చూసి ఉన్న వాళ్ళు ఉన్నపళంగా కూలబడిపోయారు.

వెంకన్న చటుక్కున భార్యను గట్టిగా కౌగలించుకుని ముద్దు పెట్టుకోబోయాడు.

పద్మావతీదేవి కంగారుపడిపోయింది. వెంకన్న మాత్రం తాపీగా ఆమెకు ఫారిన్ సెంటు కథ చెప్పాడు.

"మీకూ, ఆ రంగారావుగాడికీ తేడా ఏముంది? వాడికున్నలాంటి సరదా మీకూ ఉంది...." అంది పద్మావతి చిరుకోపంలో.

"ఆ రంగారావు బుద్ధి సుగాళ్ళ కందరకూ యెంతో కొంత ఉంటుంది. అవకాశం వచ్చినప్పుడు అదిలా బయట పడుతోంది. అవకాశం రాకుండా చేయడం నా ధర్మం...." అన్నాడు వెంకన్న.

"రహస్యంగా ఉంచాలనుకొన్న ఈ విషయం ఎలా బైట పెడతారు?" అనడిగింది పద్మావతీదేవి.

"నాకు తెలిసిన ఓ రచయిత ఉన్నాడు. అతని రచనలు ప్రచురించే అపన ఉంది. అపనను చదివే పాఠకులు అసంఖ్యాకం. పోలీసుల ప్రమేయం లేకుండా నా పరిశోధనా ఫలితాలను పరోక్షంగా పాఠకుల కందజేసే విధానం అదే!" అన్నాడు వెంకన్న.

"ఈ కేసులో వనజ బయటపడే అవకాశమెంతో ఉంది! బయటపడితే పోలీసులామెనే హంతకురాలంటారు...." అంది పద్మావతీదేవి బాధగా.

"పిచ్చి దేవీ! దిగులుపడకు. ద్వారకా లాడ్జిలోని బేరర్‌కు మాత్రమే ఆమె ఉనికి తెలుసు. ఆమెను గుర్తుపట్టగల రిసెప్షనిస్టుకు ఆమె ఉనికి తెలియదు. ఉనికి తెలిసిన బేరర్ నా ఉప్పు తిన్నాడు. వనజకు ప్రమాదంలేదు. ప్రవర్తన మార్చుకోకపోతే మాత్రం వనజ, ప్రకాశంలకు ప్రమాదం తప్పదు...." అన్నాడు వెంకన్న.

పద్మావతీదేవి నిట్టూర్చింది. వెంకన్న ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. ఆమె అభ్యంతర పెట్టలేదు.

వాళ్ళకు యెదురుగా ఫారిన్ సెంటు మత్తులోవున్న సీతమ్మ, రాజమ్మ యేదో అద్భుత దృశ్యాన్ని చూస్తున్నట్లుగ ముఖం పెట్టి వున్నారు.

—: ఐపోయింది :—

# చేదు నిజం

## వాణిశ్రీ

సండే చదువుతూ కూర్చున్నాడు రాయప్ప.

టెలిఫోన్ మ్రోగింది.

రిసీవర్ ఎత్తి "హలో" అన్నాడు.

"డిటెక్టివ్ రాయప్ప వున్నారా?" సన్నటి కంఠం వినిపించింది టెలిఫోన్‌లో.

"మీరెవరు?"

"నేను ఆపరేటర్ని. ట్రంకాల్ ఫ్రమ్ రాజవరం పి. సి. వో."

"రాజవరం పి.సి.వో." గొణుక్కున్నాడు. ఆ వూరి పేరు అతను ఎప్పుడూ వినలేదు. అక్కడ తనకు తెలిసిన వాళ్ళు ఎవరు?

"హలో...."

"ఎస్. రాయప్ప హియర్. కనెక్షన్ యివ్వండి" అన్నాడు.

కొన్ని క్షణాల తర్వాత "హలో, రాయ్!" అంది

అవతల మాట్లాడుతున్న కంఠం.

"ఎవరు?"

"నేను సంధ్యని మాట్లాడుతున్నాను—రాజవరం నుంచి."

"సంధ్యా! నువ్వా? రాజవరం ఎక్కడ? అక్కడికి ఎందుకు వెళ్ళావు?"

"అదంతా తర్వాత చెప్తాను. నువ్వు వెంటనే బయ ల్దేరి రావాలి."

"ఎందుకు?"

"హేమలత తల్లి చనిపోయింది."

"హేమలత ఎవరు?"

"అప్పుడే మర్చిపోయావా? మన క్లాస్ మేట్. కల్చ రల్ సెక్రెటరీగా చేసింది గుర్తులేదూ?"

"ఎస్. ఎస్....గుర్తొచ్చింది. కాని వాళ్ళమ్మ చచ్చి పోతే నే నెందుకు?"

"ముందు బయల్దేరి వెంటనే రా. కథంతా తర్వాత చెప్తాను."

"ఎలా రావాలి? ఆ వూరు ఎక్కడుందో గూడ తెలియకుండా?"

"చెప్తాను నోట్ చేసుకో."

రాయ్ నోట్ బుక్ లో సంధ్య చెప్పిన వివరాలన్నీ నోట్ చేసుకొన్నాడు.

సూట్ కేస్ సర్దుకొని రూమ్ కి తాళంవేసి హోటల్ కౌంటర్లో వున్న నాగరాజుకి కీ ఇచ్చాడు.

"ఎక్కడికి?" ప్రశ్నించాడు నాగరాజు.

చెప్పాడు రాయప్ప సంధ్య చెప్పినదంతా.

"మంచి బేరమే నన్నమాట."

"ఏవీ ఫీజ్ వచ్చే కేస్‌లా కనిపించడంలేదు" నవ్వుతూ అన్నాడు రాయప్ప.

"విష్ యూ బెస్టు ఆఫ్ లక్."

"నువ్వూ గూడా రారాదూ. సరదాగా వుంటుంది."

"తంతాడు మా నాన్న. అసలే మా తమ్ముడు వూళ్ళో లేడు గూడా!" అన్నాడు నాగరాజు.

"అయితే వస్తా మరి. ఎవరన్నా ఫోన్ చేస్తే వివరాలు నోట్ చేసి వుంచు. నేను వీలైనంత త్వరగా వస్తాను" అన్నాడు రాయప్ప.

"ఏమో! అక్కడ సంధ్య వుంది మరి" కొంటెగా అన్నాడు.

"యూ! సిల్లీ...." నవ్వాడు.

## 2

దుమ్ము రేపుకొంటూ దుమ్ములో కలిసిపోయి పరిగెత్తుతోంది బస్.

దాదాపు ఇరవై మైళ్ళు దుమ్ములోనే ప్రయాణం చెయ్యడంవల్ల రాయప్ప తల, శరీరమూ, బట్టలూ ఎర్ర మట్టితో మునిగిపోయాయి.

ఇంకా సూర్యుడు అస్తమించక పోయినా ఎత్తైన వృక్షాల మధ్య పోతున్న బస్సులో కూర్చున్నవారికి చీకటి పడిపోయిందన్న అనుభూతి కలుగుతోంది.

ఘాట్ రోడ్డులో మెలికలు తిరుగుతోంది బస్.

అప్పుడప్పుడూ రోడ్డు మీద కనిపించే జింకలూ, కుందేళ్ళూ, నెమళ్ళు బస్సు రాకను గమనించి ప్రక్కకు పరిగెత్తి చెట్లలో మాయమైపోతున్నాయి.

అంత దట్టమయిన అడవిని యెప్పుడూ చూళ్ళేదు రాయప్ప.

పచ్చటి ప్రకృతి దృశ్యాలను తన్మయత్వంతో చూశాడు అప్పటివరకూ.

కాని ఇప్పుడిక వెలుగు తగ్గిపోయింది.

"రాజవరం యింకా ఎంతదూరం వుంది?"

"వచ్చేదే రాజవరం."

కాసేపటికి బస్సు ఆగింది.

"సార్ రాజవరం" రాయప్పవంక చూస్తూ అన్నాడు కండక్టరు.

సూట్ కేస్ తీసుకొని బస్సు దిగాడు. ఎక్కడా ఇళ్ళు కన్పించలేదు.

"రాజవరం యెక్కడ? యిళ్లు కన్పించడంలేదే?"

"రెండు మైళ్ళు నడవాలి. సరాసరి వెళ్ళిపోండి" నవ్వుతూ అన్నాడు కండక్టరు బస్ డోర్ లాగుతూ.

"థాంక్స్!" అన్నాడు రాయప్ప.

బస్సు వెళ్ళిపోయింది దుమ్ము రేపుకొంటూ.

ఒంటరిగా మిగిలిపోయాడు రాయప్ప.

ఒకవైపు నుంచి చీకటి తరుముకొస్తోంది. దాదాపు రెండు మైళ్ళు నడవాలి. ఎలాగైనా వెలుగు వెళ్ళిపోయే లోపుగా వూరు చేరాలని పట్టుదలతో వడివడిగా అడుగులు వెయ్యసాగాడు.

చీకట్లో వూరి స్వరూపం కన్పించడంలేదు.

ఊరి మొదట్లో అన్నీ పూరిళ్ళే. అక్కడక్కడా పెంకుటిళ్ళు కొన్ని కన్పిస్తున్నాయి. వూరి చివర ఎత్తుగా కన్పిస్తున్న మూడు అంతస్థుల భవనం హేమలతదే అని వూహించాడు రాయప్ప.

వూళ్ళో కరెంటులేదు. వెన్నెల లేదుగాని నక్షత్రాల కాంతిలో రోడ్డు కనిపిస్తూనే వుంది. దార్లో యిళ్ళ

ముంగు నిలుచున్నవాళ్ళు కొందరు అతన్ని వింతగా చూశారు.

"యెవరు బాబూ?" గేట్లో నిలుచున్న అతను ప్రశ్నించాడు.

"రాజామణిగారి ఇల్లు ఇదేగా!"

"అవును. కాని...."

"నాకు తెలుసు. నేను వాళ్ళమ్మాయికోసం వచ్చాను" అన్నాడు రాయప్ప.

అతను రాయప్ప చేతిలో సూట్ కేస్ అందుకోబోయాడు.

"ఫరవాలేదు...." అన్నాడు రాయప్ప.

"ఇవ్వండి బాబూ!" అని సూట్ కేస్‌ని బలవంతంగా తీసుకొని ముందుకు నడవసాగాడు.

అతన్ని పరీక్షగా చూశాడు రాయప్ప.

దాదాపు అరవై ఏళ్ళు దాటి వుంటాయి అతనికి. జుట్టు బాగా తెల్లబడిపోయింది. కాని శరీరం మాత్రం దృఢంగానే వుంది. నీరుకావి పంచె చొక్కా వేసుకొన్నాడు.

"తాతా నీ పేరేమిటి?"

"వెంకన్న బాబూ!"

"ఈ వూరేనా నీది?"

"అవును బాబూ!"

"ఈ ఇంట్లోనే పని చేస్తున్నావా?"

"పెదబాబుగారి హయాం నుంచి పని చేస్తున్నా."

"ఎప్పుడూ ఇక్కడే వుంటావా?"

"ఆఁ.... ఇక్కడే."

"నీకు ఇల్లు లేదా?"

"లేదు బాబూ! ఒక్క కొడుకు. వాడు కోయంబత్తూరు వెళ్ళిపోయాడు. అక్కడ మంచి వుద్యోగమే. నన్ను రమ్మని యెంతో గొడవ చేస్తాడు. కాని పుట్టి పెరిగిన వూరు. ఇక్కడే రాలిపోవాలని...."

"అలాగా!...." అన్నాడు రాయప్ప.

అతనికి అటూ యిటూ పచార్లు చేస్తున్న సంధ్య కనిపించింది.

అడుగుల చప్పుడు విని ఆగిపోయి పరీక్షగా చూసింది.

"హాయ్! రాయ్...." సంతోషంతో పరిగెత్తుకొంటూ వచ్చింది చిన్నపిల్లలా.

"నువ్వింత త్వరగా వస్తావనుకోలేదు" అంది అతని చేతిని పట్టుకొని వూపుతూ.

"నేను అర్జంట్‌గా స్నానం చెయ్యాలి. వేడినీళ్ళు వున్నాయా?" అన్నాడు.

"ముందు లోపలకి రా!" అంది సంధ్య.

స్నానం చేసి భోజనం చేసేటప్పటికి తొమ్మిది దాటింది.

కిటికీలోంచి చలిగాలి రివ్వున వీస్తోంది. తలుపులు మూసి సోఫాలో కూర్చుని సిగరెట్ వెలిగించాడు.

సంధ్య వచ్చి ఎదురు సోఫాలో కూర్చుంది.

"హేమలత యెక్కడ? కన్పించలేదు...." అన్నాడు రాయప్ప.

"ఇంటి నిండా బంధువులున్నారు. రేపు వస్తుందిలే" అంది సంధ్య.

"అంటే యిది యెవరి యిల్లు?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

"ఇది గెస్టు హౌస్!" నవ్వింది సంధ్య.

"యింత పెద్ద యింట్లో వొక్కదానివి వుంటున్నావా?...."

"నాకేం భయం? తోడుగా సర్వెంట్ మెయిడ్ వుంటుందిలే" అంది సంధ్య.

"అసలు కథ చెప్పు" అన్నాడు.

"జర్నీ చేసి వచ్చావు గదా. రెస్టు తీసుకో. కథంతా రేపు చెప్తాను."

"ఫరవాలేదు చెప్పు. లేకపోతే నాకు నిద్ర పట్టదు."

"చెప్పినా నిద్ర పట్టదు. యేదోకటి ఆలోచిస్తూ వుంటావు."

"బాగుంది. ఆలోచించపోతే ఎలా?" అన్నాడు.

నవ్వింది సంధ్య.

"అసలు యిక్కడికి నువ్వెందుకు వచ్చావు?" ప్రశ్నించాడు.

"లత రమ్మని లెటర్ రాసింది. ప్రక్కన యేదో వూరుందట. అక్కడ కాళికాదేవి వుత్సవాలు జరుగుతాయట. అవన్నీ చూడొచ్చు రమ్మని రాసింది. సరేనని వచ్చాను. ఇంతలో ఈ ఘోరం జరిగింది."

"అసలు ఏం జరిగింది?"

"అర్థం కావడంలేదు. కాని ఎవరో వాళ్ళమ్మని చంపారని లత అనుమానపడుతోంది."

"ఎలా? అసలు ఆవిడ ఎక్కడ చనిపోయింది? ఇంట్లో కాదా?"

"లేదు. కొండ అంచునుంచి జారిపడిందో లేక యెవరైనా నెట్టారో ఏమో తెలీదుగాని, చాలా ఎత్తునుంచి బండరాళ్ళమీద పడి చనిపోయింది."

"నువ్వు చూశావా ఆ ప్రదేశం?"

"ఆఁ...."

"రేపు నాకు చూపించు."

తల వూపింది సంధ్య.

"పోలీసులు వచ్చారా?"

"ఆఁ— టౌన్‌లో పోస్టుమార్టమ్ చేశారు గూడా! ఇంకా రిపోర్టు రాలేదు. శవాన్ని బంధువులకు అప్పగించారు. రాత్రి దహనం చేశారు."

"బంధువులు అంటున్నావు యెవరెవరు వచ్చారు?"

"నాగభూషణం అని లతకి బాబాయి. అతని భార్య పిల్లలు, లత మేనత్త సీతమ్మ, ఆమె కొడుకు సురేష్. ఇంకా లత తరఫువాళ్ళు వచ్చారు. అంతా కలసి పాతిక మంది పైనే వుంటారు."

"శవాన్ని దహనం చేశారా?"

"ఆఁ."

"మరి తలకొరివి యెవరు పెట్టారు? లతకి అన్నదమ్ములున్నారా?"

"లేరు. వాళ్ళ బాబాయి కొడుకుతో పెట్టించారు."

"అలాగా? అసలు లత తల్లి అదే రాజామణి మరణం ప్రమాదవశాత్తు జరగలేదు అనే అనుమానం లతకి ఎందుకు వచ్చింది?"

"నాకు వివరంగా చెప్పలేదు కాని వాళ్ళ కుటుంబంలో ఏవో కలతలు వున్నట్లు అనిపించింది. అది అసలే చాల విచారంలో వుంది. అందుకే వివరాలు అడగలేదు."

"నువ్వు యెవర్ని అనుమానిస్తున్నావు?"

"ఎవర్నీ అనుమానించలేకనేగదా మహానుభావుడివి నిన్ను పిలిపించింది. నిన్ను చూస్తే లత ఆశ్చర్యపోతుంది" నవ్వుతూ అంది సంధ్య.

"అంటే నేను వస్తున్నట్లు లతకి తెలియదా?" నివ్వెర పోతూ ప్రశ్నించాడు రాయప్ప.

"నేను చెప్పలేదు. అదేమో ఏడుస్తూ కూర్చుంది. బంధువులంతా కొత్త. బోర్‌గా వుంది. ఇంతలో నువ్వు జ్ఞాపకం వచ్చావు. హైదరాబాదులో డిటెక్టివ్ ట్రెనింగ్ పూర్తి చేశావని లెటర్ రాసిన సంగతి గుర్తొచ్చి ఈ కేసు నీకు అప్పగిస్తే ఎలా సాల్వ్ చేస్తావో చూడాలనిపించింది. పోస్టాఫీసుకి వెళ్ళి నీకు ట్రంకాల్ బుక్ చేశాను. లతకి చెప్పలేదు. చెప్తే వద్దంటుందేమో?"

"లతకి ఇంట్రెస్ట్ లేనప్పుడు నీ కెందుకీ గొడవ. వాళ్ళమ్మ యెలాగూ చనిపోయింది. చంపింది యెవరో తెలుసుకున్నందువల్ల లాభం ఏముంది?"

"ఎందుకుండదు? ఈ రోజు వాళ్ళమ్మని చంపారు. తర్వాత లతని చంపడానికి ప్రయత్నించవచ్చు."

అవునన్నట్లు తలవూపాడు రాయప్ప.

"మరి నా ఫీజు ఎవరిస్తారు?" నవ్వు ఆపుకుంటూ అడిగాడు రాయప్ప.

"ఫీజు గురించి వర్రీ యెందుకు? నేనే ఇస్తాను" అంది సంధ్య నవ్వుతూ.

"అడ్వాన్స్ కావాలి" అంటూ ఆమె అరచేతిని బలంగా పట్టుకున్నాడు.

సంధ్య ముఖం సిగ్గుతో మందారంలా ఎర్రబడింది.

రాయప్ప ఆమెను తన మీదకు లాక్కుని ముద్దు పెట్టుకోబోయాడు.

"ఆగండి డిటెక్టివ్ గారూ! నో అడ్వాన్స్!" అంటూ అతని పట్టు విడిపించుకొని పరిగెత్తింది.

"గుడ్ నైట్. విష్ యూ స్వీట్ డ్రీమ్స్" అంటూ తలుపులు మూసేసి వెళ్ళిపోయింది.

# 3

గెస్ట్ హౌస్ కి వందగజాల దూరంలో వుంది హేమలత వాళ్ళ ఇల్లు. రెండూ ఒకే కాంపౌండ్ లో వున్నాయి. మూడంతస్తుల మేడ చుట్టూ విశాలమైన ప్రహరీ గోడ వుంది.

బెడ్ కాఫీ తీసుకొంటూ పరిసరాలను గమనిస్తున్నాడు రాయప్ప.

"బాబుగారూ వేడినీళ్ళు గదిలో పెట్టాను" అన్నాడు వెంకన్న.

రాయప్ప స్నానంచేసి వచ్చేసరికి టీపాయిమీద వేడి వేడి ఇడ్లీ పొగలు కక్కుతూ కనిపించింది.

వాకిట్లో నిల్చున్న ఎర్రచీర యువతిని చూసి రాయప్ప గుండెలు అదిరాయి.

ఎర్రగా ఎత్తుగా వుంది ఆమె. ఇరవై ఏళ్ళలోపు వుంటాయి. బలంగా పిటపిటలాడుతోంది. ఆమె జాకెట్ కట్టుకున్న తీరుచూసి పట్నవాసం పిల్లలు ఆమెవద్ద ఫ్యాషన్స్ నేర్చుకోవాలేమో అనిపించింది. మేనకని చూసిన విశ్వామిత్రుడిలా రాయప్ప మనసు చెదిరిపోయింది. ముఖ్యంగా ఆమె కళ్ళు విశాలంగా ప్రకాశవంతంగా వున్నాయి. ఆమె కళ్ళతోనే నవ్వుతున్నట్లు ఫీలయ్యాడు. ఆమె ముఖంలో రాచవంశపు ఠీవి కనిపిస్తోందిగాని పని పిల్లలాలేదు.

"నీ పేరేమిటి?"

"సోని."

"సోని? అదేం పేరు."

"అదొక పేరు" నవ్వింది.

"ఆ సంగతి నాకు తెలుసు. కాని అటువంటి పేరు ఎప్పుడూ వినలేదు."

"మీరు వినని పేర్లు ఎన్నో వుంటాయి."

'ఓసి దీని అసాధ్యం కూలా' మాటకి మాట అంటి స్తోంది. ఎవరోగాని మాటలు నేర్పిన పిట్టలావుంది, అనుకొన్నాడు.

"అవుననుకో. ఎప్పుడూ వినని పేరు మాత్రమే కాదు. ఎన్నడూ చూడని మనిషిని గూడా నువ్వు. చాల అందంగా వున్నావు నువ్వు."

"వయసులోవున్న ప్రతి ఆడదీ అందంగానే వుంటుంది. చూసిన మొగాడల్లా పొగుడుతూనే వుంటాడు."

రాయప్పకి ఆ మాటలు నసాళానికి అంటాయి.

"లోకం సంగతికాదు. ముఖ్యంగా నీ సంగతి మాట్లాడుతున్నాను. నీ అంత అందగత్తెను యెక్కడా చూడలేదు నేను."

రాయప్ప స్తుతివచనాలకు ఆమె పొంగిపోతున్నట్లు లేదు.

"ఇలాంటి మాటలు చెప్పే ఒక వెధవ నన్ను మోసం చేశాడు" అంది నిర్లక్ష్యంగా.

"నిన్ను మోసంచేశాడా? పూర్ ఫెలో" అన్నాడు రాయప్ప.

"ముందు టిఫిన్ తీసుకోండి. చల్లారిపోతున్నది."

"ఇంకా టిఫిన్ గూడా ఎందుకు నిన్ను చూస్తే కడుపు నిండిపోయినట్లనిపిస్తోంది."

"అయితే తీసుకెళ్ళిపోమంటారా?" అంటూ ఆమె ట్రే ఎత్తింది రెండు చేతులతో.

ఆమె వంగినప్పుడు కనిపించిన వక్షోజాల విశ్వరూపం చూసి రాయప్పకి మతిపోయినట్లనిపించింది.

సోని నవ్వుతూ "మీరు టిఫిన్ కానివ్వండి. కాఫీ తీసుకొస్తాను" అంటూ నిష్క్రమించింది.

సోని వెళ్ళిన పావుగంటకి వచ్చింది సంధ్య "గుడ్ మార్నింగ్" అంటూ.

రాయప్ప సీరియస్‌గా చూశాడు.

"కోపం వచ్చిందా? అయితే రాత్రి నిద్రపట్టలేదన్న మాట" అంది నవ్వుతూ.

"బ్రహ్మాండంగా పట్టింది" అన్నాడు.

"హేమలతని ఈ రోజుగూడా మనం ఒంటరిగా కలుసుకోలేం" అంది సంధ్య.

"ఏం?"

"ఈ రోజు చిన్నకర్మట. చాల బిజీగా వుంది."

"ఇదెక్కడి కేసురా బాబూ! డిటెక్టివ్ కోసం క్లయింట్ ఎదురుచూడాల్సిందిపోయి క్లయింట్ ఇంటర్వ్యూ కోసం డిటెక్టివ్ ఎదురు చూడాల్సొచ్చింది" అన్నాడు.

"మీ చమత్కారానికేమిగాని తొందరగా తెమలండి. హత్య జరిగిన ప్రదేశానికి వెళ్దామన్నారుగా. మళ్ళీ ఎండెక్కుతోంది" అంది.

"సోని కాఫీ తేవడానికి వెళ్ళి యింకా రాలేదు" అన్నాడు రాయప్ప గుమ్మంవైపు చూస్తూ.

"బాగుంది.అదుగో ఆ ఫ్లాస్క్‌లో పది కాఫీలున్నాయి. ప్రొద్దున నేనే పంపించాను" అంటూ ఫ్లాస్క్ మూత తీసి కప్పులో పోసింది సంధ్య.

కాఫీ సిప్ చేస్తూ అన్నాడు రాయప్ప "నేను డిటెక్టివ్‌నని యెవరికీ తెలియగూడదు. ఆఖరికి లతకి గూడా."

"ఏం?" అనుమానంగా చూసింది సంధ్య.

"తెలిస్తే కేసు సంగతి ఎలావున్నా మనం క్షేమంగా బైటపడటం కష్టం" అన్నాడు.

"ఎలా అనుమానిస్తున్నావు?"

"ఇక్కడ అటువంటి పరిస్థితులున్నాయి. ఎవర్నైనా చంపి అవతల పారెయ్యడం యెంతో తేలిక యిక్కడ. పెద్ద అడవి, అన్నీ కొండలు ఎక్కడ చూసినా నిర్మానుష్యమైన ప్రదేశాలు. మనల్ని చంపి పాతేసినా ఎవరూ కనుక్కోలేరు" అన్నాడు.

భయంగా చూసింది సంధ్య.

"నువ్వేమీ భయపడకు. నువ్వు లతకి డియరెస్టు ఫ్రెండ్‌వని అందరికీ తెలిసిపోయింది. నన్ను నీ బాయ్ ఫ్రెండ్‌గా చెప్పు. దట్సాల్."

"అలాగేనన్నట్లు తల వూపింది.

"వెల్. ఇక బయల్దేరదాం" కెమెరా భుజాన తగిలించుకొని బయల్దేరాడు రాయప్ప.

"గుడ్ మార్నింగ్!" అంటూ చొరవగా లోపలికి వచ్చిన అతన్ని చూసి ఆగిపోయాడు రాయప్ప.

"గుడ్ మార్నింగ్! మీరు...." అన్నాడు యెవరో తెలియక.

"వీరు మిస్టర్ వేణుగోపాల్. లతవాళ్ళ ఎస్టేట్ మేనేజర్" అంటూ పరిచయం చేసింది సంధ్య.

"గ్లాడ్ టూ మీట్ యూ!" రాయప్ప షేక్‌హేండ్ యిచ్చాడు.

"ఈయన మిస్టర్ రాయ్. నా బాయ్‌ఫ్రెండ్" సిగ్గుపడుతూ అంది సంధ్య.

"గ్లాడ్ టూ మీట్ యు మిస్టర్ రాయ్" అన్నాడు

వేణుగోపాల్.

"ఐ యామ్ వెరీ సారీ మిస్టర్ వేణుగోపాల్. కొన్నాళ్ళు సరదాగా గడపాలని వచ్చాను కాని నేను వచ్చేసరికే లత వాళ్ళమ్మగారు పోయారట. వచ్చాక తెలిసింది. ఈ పరిస్థితుల్లో యెలా వుండగలం. అందుకే యీ రోజు వెళ్ళిపోవాలనుకొంటున్నాం" అన్నాడు రాయప్ప.

"మీరు రాత్రి వచ్చారని తెలిసింది. అప్పుడే వెళ్ళి పోతారా. జరిగిందానికి విచారించి లాభం ఏముంది? పాపం లత చాల విచారంలో వుంది. ఈ సమయంలోనే స్నేహితులు దగ్గర వుండాలి. యామై కరెక్ట్" అన్నాడు వేణుగోపాల్.

"యూ ఆర్ కరెక్ట్. బట్...." అంటూ సంధ్య వైపు చూశాడు.

ఇద్దరి చూపులూ కలుసుకొన్నాయి.

"ఏమంటావ్ సంధ్యా?"

"అంతా నీ యిష్టం రాయ్."

"నో....నో....నీ యిష్టం."

"కాదు, నీ యిష్టమే."

"ప్లీజ్ లిజన్ మీ. అంతా నా యిష్టం. మీరు కొన్నాళ్ళు ఇక్కడే వుండాలి. ఓ. కే...." అంటూ నవ్వాడు వేణుగోపాల్.

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మిస్టర్ వేణుగోపాల్. మీరు చూస్తే చాల యంగ్‌గా కనిపిస్తున్నారు. నాట్ ఎ బౌట్ ట్వంటీ ఫైవ్."

"యస్."

"ఇంత పెద్ద ఎస్టేట్ వ్యవహారాలు యెలా మేనేజ్ చేస్తున్నారు?" ఆశ్చర్యంగా అడిగాడు రాయప్ప.

"నాదేముంది? అంతా మా ఫాదర్ వారసత్వమే. నేను బి.కామ్. పూర్తి చేశాను. యం.కామ్. చదవాలను కున్నాను గూడా. కాని మా ఫాదర్ డిస్కరేజ్ చేశాడు. ఆయన దాదాపు ఇరవై ఏళ్ళుగా ఈ ఎస్టేట్ మేనేజ్ చేస్తున్నారు. ఇప్పుడాయన ఆరోగ్యం బాగా లేదు. పెరాల్సిస్ గూడా ఎటాక్ అయింది. నాకు కాస్త ట్రైనింగ్ యిచ్చాడు. సంవత్సరం నుంచి నేనే మేనేజ్ చేస్తున్నాను.అలవాటైపోయింది మిష్టర్ రాయ్. మనిషికి అసాధ్యమైంది ఏదీ లేదని నా వుద్దేశ్యం. తల్చు కుంటే ఎంత గొప్పవాడైనా కాగలడు."

"యస్....యస్....మనిషికి ఆత్మవిశ్వాసం కావాలి. అదివుంటే ప్రపంచాన్ని జయించగలడంటూరు" అన్నాడు రాయప్ప.

"నిజమే. లత తల్లిగారు బహుశా మీకు పరిచయం లేదనుకొంటాను. ఆవిడ చాలా పట్టుదల మనిషి. భర్త చనిపోయినా ఏ మాత్రం నిరాశ చెందకుండా యెంతో చాకచక్యంగా ఎస్టేట్ వ్యవహారాలు నిర్వహిస్తున్నారు. బట్ ఫేట్ ఈజ్ బాడ్. యాక్సిడెంట్‌లో ఆవిడ పోయారు" అన్నాడు వేణుగోపాల్.

"ఎందుకు జరిగింది అలా? మీకేమైనా వివరాలు తెలుసా?"

"నాకేం తెలియదు. నిజానికి నే నా సమయానికి టౌన్‌లో వున్నాను. ఎవరో కొండమీద నుంచి త్రోస్తే పడిపోయారని పుకారొకటి పుట్టింది. పోలీసులు వచ్చారు. ఎవరో రిపోర్టు చేశారట. లేనిపోని గొడవ జరిగింది, అనవ

పరంగా పోస్టుమార్టమ్ అంటూ నానా భీభత్సం చేశారు."

"పోస్టుమార్టమ్ రిపోర్టులో ఏం తేలింది?"

"ఏముంటుంది? దెబ్బలు తగలడంవల్ల నేనని వుంటుం దనుకోండి. నే నా రిపోర్టు చూడలేదు. పోలీసులు చూసు కొంటారనుకొంటాను."

"ఐ. సీ. యిప్పుడీ యెస్టేట్ ఆస్తి యెంత వుంటుంది?...."

"రాజామణి భర్తగారి హయాంలో ఎంత వుండేదో తెలియదు. ఆయన తన తమ్ముడితో భాగాలు పంచు కొన్నారు. పదేళ్ళనుంచి వేరుగా వుంటున్నారు. ఇప్పుడీ ఎస్టేట్ ఆస్తి కోటిరూపాయలు దాటి వుంటుంది. ఇక జ్యూవలరీ, బ్యాంక్‌లో ఫిక్స్డ్ డిపాజిట్స్ యెంత వున్నాయో రాజామణిగారికే తెలియాలి. వారు చాలా రిజర్వ్డుగా వుండేవారు. నేను మేనేజర్నే అయినా బిజినెస్ వ్యవహారాలు మాత్రమే మాట్లాడుతూ వుండే వారు. పర్సనల్ మేటర్స్ యెత్తేవారు కాదు" అన్నాడు వేణుగోపాల్.

"ఇప్పుడు రాజామణి మరదిగారు ఇదే బిజినెస్ చేస్తుం టారా?"

"అఁ....ఒకప్పుడు. డివైడ్ అయినప్పుడు ప్రక్కవున్న ఎస్టేట్ వారిదే. కాని ఆయన వ్యసనపరుడు. పేకాట, రేసులు. ఎప్పుడూ మెడ్రాసులోనే మకాం. ఎస్టేట్ మేనేజర్ బాగా తినేశాడు. లాస్‌లో అమ్మేశారు. మెడ్రాస్‌లో ఏదో లాడ్జింగ్ కొని నడుపుతున్నాడనీ, మొత్తానికి బాగా చితికిపోయాడని తెలుస్తోంది."

"ఆయన అప్పుడప్పుడూ యిక్కడికి వచ్చేవాడా?"

"రాకేం. వదినగారిని డబ్బుకోసం పీడిస్తూ వుండే వాడు. ఆమె మూడీ మనిషి. ఒక్కోసారి గౌరవంగానే మాట్లాడేది. అడిగిన డబ్బు ఇచ్చి పంపేది. మరొకసారి కుక్కకన్నా హీనంగా చూసేది. 'గెటవుట్' అని కేకలు పెట్టేది. చూస్తుంటే నాకే బాధనిపించేది" నవ్వాడు వేణుగోపాల్.

"ఎవరో రాజామణిగారిని హత్య చేశారని పుకారు పుట్టిందన్నారు చూశారా? ఎలా పుట్టింది? పొగ రావాలంటే నిప్పుండాలి గదా! ఆమెకు శత్రువులు యెవరైనా వున్నారా? మీకు తెలిసి వుండాలి" అన్నాడు రాయ్.

వేణుగోపాల్ నవ్వాడు.

"భలేవారే. బిజినెస్ వ్యవహారాలు మాత్రమే నాకు తెలుసు. ఆవిడ పర్సనల్ మేటర్స్ నాకు ఏమీ తెలియవు. అందులో యీ బిజినెస్ మీకు తెలియదు. అడవిలో బీడీ ఆకు, విస్తరాకులు కాంట్రాక్టు తీసుకొని ఎక్స్‌పోర్టు చెయ్యడం. లేబర్‌తో డీలింగ్స్ తలనొప్పి అనుకోండి. ఇక వేరే విషయాలు ఆలోచించడానికే తీరిక దొరకదు. కాని...."

రాయప్ప ఆశగా చూశాడు.

"ఈ మధ్య లత పెళ్ళి చెయ్యాలని చూస్తున్నట్లుగా రాజామణి నాతో అన్నారు. లత మేనత్త ఒకామె వుంది లెండి. పూర్ లేడీ. కథ మామూలే. భర్త ఆస్తి పాడుచేశాడు. ఒక్కగానొక్క కొడుకుని గ్రాడ్యేట్ చేసింది. అతని పేరు సురేష్ అనుకొంటాను. ఎస్. సురేష్. అతనికి లతను యివ్వమని గొడవపెడుతూoదనీ, కాని తనకు ఇష్టంలేదని ఆవిడ అన్నారు."

"లతకి ఇష్టమేనా?

"ఏమో మరి....?" నవ్వుతూ అన్నాడు వేణు గోపాల్.

ఇంతలో ఎవరో నౌకరు వచ్చాడు వేణుగోపాల్ కోసం. అతను వెళ్తూ "మిష్టర్ రాయ్! మీరు ఏ మాత్రం మొగమాట పడకుండా ఏం కావాలన్నా నాతో చెప్పండి. యిక్కడ వున్నన్నాళ్ళూ మీరు నా గెస్టులు" అన్నాడు.

"ఓ. కే. థాంక్స్" అన్నాడు రాయప్ప.

వేణుగోపాల్ సెలవు తీసుకొని వెళ్ళిపోయాడు.

"ఇతను చాలా మంచివాడు. కొత్త పాతా లేకుండా ఎంతో సరదాగా మాట్లాడుతూ వుంటాడు. భోళా మనిషి" మెచ్చుకోలుగా అంది సంధ్య.

"ఎస్....ఎస్. మనం బయల్దేరుదామా! ఎండెక్కుతోంది" అన్నాడు రాయప్ప.

# 4

"మీరు లోగడ ఏవైనా కేసులు డీల్ చేశారా?" అన్నాడు ఇన్స్పెక్టర్ నందన్‌కుమార్.

"ఏవో చిన్న చిన్న కేసులు డీల్—చేశాను" అన్నాడు రాయప్ప.

"ఆదాయం ఎలా వుంటుంది?"

"ఫర్వాలేదు. కాని యింకా జనం ప్రైవేట్ డిటెక్టివ్‌లకు కేసులు అప్పగించడానికి అలవాటుపడలేదు. ఎవరో బాగా డబ్బున్నవాళ్ళే తప్ప."

ఇంతలో జవాన్ కాఫీ కప్పులు తెచ్చి టేబుల్ మీద పెట్టాడు.

"ప్లీజ్. తీసుకోండి."

"థాంక్స్!" అన్నాడు రాయప్ప.

"పోస్టుమార్టమ్ రిపోర్టు చూస్తారా?"

"నో థాంక్స్! వివరాలు చెప్పండి చాలు" అన్నాడు రాయప్ప.

"ఆమెకు నల్లమందు తీసుకొనే అలవాటు వున్నట్లుంది. ఆ సమయంలో ఆవిడ పూర్తిగా మత్తులో వుంది. తల పగిలి బాగా రక్తం పోవడంవల్ల మరణం సంభవించిందని డాక్టర్ రిపోర్టు రాశాడు."

"ఐ. సీ. నేను గూడా యిటువంటిదే ఏదో వుంటుందనుకొన్నాను లెండి. ఆవిడ నల్లమందు మత్తులో వుందనే విషయం తేలిపోయింది. ఆవిడ అప్పుడప్పుడూ కొండమీద ఆ పాయింట్ వద్దకు వెళ్ళి కాసేపు కూర్చుని వస్తుందని కొందరు చెప్పారు. ఐతే ఆమె వెంట యెవరో ఒకరు తోడు వుంటారని చాలామంది అన్నారు. సరిగ్గా ఆమె చనిపోయిన రోజే యెవరూ వెంట లేకపోవడం గమనార్హం.

ఆ కొండ దిగువన కొందరు లేబర్ గుడిసెలలో వుంటున్నారు. వాళ్ళంతా అడవిలో బీడీ ఆకు సేకరించే పనిలో వాళ్ళే. ఆవిడ కొండమీదనుంచి క్రింద పడినప్పుడు ఆమె అరచిన శబ్దం విన్నారేమోనని చాలామందిని ప్రశ్నించాను. కాని ఎవరూ వినలేదన్నారు. నాకు ఆశ్చర్యం అనిపించింది. సాయంకాలం జరిగింది ఈ సంఘటన.

రాత్రి యెంతకూ తల్లి రాకపోతే కూతురు మనుషుల్ని పంపించింది. కొండ దిగువన కారు మాత్రం కనిపించింది. దాదాపు రెండు గంటలసేపు టార్చిలైట్లు వేసుకొని తిరిగారు. చివరకు ఆమె శవం కనిపించింది."

తల వూపాడు ఇన్స్పెక్టర్.

"మీరు యెవరినైనా అనుమానిస్తున్నారా?" ప్రశ్నిం

చాడు రాయప్ప.

"అర్థం కావడంలేదు."

"మీకు ఫోన్ చేసింది ఎవరు?"

"యెవరో తెలీదు. పేరు అడగ్గానే ఫోన్ పెట్టేశాడు...."

"ఫోన్ రాజవరంనుంచి వచ్చిందా?"

"అవును."

"టౌన్‌కి టెలిఫోన్‌లో మాట్లాడాలంటే ట్రంకాల్ బుక్ చెయ్యాలి గదా?"

"అవసరంలేదు. రాజవరం విలేజ్ ఈ టౌన్ ఎక్ఛేంజి లోదే. లోకల్ క్రిందే లెక్క."

"ఆ వూళ్ళో యెవరెవరికి ఫోన్స్ వున్నాయో మీకు తెలుసా?"

"రాజామణిగారికి, వాళ్ళ మేనేజర్ ఇంటికి తప్ప ఎవరికీ లేవు. పోస్టాఫీసులో మాత్రం వుంది."

"పోస్టుమాస్టర్ చేసి వుంటాడా?"

"అడిగాను. తనకి తెలియదన్నాడు" అన్నాడు నందన్ కుమార్.

"ఎవరో రాజామణి మరణాన్ని హత్యగా క్రియేట్ చెయ్యాలని ప్రయత్నిస్తున్నట్లుగా వుంది."

"కావచ్చు."

"మీరు ఎవర్నయినా అరెస్టు చేశారా?"

"ఎలా?" నవ్వాడు నందన్‌కుమార్.

"రాజామణి మరణం ప్రమాదవశాత్తు జరగలేదనీ, ఎవరో హత్య చేశారని ఆమె కూతురు హేమలత అనుమానపడుతోంది."

"ఈజిట్....?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు ఇన్

స్పెక్టర్.

"ఎస్."

"అయితే ఇందులో ఏదో మిస్టరీ వుంది మిస్టర్ రాయ్. అది మీరే కనిపెట్టాలి" అన్నాడు.

"షూర్. విత్ యువర్ కైండ్ కోపరేషన్" నవ్వుతూ అన్నాడు రాయప్ప.

"సర్టెన్లీ."

"గుర్తుంచుకోండి. నేను మీ క్లాస్‌మేట్‌ని. డిటెక్టివ్‌ని కాదు. ఓ. కే."

"ఓ. కే."

"థాంక్స్."

సెలవు తీసుకొని పోలీస్ స్టేషన్ నుంచి బయటపడ్డాడు రాయప్ప.

## 5

కొండ మలుపు వెళ్ళే సిటీబస్ రెడీగా వుంది. అందులో వెళ్తే రాజవరం స్టాప్‌లో దిగొచ్చు. రాయప్ప బస్సులో యెక్కి కూర్చున్నాడు. కొండమలుపు ఆ రూట్‌లో చివరి స్టేజి.

రాజవరం రోడ్డుమీద దిగేసరికి చీకటిపడింది. అతని వెనుక నలుగురు బస్సు దిగారు. అందులో ఇద్దరు బీడీ ఆకు కార్మికులు. బ్యాట్రీలైటు వేసుకొని వడివడిగా వెళ్ళిపోయారు.

రాయప్ప కాసేపు నిల్చున్నాడు రోడ్డుమీదే.

అతను యెవరో చొరవగా వచ్చి అగ్గిపెట్టెను అడిగాడు.

పరీక్షగా చూశాడు రాయప్ప.

కు(క్రా)డే. చామనఛాయలో వున్నాడు. బ్లూ కలర్ స్ట్రెయిడ్ ప్యాంట్‌లో వయిట్ షర్టు టక్ చేశాడు. ఎత్తుగా బలంగా కన్పించాడు. కళ్ళు ఎర్రగా వున్నాయి. బహుశా కొంచెంగా నయినా త్రాగి వుండాలను కొన్నాడు.

సిగరెట్ ముట్టించి అగ్గి పెట్టె తిరిగి ఇచ్చేస్తూ "పోలీస్ స్టేషన్‌కి ఎందుకు వెళ్ళారు?" అన్నాడు.

రాయప్ప బ్రేక్ వేసిన బండిలా ఠక్కున ఆగిపోయాడు. విస్మయంగా చూశాడు అతని వంక.

ఎవరు ఇతను? తను పోలీస్ స్టేషన్‌కి వెళ్ళి వచ్చినట్లు ఎలా తెలుసుకొన్నాడు.

"ఆగిపోయారేం?" అన్నాడతను సిగరెట్ పొగ ఆకాశంలోకి వదులూ.

"ఎవరు మీరు?"

"నేనెవరో మీకు తెలియదు. కాని మీరెవరో నాకు తెలుసు?"

గుండె జల్లుమంది రాయప్పకి. కొంపదీసి వీడేనా రాజామణిని చంపిన హంతకుడు? తను డిటెక్టివ్ నని కని పెట్టేశాడా? అతని ప్యాంట్ జేబుల వంక చూశాడు. ఎత్తుగా కనిపించింది. ఆ జేబుల్లో పిస్టల్, కత్తి వంటివి లేవుగదా?

"మీరు మా లత క్లాస్‌మేట్. సంధ్యను మీరు పెళ్ళి చేసుకోబోతున్నారు. కాని హనీమూన్ మాత్రం వచ్చేశారు పెళ్ళి కాక ముందే...." అతను పకపక నవ్వాడు.

"ఎవరు మీరంటే చెప్పరేం?"

"నేను లతకి మేనత్త కొడుకుని. నా పేరు సురేష్."

'హమ్మయ్య' అని తేలిగ్గా వూపిరి పీల్చుకొన్నాడు.

"గ్లాడ్ టూ మీట్ యూ!" అని షేక్ హేండ్ ఇచ్చాడు రాయప్ప.

"నా ప్రశ్నకు జవాబు చెప్పలేదు మీరు."

"ఏమిటది?"

"పోలీస్ స్టేషన్ కి వెళ్ళిన సంగతి."

"మరేం లేదు. ఇన్ స్పెక్టర్ నందనకుమార్ అని నా క్లాస్ మేట్ ఒకడున్నాడు. వాడిని కలుసుకోవడానికి వెళ్ళాను" అన్నాడు రాయప్ప.

"అలాగా!" అని నవ్వాడు సురేష్.

ఇద్దరూ నడవసాగారు.

"నేను సరదాగా వచ్చాను సంధ్య రమ్మని లెటర్ రాస్తే. తీరా వచ్చేసరికి ఇంత దారుణం జరిగిపోయింది. అదే మీ అత్తయ్యగారు చనిపోవడం."

"చనిపోవడం కాదు. చంపబడింది" నెమ్మదిగా అన్నాడు సురేష్.

"నిజమా?...." యెంతో ఆశ్చర్యం ప్రకటించాడు రాయప్ప.

"ఎస్."

"మీకెలా తెలుసు?"

"తెలుసు అంతే."

"ఆమెను చంపితే ఎవరికేం లాభం?"

"వుంది కొందరికి."

"బాగుందండీ మీరు చెప్పడం. ఆమె కోటీశ్వరురాలు. ఆమెకు ఒక కూతురుంది. ఆమె చనిపోతే ఆస్తికి వారసురాలు కూతురు గాని వేరే వాళ్ళు యెలా అవుతారు?"

"వారసులే కానక్కర లేదు" అన్నాడు సురేష్.

"మరి ఆమెను చంపి లాభం ఏమిటి? అని రానప్పుడు" అన్నాడు రాయప్ప.

రాజవరం పొలిమేరలు వచ్చేవరకూ రాయప్ప అతన్ని లొంగదీసుకోలేకపోయాడు. ఎవరో చంపారని అంటాడు గాని యెవరో చెప్పడు. యెన్నో విధాల మెలికలు వేసినా బైటపెట్టలేదు అతను.

ఊరి మధ్యలో ఒక టీకొట్టులో గుడ్డిగా వెలుగుతోంది లాంతరు. పూరిపాకలో వుంది ఆ టీకొట్టు. పకోడీలు, బజ్జీలు అడుగు బొడుగూ వున్నాయి. లడ్డూలు పేర్చి వున్నాయి పళ్ళెంలో.

"లోపల కూర్చుందాం రండి. కొంచెం కంపెనీ ఇవ్వండి" అన్నాడు సురేష్.

ఇద్దరూ లోపలకెళ్ళి చెక్కబల్ల మీద కూర్చున్నారు. టీ త్రాగడానికేమో అనుకొన్నాడు రాయప్ప.

కాని అతగాడు జేబులోంచి ఓల్డు టావరిన్ విస్కీ బాటిల్ తీసి రెండు గ్లాసులు తెప్పించాడు. పకోడీలు, బజ్జీలకి ఆర్డర్ ఇచ్చాడు.

"నాకు అలవాటు లేదు ప్లీజ్ ...." అన్నాడు రాయప్ప.

"భలేవారే. ఈ రోజుల్లో మీ లాంటి వారుండడం ఆశ్చర్యం. కొంచెంగా తీసుకోండి" అని బ్రతిమాలాడు.

అప్పటికే అతను క్లౌన్‌లో త్రాగి వచ్చాడు. నిషా దిగిపోయిందేమో మళ్ళీ మొదలు పెట్టాడు. 'త్రాగుడికి బానిస' అనుకున్నాడు రాయప్ప.

"మీరు బలవంతం చేస్తే నేను వెళ్ళిపోతాను" అన్నాడు రాయప్ప.

"నో. వెళ్ళకండి. మీరు వెళ్ళిపోతే మరీ బోర్" అంటూ

నెమ్మదిగా బాటిల్ ఖాళీ చేశాడు.

కాసేపటికి బయల్దేరారు.

"మీరు చెప్పనేలేదు ఆ విషయం?" అంటూ మళ్ళీ కదలేశాడు రాయప్ప.

"ఏ విషయం?"

"అదే మీ అత్తయ్యను మర్డర్ చేసిన వ్యక్తి."

"అది రహస్యం గురుగారూ! చెప్తే చానా ప్రమాదం. వాడుట్టి గూండా."

"మనల్నేం చేస్తాడు. మనమేమన్నా అతన్ని అడుగుతామా? మనం ఫ్రెండ్స్. ఏవేవో చెప్పుకుంటూ వుంటాం. అంతే. తర్వాత మర్చిపోతాం."

"అయితే వెంటనే మర్చిపోతారా?"

వెంటనే. నాకసలు మతిమరుపు గూడా!"

"అయితే వెరీగుడ్. మా అత్తయ్యని మర్డర్ చేసినవాడు మా మామయ్య."

రాయప్పకి నవ్వు వచ్చింది. నవ్వితే ఎందుకు నవ్వావని ప్రాణం తీస్తాడేమోనని బలవంతాన ఆపుకున్నాడు.

"భలేవారే. మీ అత్తయ్య విడోకదా! మర్చిపోయారా? నాకంటే మతిమరుపు మనిషిలా వున్నారే మీరు. చచ్చిపోయిన మీ మామయ్య యెలా మర్డర్ చేస్తాడు?" ఎగతాళిగా నవ్వాడు.

"మావయ్యంటే చచ్చినవాడు కాదు."

"మరి?"

"బ్రతికివున్నవాడొకడున్నాడు. చిన్నమావయ్య."

రాయప్ప అదిరిపోయాడు ఆ మాట విని.

"ఈ జిట్ కరెక్టా?"

"యస్ గురూ! యస్."

"ఎక్స్క్యూజ్ మీ! నాకు తెలియక అడుగుతున్నాను. మీ అత్తయ్యని చంపితే అతనికి లాభం ఏమిటి? ఆస్తి యెప్పుడో పంచుకున్నారుగదా?" అని ప్రశ్నించాడు రాయప్ప.

"ఆయన్ని డైరెక్ట్ లాభంకాదు. ఇన్ డైరెక్టు లాభం. ఆయనకొక బావ్మర్ది వున్నాడు. చాల బుద్ధిమంతుడు. పదేళ్ళనుంచి డాక్టర్ కావాలని తెగ ట్రై చేస్తున్నాడు. పాపం యింకా కాలేదు. వాడికి తన అన్నకూతుర్నిచ్చి పెళ్ళిచేసి ఎస్టేట్ బిజినెస్ గుప్పిట్లో పెట్టుకోవాలని ప్లాన్‌లో వున్నాడు. అందుకు మా అత్తయ్య ఒప్పుకో లేదు. అందుకే చంపాడు. ఇప్పుడిక యెదురేముంది. లత తల్లిదండ్రులు లేని పిల్ల. పినతండ్రిని నమ్ముకుంది, కసాయి వాడిని మేకపిల్ల నమ్మినట్లు" అన్నాడు సురేష్.

రాయప్ప బుర్ర తిరిగిపోతూవుంది అతను చెప్పేదంతా వింటూవుంటే.

# 6

"లతా! ఈ పరిస్థితులలో నా దొక సలహా" అన్నాడు రాయప్ప.

ఏమిటన్నట్లు తలెత్తి చూసింది లత.

"ఇక నువ్వు ఎంతమాత్రమూ ఒంటరిగా వుండడం మంచిదికాదు. వీలైనంత త్వరలో పెళ్ళిచేసుకోవాలి" అన్నాడు.

లత తల వంచుకుంది ఏదో ఆలోచిస్తూ.

"మీ చినాన్న నాగభూషణం నీ బాధ్యత వహిస్తాడని అనుకుంటున్నాను. ఆయన ధోరణి చూస్తే అందుకు సిద్ధం గానే వున్నాడనిపించింది. ఆయన బావ్మర్ది వున్నాడట, యం.బి.బి.యస్. స్టడీస్‌లో వున్నాడట. అతనికిచ్చి నీ

పెళ్ళి జరిపించాలని ఉద్దేశ్యంలో వున్నాడు. మీ అమ్మతో సంప్రదించాలని అన్నాడు. కాని ఆవిడ ఏ సంగతీ చెప్ప లేదని అంటున్నాడు."

లత మౌనంగా వుండిపోయింది.

"నీకు యిష్టమేనా?" అంది సంధ్య స్నేహితురాలిని.

ఇష్టంలేదని తల వూపింది లత.

"పోనీ మీ బావ సురేష్ అంటేనో? తన కొడుకుని నువ్వు పెళ్ళి చేసుకోవాలని పాపం చాల ఆశతో వుంది" అన్నాడు రాయప్ప.

"అతన్ని నేను పెళ్ళిచేసుకోవడం కల్ల" అంది లత కొంచెం కోపంతో.

"ఏం?"

"అతని ప్రవర్తన మంచిదికాదు. ఎన్నో వ్యసనా లున్నాయి. చూడ్డానికి అందంగా మేడిపండులా వుంటాడు" అంది లత.

"మీ బంధువుల్లో యెవరూ నీకు తగినవారు లేరను కుంటాను. బైట సంబంధాలు చూసుకోవాలి. నువ్వు ఏమీ అనుకోనంటే నా ఫ్రెండ్ ఒకడున్నాడు. వాడి పేరు శ్రీధర్. మంచి పొజిషన్‌లో వున్నాడు. డిప్యూటీ కలెక్టర్‌గా పని చేస్తున్నాడు. త్వరలోనే జిల్లాకలెక్టర్ ప్రమోషన్ రాబోతున్నది. అందంగా వుంటాడు. మంచి పర్సనాల్టీ."

"సారీ! రాయప్ప. నా మనసులో ఒకరున్నారు. అతన్ని పెళ్ళాడాలనుకుంటున్నాను" అంది లత.

"నేను తెలుసుకోవచ్చా?"

"మీకు తెలుసు అతను. మా ఎస్టేట్ మేనేజర్ వేణు గోపాల్. నేను ప్రేమించాను అతన్ని" లత సిగ్గుపడింది.

ఉంగరాల క్రాఫుతో ఎత్తుగా హీరోలా వుండే వేణు గోపాల్ రాయప్ప మనసులో మెదిలాడు.

ఇంతలో సోనీ వచ్చింది "అమ్మా! బాబాయి పిలుస్తున్నాడు" అంది.

"మీరు కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అని వెళ్ళింది లత.

ఆమె వెనుక సోనీ గూడా వెళ్ళిపోయింది.

"శ్రీధర్ ఎవరు రాయ్! మన జూనియరేనా?" ప్రశ్నించింది సంధ్య.

"కాదు. మన జూనియర్ అప్పుడే డిప్యూటీ కలెక్టర్ యెలా అవుతాడు?" నవ్వాడు రాయప్ప.

"మరి యింకెవరు?"

"అసలు శ్రీధర్ అనే డిప్యూటీ కలెక్టర్ యెవరూ లేరు. క్రియేటెడ్ కలెక్టర్" నవ్వుతూ అన్నాడు.

ఆశ్చర్యంగా చూసింది సంధ్య.

"లత మనసు తెలుసుకోవాలని అలా నాటకం ఆడాను."

"అయితే వాళ్ళ బంధువుల్లో ఒకరు వాళ్ళమ్మను చంపించి వుంటారేమో?" అంది సంధ్య.

రాయప్ప సిగరెట్ వెలిగించి పొగ వూదుతూ అటూ యిటూ పచార్లు చేస్తూ "ఆ విషయమే తీవ్రంగా ఆలోచిస్తున్నాను" అన్నాడు.

కాసేపటికి లత వచ్చింది. ఆమె వెనుకే సోనీ కాఫీ కప్పులున్న ట్రే తీసుకొచ్చి టీపాయ్‌మీద పెట్టి వెళ్ళిపోయింది.

"లతా, మీ ప్రేమ సంగతి మీ అమ్మకి తెలుసా?"

"తెలుసు. నేనే చెప్పాను."

"ఏమంది ఆమె?"

"అంతా నా ఇష్టం అంది."

"అయితే మీ అమ్మకు మీ పెళ్ళి ఇష్టమేనన్న మాట" అన్నాడు రాయప్ప.

తల వూపింది లత.

"మీ అమ్మను ఎవరైనా హత్య చెయ్యడానికి అవకాశం వుందా?" ప్రశ్నించాడు రాయప్ప.

"నాకు అనుమానంగా వుంది. కాని ఫలానా అని చెప్పలేకపోతున్నాను" అంది లత.

"మీ అమ్మకి నల్లమందు తీసుకొనే అలవాటుందని డాక్టర్ రిపోర్టులో తేలింది. ఆ సంగతి నీకు తెలుసా?"

"నాకు తెలియదు" అంది లత.

"ఆమెకు ఆ అలవాటు చాల యెక్కువగా వుంది. నిద్రపోయే ముందు తీసుకుని నిద్రపోవడం ద్వారా అలవాటై వుంటుంది. క్రమంగా పగలుగూడా తరచుగా తీసుకోవడానికి అలవాటుపడింది. ఈ సంగతి మీకు తెలియక పోవడం చాల ఆశ్చర్యంగా వుంది."

"నిజంగా నాకు తెలియదు" అంది లత.

"నల్లమందు నిషిద్ధ వస్తువు. అది ఆమెకు యెవరు సప్లై చేసేవారో తెలుసుకోవలసి వుంది" అన్నాడు రాయప్ప.

"ఇప్పుడు ఎవరు చెప్తారు?" అంది సంధ్య.

రాయప్ప నవ్వి "ఈ గది మీ అమ్మగారు ఉపయోగించేవారా?" అన్నాడు చుట్టూ కలయజూస్తూ.

"అవును."

"ఈ గది నేను ఇన్వెస్టిగేట్ చెయ్యాలనుకుంటున్నాను. అభ్యంతరమా?"

లేదన్నట్లు తల వూపింది లత.

రాయప్ప పరిశోధన ప్రారంభించాడు.

గాడ్రెజ్ స్టీల్ బీరువాలో సేఫ్టీలాక్ ఓపెన్ చెయ్యగానే కనిపించింది నల్లమందు ఒక సీసాలో. న్యూస్ పేపర్ చుట్టబడింది సీసాచుట్టూ.

"చూశావా లతా! నల్లమందు" సీసా లతకి అందించాడు.

లత ఆశ్చర్యంగా చూసింది.

రాయప్ప న్యూస్ పేపర్ విప్పి పరీక్షగా చూశాడు. ఒక మూల వారం రోజుల క్రితం తారీఖు వుంది. ఎవరిదో సంతకం చేసివుంది పేపరుమీద. జాగ్రత్తగా చూస్తే ఆ సంతకం 'షణ్ముగం' అనే అతనిది.

రాయప్ప గబగబా హాల్లోకి వెళ్ళి ఫోన్లో పోలీస్ స్టేషన్‌కి రింగ్ చేశాడు.

"యస్.ఐ. స్పీకింగ్" అని వినిపించింది అవతల నుంచి.

"హలో నందన్ కుమార్."

"యస్."

"నేను రాయ్‌ని మాట్లాడుతున్నాను. రాజవరం నుంచి."

"రాయ్! గుడ్ మార్నింగ్. ఏమిటి విశేషాలు? యెంత వరకు వచ్చింది మీ పరిశోధన."

"దార్లోనే వుంది. ఇంకా ఒక కొలిక్కి రాలేదు. ఇప్పుడొక ముఖ్యమైన సమాచారం కావాలి. రాజామణి గదిలో నల్లమందుసీసా దొరికింది. ఆ సీసా ఒక న్యూస్ పేపర్లో చుట్టివుంది. దానిమీద షణ్ముగం అనే సంతకం వుంది. ఎవరో ఈ షణ్ముగం అనే విషయం కావాలి. న్యూస్ ఏజంట్ ద్వారా కనుక్కోవచ్చు. బహుశా యీ షణ్ముగం అనే వాడే రాజామణికి నల్లమందు సప్లై

చేస్తూ వుండివుండాలి. ఎవరిద్వారా నల్లమందు పంపే వాడో కనుక్కుంటే కొంత క్లూ దొరుకుతుంది" అన్నాడు రాయప్ప.

"అలాగే. నేను కనుక్కొని ఫోన్ చేస్తాను.

"ఓ.కే. థాంక్స్."

"నో మెన్షన్."

ఫోన్ పెట్టేసినట్లు క్లిక్‌మని శబ్దం వచ్చింది. రిసీవర్ క్రెడిల్ మీద పెట్టేశాడు రాయప్ప.

## 7

ఎదురు చూసి చూసి విసుగుపుట్టింది రాయప్పకి.

సంధ్యకాంతులు మాసిపోతున్నాయి.

చీకటితెరలు క్రమ్ముకొస్తున్నాయి.

కొండచివర విశాలమైన రాతిమీద కూర్చున్నాడు రాయప్ప ప్రకృతి దృశ్యాల అందాలను తిలకిస్తూ.

చీకటిపడితే కొండ దిగటం కష్టం. అంతేకాదు, పాములు, తేళ్ళు వంటివి తారసపడవచ్చు కూడా. అందుకే బ్యాటరీలైటు వెంట తెచ్చాడుగూడా.

చీకటి పడకముందే వస్తానని మాట ఇచ్చింది సోనీ.

ఇంకా రాలేదు.

వస్తుందా? రాదా?

రాయప్ప మనస్సు ఎక్కడో వుంది.

మువ్వలు చప్పుడు చేసినట్లు సన్నటి నవ్వు వినిపించింది. వెనక్కి తిరిగి చూశాడు.

సోనీ నవ్వుతూ కనిపించింది.

ఆకుపచ్చటి చీర మాచింగ్ బ్లవుజు. ఆమె పచ్చటి పూలు పెట్టుకుంది.

మసకచీకట్లో కన్యలా కనిపించింది.

"ఇంత ఆలశ్యం చేశావేం? ఇక రావనుకున్నాను" అన్నాడు.

"ఏమిటో చెప్పు" అంటూ చొరవగా వచ్చి దగ్గర్లోనే కూర్చుంది.

రాయప్ప కవరు ఆమె చేతికిచ్చాడు.

కవరులో నుంచి తీసింది ఒక ఫోటో. అతను బ్యాటరీ స్విచ్ నొక్కాడు! అందులో తన ఫోటో చూసి ఆశ్చర్య పోయింది సోనీ.

"ఎప్పుడు తీశావ్?" ఆశ్చర్యపోయింది.

"నీకు తెలియకుండా తీశా! ఎలా వుంది?"

"ఎలా వుందో నువ్వే చెప్పు" అంది నవ్వుతూ.

"ఇదుగో ఈ సినిమాపత్రిక చూశావా?"

సోనీ అందుకుని చూసింది ముఖచిత్రం.

"అట్టమీద బొమ్మ యెవరిదో తెలుసా. ఆవిడ పేరు హైమ. ఇప్పుడు ఇరవై సినిమాల్లో నటిస్తోంది. సినిమాకి యెంతో తెలుసా?"

"ఎంత?"

"మూడులక్షలు" అన్నాడు.

"అమ్మో!" అంది సోని గుండెలమీద చెయ్యివేసుకుని.

"అది తెలుగులో అయితే. హిందీ సినిమా అయితే సినిమాకి పదిలక్షలు యిస్తారు."

సోని ముఖం ఆశ్చర్యంలో మునిగిపోయింది.

"ఆ హైమ నీ ముందు బలాదూర్" అన్నాడు.

సోని గర్వంగా చూసింది అతని వంక.

"నీ అందం నీకు తెలియదు సోనీ. ఈ మారుమూల పల్లెటూళ్ళో నీ అందం వృథాగా అయిపోతోంది. ఒకళ్ళ ఇంట్లో పనిమనిషిగా వుండే కర్మ నీకేం పట్టింది?"

"ఏం చెయ్యను నా కర్మ" విచారంగా అంది సోని.

"నీకు పెళ్ళి కాలేదా?"

"లేదు. ఒకడు నన్ను పెళ్ళి చేసుకుంటానని మోసం చేసి వదిలేశాడు బెంగుళూరులో. చచ్చీ చెడి ఇల్లు చేరుకున్నాను. నేను ఇంట్లో నుంచి చెప్పకుండా వెళ్ళిపోయానని మా అమ్మ దిగులుతో చచ్చిపోయింది."

"ఎవరూ లేరా నీకు?"

"మా అన్నయ్య వున్నాడు."

"ఏం చేస్తుంటాడు?"

"రాజామణి గారి ఎస్టేట్‌లో వాచ్‌మాన్‌గా పని చేస్తున్నాడు. వట్టి తాగుబోతు. నా గురించి పట్టించుకోడు ఎదవ" నవ్వింది సోని.

"ఇంకేం మరి. అదృష్టం నీ చేతిలో వుంది. నువ్వు తల్చుకుంటే కోట్లు సంపాయించగలవు" అన్నాడు రాయప్ప.

"ఎలా?"

"సినిమాల్లో జేర్పిస్తాను నా వెంట రా."

"నిజంగా నేను పనికి వస్తానా?"

"బ్రహ్మాండంగా. అదంతా నీ కెందుకు? నువ్వు వూఁ అను చాలు. మిగతాదంతా నేను చూసుకుంటాను గదా."

సోని ఆలోచనలో పడిపోయింది.

రాయప్ప నెమ్మదిగా సోని చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. సోని సిగ్గుపడుతూ అతని గుండెల్లో తల దాచుకుంది.

"ఏమంటావు సోనీ."

"నీ ఇష్టం."

"నువ్వు బాగా డబ్బు సంపాదించాక నన్ను మర్చిపోవు గదా?" అన్నాడు.

"ఛీ....నిన్ను మర్చిపోతానా? అసలు నిన్ను వదిలి పెట్టను."

"ఏం చేస్తావ్ వదలక. పట్టుకుంటావా?"

"ఆఁ....నిన్నే పెళ్ళి చేసుకుంటాను" అంది సోని.

రాయప్ప "నిజంగా" అన్నాడు ఆశ్చర్యపోతూ.

"నిజం" అని అతని అరచేతిని గిచ్చింది.

కాసేపైన తర్వాత బ్యాటరీలైటు వెలుగులో యిద్దరూ కొండ దిగారు. వూరి పొలిమేర్లలోకి వచ్చాక "మా ఇంటికి రారాదూ!" అంది సోని.

"ఇంట్లో మీ అన్న లేడా?"

"ఈ రోజు నైట్ డ్యూటీ. అన్నం తిని వెళ్ళిపోయి వుంటాడు ఈ పాటికి." మత్తుగా చూసింది సోని వళ్ళు విరుచుకొంటూ.

సోని అందాలు చూసి రాయప్ప మనసు పీకింది. బలవంతాన నిగ్రహించుకొన్నాడు.

"తొందరెందుకు? యెవరైనా చూస్తే గొడవ" అన్నాడు.

"అంత భయమా?" అంది.

"భయంకాదు. నీ మీద భక్తి. నీ అందం అనుభవించడానికి కాదు. ఆరాధించడానికి."

అర్థం కానట్లు చూసి నవ్వుతూ వెళ్ళిపోయింది సోని.

రోడ్డు మలుపు తిరగబోతూండగా ఎవరో వెనుక తల మీద బలంగా కొట్టారు. కెవ్వున కేక పెట్టి విరుచుకు పడిపోయాడు రాయప్ప.

# 8

తలకి కట్టు కట్టుకొని కూర్చున్న రాయప్ప ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు ఎస్టేట్ మేనేజర్ వేణు

గోపాల్.

"నలే ఆశ్చర్యంగా వుందే? మీకు శత్రువులు ఎవరున్నారు ఇక్కడ?" అన్నాడు.

"నాకు అదే అర్థం కావడం లేదు...." అన్నాడు రాయప్ప.

"ఇంకా నయం. కొద్దిలో తప్పిపోయింది. లేకపోతే ప్రాణాం పోయి వుండేది" అంది సంధ్య.

"నేను ఈ రోజు వెళ్ళిపోదామనుకొన్నాను. ఇంతలో ఈ దెబ్బ తగిలింది."

"అప్పుడే వెళ్ళిపోతారా? రాజామణిగారి పెద్ద కర్మ అయ్యేవరకూ వుండండి. మీరు వుండబట్టి హేమలత కాస్త ప్రశాంతంగా వుండగలుగుతోంది" అన్నాడు వేణుగోపాల్.

"నేను వెళ్ళినా సంధ్య వుంటుంది లెండి" అన్నాడు రాయప్ప.

"నేను వెళ్ళరానా? టౌన్‌కి వెళ్ళి వాగన్స్ బుక్ చేసి తీరాలి. నర్సాపూర్ పార్టీ టెలిగ్రామ్స్‌మీద టెలిగ్రామ్స్ కొడుతున్నారు సరుకుకోసం. రెండు రోజుల్లో సరుకు పంపకపోతే సరాసరి ఎస్టేటుకి వచ్చేసి గొంతుమీద కూర్చుంటారు" అన్నాడు నవ్వుతూ.

"వెళ్ళిరండి" అన్నాడు రాయప్ప.

"సీ. యూ!" అని చెయ్యి వూపుకొంటూ వెళ్ళాడు వేణుగోపాల్.

అతను అటు వెళ్ళగానే నౌకరు వెంకన్న గదిలోకి వచ్చాడు. అతను ఏదో చెప్పడానికి వచ్చినట్లు వుంది. ఎందుకో తటపటాయిస్తున్నాడు.

"ఏమిటి వెంకన్నా?" అంది సంధ్య.

"బాబుగారిని కొట్టినవాడిని నేను చూశానమ్మా!" అన్నాడు వెంకన్న.

"ఎవరతను?"

వెంకన్న అటూ ఇటూ చూసి "వాడు రాములు." అన్నాడు.

"రాములు యెవరు?"

"మన గోడౌన్ వాచ్‌మాన్."

"వాడెందుకు కొట్టాడు?" కోపం వచ్చింది సంధ్యకి.

"నేను నిన్న బస్సు దిగి వచ్చానమ్మా. బాబుగారూ, సోని మాట్లాడుకుంటూ వెళ్ళారు కొంచ దూరం. తర్వాత సోని వాళ్ళింటికి వెళ్ళిపోయింది. బాబుగారు ఒంటరిగా పోతున్నప్పుడు రాములు వెనుకనుంచి కర్రతో కొట్టాడు. నన్ను చూసి పారిపోయాడు."

ఎర్రగా చూసింది సంధ్య రాయప్ప వైపు.

రాయప్ప దొంగలా దిక్కులు చూశాడు.

"రాములుకి సోనికి ఏం సంబంధం?" అన్నాడు.

"వాడు దానికి అన్న బాబుగారూ!" అన్నాడు వెంకన్న.

"అలాగా! అయితే అర్థమైందిలే!" అన్నాడు రాయప్ప నవ్వుతూ.

వెంకన్న వెళ్ళిపోయాడు.

"వూఁ....సోనీ వెంటపడ్డారన్న మాట. కుక్కబుద్ధి" అంది సంధ్య కోపంగా.

"ఛీ....దాని వెంట పడే ఖర్మ యెందుకు నాకు నువ్వుండగా!"

"తెలిసిందిగా అబ్బాయిగారి సంగతి. దానితో తిరగడం చూసి దాని అన్న బాగా తగలనిచ్చాడుగా!

బాగా బుద్ధి చెప్పాడులే," రుసరుసలాడింది సంధ్య.

"నేను తిరుగుబోతునా? దాని చుట్టూ తిరగడానికి? దానివల్ల కొంత సమాచారం రాబట్టడానికి కొంత నాటకం ఆడుతున్నాను. అంతే. నీవిగాద ఒట్టు," అన్నాడు

వెంకన్న మళ్ళీ వచ్చాడు.

"బాబుగారూ, మీకు ఫోన్ వచ్చిందట. అమ్మగారు పిలుచుకురమ్మన్నారు." అన్నాడు.

"వస్తున్నా పద," అని నెమ్మదిగా వెళ్ళి రిసీవర్ ఎత్తాడు.

"రాయ్ స్పీకింగ్ ప్లీజ్."

"హల్లో రాయ్! నేను ఇన్స్పెక్టర్ నందన్ను మాట్లాడుతున్నాను. ఆ షణ్ముగం యెవరో తెలుసుకున్నాను. అతను ఈ టౌన్వాడే. పొగాకు వ్యాపారం. నాలుగు తగలనిస్తే నిజం చెప్పాడు. వాడు నల్లమందు అమ్మే మాట నిజమేనట. రాజామణిగారికి వీడే నల్లమందు సప్లై చేస్తుంటాడట."

"ఎవరిద్వారా?"

"ఎవడో రాములట. రాజామణిగారి ఎస్టేట్లోనే పని చేస్తుంటాడట. వాడే అప్పుడప్పుడూ వస్తుంటాడట"

"వెరీగుడ్. నేను ఈ వెనింగ్ టౌన్కి వస్తున్నాను."

"ఓ. కే."

రాయప్ప ఫోన్ పెట్టేసి, ఆలోచనలో పడిపోయాడు.

## 9

ప్యారడైజ్ హోటల్లోకి ప్రవేశించారు సోని, రాయప్పలు.

అప్పుడే సినిమా చూసి వచ్చారు ఇద్దరూ.

లాక్ తీసి తలుపులు తెరిచాడు రాయప్ప.

"సినిమాహాల్లో అంతా నావైపే చూస్తుంటే సిగ్గేసింది." అంది సోని సిగ్గుపడుతూ.

"ఎవడికోసం చూస్తారు? నీ అందం" అంత గొప్పది. నేను చెప్తుంటే విన్నావూ? రేపు సినిమాల్లో చేరాక నువ్వొంటే చాలు ఎగబడి వస్తారు జనం.

"నువ్వు మరీ ...." అంది సోని మెలికలు తిరిగిపోతూ.

గులాబీరంగు షిఫాన్ చీర, అదేరంగు బ్లౌజు, చెవులకు రింగులు, మెడలో రాళ్ళ నెక్లెస్, రెండు జడలలో చామంతి పువ్వులు, తామర పువ్వులవంటి కాటుక కళ్ళతో సోని అప్సరసలా మెరిసిపోతూంది.

రాయప్ప ఆమె నడుం చుట్టూ చేతులువేసి ముందుకు లాక్కున్నాడు.

సోనీ ఆవేశంతో అతని క్రాఫులోకి వేళ్ళు పోనిచ్చి చిందరవందర చేసేసింది.

టక్ .... టక్ .... టక్.

"ఎవరో వచ్చారు!" సోనీ కంగారుగా లేవబోయింది.

రాయప్ప ఆమెను వదల్లేదు.

"ఎవడో రూమ్‌బాయ్ లే. వాడే పోతాడు," అన్నాడు

టక్ .... టక్ .... టక్.

"ఎవరూ?" గట్టిగా అన్నాడు.

"తలుపు తెరువు."

రాయప్ప విసుగ్గా వెళ్ళి బోల్టు తీశాడు.

తలుపులు తెరవగానే పోలీసులు లోనికి వచ్చారు విసురుగా.

"పదండి స్టేషన్‌కి."

"ఎందుకు?" అన్నాడు రాయప్ప వెల వెలపోతూ.

"ఎందుకేమిటి? ఆ పిల్ల ఎవరు? నువ్వు రాజవరంనుంచి లేపుకుని వచ్చావు. బ్రోతల్ కేసుక్రింద అరెస్ట్ చేస్తున్నాం" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏయ్ పద...." లాఠీతో నెట్టాడు సోనీని.

సోనీకి యేడుపు ముంచుకొచ్చింది.

రాయప్పవంక చూసింది దీనంగా.

'తప్పదు పద' అన్నట్లు తల వూపాడు రాయప్ప.

భారంగా అడుగులు వేసింది సోని.

# 10

"వెల్‌కమ్ మిస్టర్ రాయ్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ నందన్‌కుమార్.

"థాంక్‌యూ! నాకోసం ఎదురుచూస్తూ వున్నందుకు" అన్నాడు రాయప్ప ఛైర్‌లో కూర్చుంటూ.

"నో మెన్షన్. నేరస్థుల్ని పట్టుకోవడానికి తప్పదు మరి," అన్నాడు.

"ఎవరు నేరస్థులు?"

"మీరే చెప్పాలి." నవ్వుతూ అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"నేను కాదు సోనీ చెప్తుంది," అన్నాడు రాయప్ప సోనీవైపు కొంటెగా చూస్తూ.

సోనీకి అంతా అయోమయంగా వుంది. రాయప్ప తనతో పాటు ముద్దాయిగా రావటాం, ఇక్కడికొచ్చాక పోలీసులతో కుమ్మక్కయిపోవడం చూసి మతి పోయినట్లయింది.

"నీ పేరు సోనీయా?" ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్.

తల వూపింది అవునన్నట్లు.

"మీ అమ్మగారు రాజామణి వెంట ఎక్కువగా షికారుకెళ్ళేది నువ్వే కదూ!"

"నేనేకాదండీ ముత్యం, రత్నం గూడా వెళ్తుంటారు"

అంది సోని.

"మీ అమ్మగారు చనిపోయిన రోజు నువ్వు పనిలోకి వెళ్ళలేదు. అవునా?"

"వంట్లో బాగోలేక వెళ్ళలేదండి."

"అంతకు ముందురోజు గూడా వెళ్ళలేదు. అవునా?"

"అవునండి."

"మరి ఆ రోజు మీ అమ్మగారి వెంట యెవరు వెళ్ళారు షికారు."

"ఎవరూ వెళ్ళలేదండి!"అంది సోని భయంగాచూస్తూ.

"ఎవరూ వెళ్ళలేదని యెలా తెలుసు నీకు?" దబాయించాడు యిన్‌స్పెక్టర్.

"మరండి....మరండి...." ఏం చెప్పాలో తోచక సోని మాటలు తడబడ్డాయి.

"చెప్పు. నువ్వు మీ అమ్మగారు కొండ ఎక్కుతుంటే చూశావు గదూ!"

"చూళ్లేదండి."

"మరి ఒంటరిగా వెళ్ళిందనీ, ఎవరూ తోడు లేరనీ యెలా చెప్పావు?"

సోని ముఖం భయంతో తెల్లగా పాలిపోయింది.నోట మాట రావడంలేదు.

"అసలు మీ అమ్మగారు అప్పుడప్పుడూ కొండమీదకి షికారు ఎందుకెళ్తోందో నీకు తెల్సా!"

"కొండ ఎక్కి దిగితే ఆరోగ్యం, జబ్బులు రావని చెప్పేవారండి," అంది సోని గొంతు పెగల్చుకుని.

"నిజం చెప్పు మీ అమ్మగార్ని కొండమీద నుంచి ఎవరు నెట్టేశారు?" గర్జించాడు ఇన్‌స్పెక్టర్.

సోనీకి ఏడుపు ముంచుకొచ్చి పెద్దగా యేడవసాగింది.

ఇంతలో స్టేషన్ బయట జీప్ ఆగింది.

రాముల్ని బేడీలు వేసుకుని తీసుకొచ్చారు. వాడు వచ్చీ రాగానే చెల్లెల్ని చూసి నిర్ఘాంతపోయాడు. అన్నని చూసి సోనీ బావురుమంది. చెల్లెలి దుఃఖం చూసి వాడు తుఫాన్‌లో చెట్టులా వణికిపోయాడు.

"అది చెప్పిందంతా అబద్ధం సార్! అమ్మగార్ని చంపింది నేను," అన్నాడు రాములు.

సోని పిచ్చిదానిలా అరిచింది. "లేదయ్యా! మా అన్న కేం తెలియదు. వేణుగోపాల్ బాబు మాటలు విని నేనే అమ్మగార్ని కొండమీద నుంచి నెట్టేశాను. నేనే. మా అన్న కాదు."

తర్వాత ముఖంమీద చేతులు పెట్టుకుని బిగ్గరగా యేడవసాగింది. రాములు కూడా యేమీ మాట్లాడలేక పోయాడు.

ఇన్‌స్పెక్టర్ నందనకుమార్ ఆశ్చర్యంగా చూశాడు రాయప్ప వంక.

"యస్ ఇన్‌స్పెక్టర్. సోనీ చెప్పింది నిజమే," అన్నాడు.

"వీళ్ళిద్దర్నీ లాకప్‌లో పడెయ్యండి," అన్నాడు ఇన్‌స్పెక్టర్.

పోలీస్ కానిస్టేబుల్సు ఇద్దర్నీ లాకప్‌లోకి తీసుకెళ్ళారు.

వేణుగోపాల్‌ను అరెస్టు చెయ్యడానికి సార్జెంట్‌ను మరి కొందరి పోలీసులను పంపాడు.

"అసలు వేణుగోపాల్ రాజామణిని హత్య చేయించి వుంటాడని యెలా అనుమానించారు?" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వేణుగోపాల్ గిల్టీ కాంషస్‌తో బైట పెట్టు కున్నాడు తన రహస్యాన్ని. అసలు ఈ కేసులో వున్న భయంకరమైన రహస్యం ఒకటుంది. ఆ నిజం చాలా చేదుగా వుంటుంది గూడా వినేవాళ్ళకి."

"ఏమిటది?" కుతూహలంతో ప్రశ్నించాడు ఇన్‌స్పెక్టర్ నందకుమార్.

"రాజామణిని మీ రెప్పుడైనా చూశారా?"

చూశానన్నట్లు తలూపాడు ఇన్‌స్పెక్టర్.

"ఎలా వుంటుంది?"

"చాలా అందంగా వుంటుంది!"

"అదికాదు. ఆమె ప్రవర్తన."

"నేనేమీ వినలేదు. కాని చూడటానికి మంచిదానిలాగే వుంటుంది."

"ఆమె వయసు మీరు గమనించారా? నలభై దాటి వుంటాయి కాని పదేళ్ళు తక్కువ వున్నట్లు కనిపిస్తుంది. అఫ్‌కోర్స్ నేనామెను చూళ్ళేదనుకోండి. రీసెంట్ ఫోటోగ్రాఫ్ చూశాను."

అవునన్నట్లు తల వూపాడు ఇన్‌స్పెక్టర్.

"ఆమె విడో. లత తండ్రి చనిపోయి రెండు మూడేళ్ళు అయిపోయిందేమో! తర్వాత ఆమె వేణుగోపాల్‌తో శారీక సంబంధం పెట్టుకుంది."

"ఈజిట్!" ఆశ్చర్యంగా అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"యస్ ఇన్‌స్పెక్టర్. ఆ వూళ్ళో చాలామందికి ఆ రహస్యం తెలుసు గూడా. ఏ గోడవైనా దాగుతుంది. ఇటువంటివి దాగవు. నేను గూడా అది వట్టి పుకారేమో అనుకున్నాను. కాని ఆమె అనుచరురాలు సోసీని సినీస్టార్ చేస్తానని ఆశ పెట్టి రహస్యం బైటకి లాగాను.

రాజామణి వేణుగోపాల్ సంబంధం ఆ ఇంట్లో అందరికీ తెలుసు ఆమె కూతురికి తప్ప. హేమలత అమాయకంగా వేణుగోపాల్‌ని ప్రేమించింది. వేణుగోపాల్ అల్లుడైతే తనకు గూడా బాగానే వుంటుందని రాజామణి అభ్యంతర పెట్టలేదు. కాని అతనే భయపడ్డాడు. తల్లితో సంబంధం వుందనే సంగతి లతకి ఏ మాత్రం తెలిసినా తనని తిరస్కరిస్తుందని అనుమాన పడ్డాడు.

ఎటువంటి పరిస్థితులలోనైనా హేమలతని పెళ్ళి చేసుకోవాలనుకున్నాడు. ఆమె కోటి రూపాయల ఆస్థికి ఏకైక వారసురాలు. తల్లి శాశ్వతంగా వుండదు. కూతురితోనే తనకు జీవిత సంబంధం. అందుకని రాజామణిని స్టోన్, రాముల సహాయంతో గుట్టు చప్పుడు కాకుండా చంపించాడు."

"ఓరి వీడి ఆశ పాడుగానూ!"

"వేణుగోపాల్ పదే పదే అనేవాడు తనకి బిజినెస్ వ్యవహారాలు తప్ప రాజామణి పర్సనల్ వ్యవహారాలు తెలియవని. లతతో గూడా పెద్ద పరిచయం వున్నట్లు చెప్పలేదు. కాని లత అతన్ని తను ప్రేమిస్తున్నట్లు చెప్పగానే నా అనుమానం అతని మీదకే పోయింది" అన్నాడు రాయప్ప.

"మెత్తానికి మీరు తీగంతా లాగి డొంకను బైటికి తీశారు?" అన్నాడు ఇన్స్పెక్టర్ మెచ్చుకోలుగా చూసి.

"నేను కాకపోతే మీరైనా లాగివుండేవాళ్ళు."

"ఆఁ. మాకంత తీరిక యెక్కడుంది. అయినా ఆమె ప్రమాదవశాత్తు మరణించిందనే ధ్యాసలోనే వున్నాం."

రాయప్ప ఫోన్ యెత్తి, "కొంచెం లతతో మాట్లాడతాను. విత్ యువర్ పర్మిషన్" అన్నాడు.

88

"ఓ.. కే."

రాయప్ప నెంబర్ డైల్ చేశాడు.

అవతల లత ఫోను ఎత్తింది.

"హలో లతా! మీ అమ్మని చంపిన హంతకుడిని కని పెట్టాం." అన్నాడు.

"నిజమా?"

"ఆc.,.."

"ఎవరు?"

"నీ కొక చేదు నిజం వినిపించబోతున్నా! అందుకే ముందుగా సారీ చెప్తున్నా!"

"ఫరవాలేదు చెప్పు."

"అతను నీ ప్రియుడు వేణుగోపాల్." అన్నాడు రాయప్ప.

—ఐపోయింది—

# తోడు దొంగలు

ప్రతాప రవిశంకర్

"ఆమె నిన్ను చూసిందా?" ఆదుర్దాగా అడిగాడు దుష్యంతరావు....

"అవును." అన్నాడు రంగశాయి.

"గుర్తు పట్టిందా?"

"ఆ.... వెనక్కు తిరిగి చూసింది కూడా."

"మైగాడ్ ....అయితే మనకు ప్రమాదం."

"ఇప్పుడేం చేద్దాం?" అడిగాడు రంగశాయి.

దుష్యంతరావు వెంటనే మాట్లాడలేదు....ఆలోచిస్తూ వుండిపోయాడు.

తర్వాత—

"అసలు నువ్వు సిల్కు హౌస్‌కు ఎందుకు వెళ్ళావ్?" అన్నాడు.

"ఎందుకేమిటి? రెండు షర్టులు కొందామని వెళ్ళాను. తీసుకున్నాను....వాడు ప్యాక్ చేస్తూవుండగా లోపలకు వచ్చింది అరుంధతి....ముందు నేనే చూశాను. నేను

ఆశ్చర్యంనుండి తేరుకోకముందే నన్నే చూసింది. గబగబా ఆ ప్యాక్ తీసుకుని అక్కడినించి కదిలాను. నాలుగడుగులు వేసి వెనక్కి తిరిగి చూశాను. నన్నే చూస్తోంది," మళ్ళీ అన్నాడు.

"మళ్ళీ మనకు కష్టాలు మొదలయ్యాయి."

"ఇంతకీ మనం ఇప్పుడు ఏం చెయ్యాలి" అన్నాడు రంగశాయి.

"అదే ఆలోచించాలి....మన గురించి అరుంధతి పోలీసులకు చెబుతుందంటావా?"

"చెప్పొచ్చు. చెప్పకపోనూవచ్చు."

"చెప్పకపోతే మనకు ప్రమాదం లేదు. చెబితేనే మనకు ఆపద."

"మరి మనకెలా తెలుస్తుంది?"

"తెలుసుకోవాలి."

"ఎట్లా?"

"అరుంధతిని ఒకసారి కలుసుకోవాలి."

"ఎడ్రసు తెలీదు కదా? ఎలా?"

"ప్రయత్నం చేద్దాం....ఇంతకీ అరుంధతి హైద్రాబాద్ నుంచి ఎప్పుడు వచ్చింది?"

"ఏమో మనిషి బాగా మారిపోయింది. ఖరీదయిన చీర కట్టుకుంది. మెడనిండా నగలున్నాయి."

"అయితే బాగా డబ్బు సంపాదిస్తుందన్నమాట."

"బయట కెళదామా?" అడిగాడు రంగశాయి సిగరెట్టు కిటికీలోంచి బయటకు విసిరి.

కుర్చీలోంచి నిలబడ్డాడు దుష్యంతరావు. గదికి తాళం పెట్టాడు రంగశాయి. ఇద్దరూ బయటకు వచ్చారు.

చీకటిపడింది. వీధి దీపాలు ప్రకాశవంతంగా వెలుగు

తున్నాయి.

రోడ్డుమీద యెదురొస్తున్న మనుషులను చూసుకుంటూ నడుస్తున్నారు. కనిపించిన ప్రతి ఆడదాన్ని పట్టి పట్టి చూస్తున్నారు.

"ఇలా లాభంలేదు రావ్....మనం అరుంధతి కనిపించిన సెంటర్‌కు వెళదాం" అన్నాడు రంగశాయి.

"అరుంధతి ఇప్పుడు కూడా అక్కడే కనపడుతుందని నమ్మకం ఏముంది?"

"ఆ ప్రాంతాల అదే మంచి సెంటర్....మరేదయినా కొనాలనుకున్నా అరుంధతి అదే సెంటర్‌కు రావొచ్చు"

"సరే అయితే."

ఖాళీగా వెళుతున్న ఆటోని పిల్చాడు దుష్యంతరావు. ఇద్దరూ అందులోకి ఎక్కి "సికింద్రాబాద్" అన్నారు డ్రయివర్‌తో....

ఆటో దూసుకెళుతోంది.

ఇద్దరూ సిగరెట్లు వెలిగించారు—

దుష్యంతరావు-రంగశాయి ఆరితేరిన దొంగలు. వాళ్ళకు రకరకాల భాషలు వొచ్చు. ఇద్దరూ అంతో ఇంతో చదువుకున్న వాళ్ళు.అవసరమయితే ఇంగ్లీషు కూడా మాట్లాడతారు.

ఇంతకుముందు మద్రాసులో ఓ బ్యాంకు దొంగతనం చేసి ఎనభై వేలు సంపాదించారు. ఆ తర్వాత అక్కడి నించి హైద్రాబాద్‌కు పారిపోయి వచ్చారు. మద్రాసులో వుండగానే వాళ్ళిద్దరికీ అరుంధతి కలిసింది. కొన్ని చిన్న చిన్న దొంగతనాలకీ, పెద్ద దొంగతనాలకూ అరుంధతి సహాయం పొందారు. అందుకు ప్రతిఫలంగా అరుంధతికి కొంత సొమ్ము ముట్టచెబుతామన్నారు. కాని పైసా కూడా

యివ్వలేదు. అందుకే అరుంధతి తను గురించి పోలీసులకు చెబుతుందేమోనని వాళ్ళకు ఇప్పుడు భయంగా వుంది.

ఆటో ఆగింది.

దిగారు....

రోడ్లన్నీ జనంతో సందడిగా వున్నాయి.

నడుచుకుంటూ క్లాక్ టవర్ దగ్గరకు వచ్చారు. సంగీత్ థియేటర్ రోడ్డులోకి తిరిగారు.

వాహనాలు జోరుగా వెళుతున్నాయి.

"అరుంధతి అందమయినది కదూ" అన్నాడు రంగశాయి హటాత్తుగా.

నవ్వేడు దుష్యంతరావు.

తర్వాత—

"ఇప్పుడు అరుంధతి అందం గురించి యెందుకు గుర్తుకొచ్చింది" అన్నాడు.

"మనమే మంచివాళ్ళమయితే ఇద్దరిలో ఎవరో ఒకరం అరుంధతిని చేసుకునే వాళ్ళం."

"ఏం....ఇద్దరం చేసుకోగూడదా?"

"నాకేం అభ్యంతరంలేదు. ఎన్నింటినో కలిసి పంచుకుంటున్నాం. ఒక ఆడదాన్ని మాత్రం ఎందుకు పంచుకోగూడదు?"

"రైట్. ముందు దాన్ని కనపడనీ."

హోటల్ కామత్ లోకి నడిచారు.

కొంత మంది బయట లాన్ లో కూర్చుని కాఫీలు తాగుతున్నారు.

లోపలకు నడిచారు.

రద్దీగా వుంది.

టిఫిన్ చేశారు. చేస్తూనే లోపలకు వస్తున్న వాళ్ళను

గమనిస్తున్నారు.

కాఫీ తాగుతూ వుండగా అరుంధతి లోపలకు వస్తూ కనిపించింది.

ఇద్దరూ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేశారు.

అరుంధతి అందం వాళ్ళకు కళ్ళు చెదిరేలా చేసింది. అయిదొందల రూపాయల ఖరీదయిన చీర కట్టుకుంది. రెండు చేతులకూ బంగారు గాజులు.... వెళ్ళో నగలు.... తెల్లగా బంతిలా వుంది—

అప్రయత్నంగా లేవబోయాడు రంగశాయి.

దుష్యంతరావు అతడిని వారించాడు.

వాళ్ళను చూడగానే అరుంధతి సన్నగా నవ్వింది. కళ్ళతోటే ఏదో సైగ చేసింది.

ఆ సైగను దుష్యంతరావు అర్థం చేసుకున్నాడు. ఇలాంటి విషయాల్లో రంగశాయి కంటే దుష్యంతరావే చురుకయిన వాడు.

ఐదు నిముషాలు గడిచాయి.

ఇద్దరూ సిగరెట్లు కాలుస్తూ కూర్చున్నారు బిల్లు చెల్లించి. ఇంకో అయిదునిమిషాల తర్వాత అరుంధతి వాళ్ళ ముందునించి వయ్యారంగా నడుస్తూ వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన నిమిషానికి యిద్దరూ బయటకు వచ్చారు. రోడ్డుపక్కగా నిలబడి వుందామె....రోడ్డున వెళుతున్న వాళ్ళు వెనక్కి తిరిగి అరుంధతినే చూస్తూ వెళుతున్నారు. ఆమె అందం వాళ్ళను మూగులను చేస్తోంది.

వాళ్ళిద్దరూ ఆమె దగ్గరగా వచ్చారు.

ఇంతలోనే అరుంధతి ఓ. టాక్సీని పిలిచింది. వెనుక సీట్లో యెక్కి ఇద్దరినీ యెక్కమని సైగ చేసింది.

రంగశాయి ఏదో మాట్లాడబోయాడు. కళ్ళతోటే

అతనికి మాట్లాడవద్దని సైగ చేసింది.

"ఇందిరా పార్క్" అన్నది డ్రయివర్‌తో.

టాక్సీ వెళుతోంది. రోడ్డుపక్కనే వున్న పరిసరాలు గబగబా వెనక్కు వెళుతున్నాయి.

అరుంధతి శరీరం రంగశాయికి తగులుతోంది. సున్నగా వుంది ఆమె వొళ్ళు. రంగశాయికి గిలిగింతగా వుంది. పార్కుముందు ఆగింది టాక్సీ.

హాండ్ బ్యాగ్ లోనించి డబ్బులు తీసి యిచ్చింది డ్రయివర్‌కి. టాక్సీ వెళ్ళిపోగానే ముగ్గురూ పార్కులోకి నడిచారు. పార్కులో దీపాలు నవ్వుతున్నట్టే వెలుగుతున్నాయి.

అక్కడక్కడ కూర్చొని జనం కబుర్లు చెప్పుకుంటున్నారు.

## 2

చీకటిగా వున్న ఓ చోట కూర్చున్నారు ముగ్గురూ.

"ఇప్పుడు మాట్లాడండి" అన్నది అరుంధతి.

"నువ్వెప్పుడొచ్చావ్ ఇక్కడికి?" అడిగాడు దుష్యంతరావు.

"నాలుగు నెలలయింది."

"ఇక్కడెవరున్నారు నీకు?" రంగశాయి అడిగాడు.

"ఎవరేమిటి? నేను ఆయన."

"ఆయనా? ఆయనెవరు? నువ్వు పెళ్ళిచేసుకున్నావా?" ఆశ్చర్యంగా అడిగాడు రంగశాయి.

"అవును" అని తాళిబొట్టు తీసి చూపించింది. రంగశాయి మొహంలో నిరుత్సాహం కనబడింది దుష్యంతరావుకు.

"ఎప్పుడు?"

"మూడు నెల్ల క్రితం."

"ఆయ నేం చేస్తూవుంటాడు."

"బట్టల వ్యాపారం."

"నన్ను సిల్కు హౌస్‌లో చూడగానే పలకరించలేదేం?" అడిగాడు రంగశాయి.

"అదే మా బట్టల షాపు" నవ్వుతూ చెప్పింది అరుంధతి.

"సిల్కు హవుస్ మీదా?" దుష్యంతరావు అడిగాడు.

"అవును."

"లక్కీ ఫెలోవి అరుంధతీ. కంగ్రాచ్యులేషన్స్. లక్షాధికారినే పట్టేశావ్? ఇంతకీ ఆయన నిన్నెలా చేసుకున్నాడు?" అడిగాడు రంగశాయి.

"అదంతా ఒక కథలే."

"కాదు. చెప్పు" దుష్యంతరావు ఒత్తిడి చేశాడు.

"చాలా సింపుల్‌గా జరిగింది అంతా. ఆరు నెల్ల క్రితం నేను మద్రాసులో ఒక హోల్ సేల్ క్లాత్ మర్చంట్స్ దగ్గర వుద్యోగంలో చేరాను. అక్కడ నన్ను చూశాడు ఆయన. నేను నచ్చానట. తనని పెళ్ళి చేసుకోమని అడిగాడు. సంతోషంగా ఒప్పుకున్నాను. అంతే. ఫినిష్" అని చిన్నగా నవ్వింది.

"మా మీద నీకు కోపంగా వుంది కదూ" అన్నాడు దుష్యంతరావు.

"ఇప్పుడు లేదు."

"నువ్వు మా గురించి పోలీసులకు చెబుతావేమోనని భయపడ్డాం" అన్నాడు రంగశాయి.

"మీరింకా అక్కడే వున్నారనుకుని పోలీసులు అక్కడే వెతుకుతున్నారు. అయినా మిమ్మల్ని పోలీసులకు పట్టించదల్చుకోలేదు" అన్నది అరుంధతి.

"ఎందుకు? మమ్మల్ని పట్టిస్తే నువ్వు కూడా దొరికి పోతావనా?" అన్నాడు రంగశాయి.

"నాకు ఆ భయంలేదు. నేను నా అవసరంకొద్దీ మీకు సహాయపడ్డాను. నా గురించి చెడుగా మీకు తప్ప ఇంకెవరికీ తెలీదు. మీరు చెప్పినా నమ్మరు. కాని మీ గురించి పోలీసులకు బాగా తెలుసు. నాకు పోలీసుల గురించి యెలాంటి ఆందోళనా లేదు. మిమ్మల్ని నేను ఈ క్షణాన పోలీసులకు పట్టించగలను. కాని ఆ పని చెయ్యను" అన్నది గట్టిగా అరుంధతి దిక్కులు చూస్తూ.

"ఎందుకు? మా మీద ప్రేమా?" అన్నాడు రంగశాయి.

"కాదు. మీతో వున్న అవసరం."

"అవసరమా? ఏమిటి?" కుతూహలంగా ముందుకు వొంగాడు.

"చెబుతాను. ముందు కొన్ని విషయాలు చెప్పాలి. ఆయనకు భార్యలేదు. రెండో భార్య కూడా చచ్చిపోయింది. ఆయనకిప్పుడు అరవై యేళ్ళు దాటాయి. నన్ను చేసుకున్నాడు. ఆయనకు మొదటి భార్యకు ఒక కూతురు వుంది. ముప్పయేళ్ళుంటాయి. ఇంతవరకు పెళ్ళి చేసుకోలేదు. ఏదో చదువుతోంది ఇంకా. ఆయనకు లక్షల ఆస్తి వుంది. కొంత డబ్బు బ్యాంకులో వుంది. కొంత డబ్బు, నగలు ఇంట్లోనే సేఫ్‌లో వున్నాయి. మనం ఎలాగయినా రక్తపాతం లేకుండా ఆ ధనం కాజెయ్యాలి. అంతటి ఆస్తికి నేను వారసురాలైనా యెప్పుడో వచ్చే ఆస్తికోసం కాచుకునే ఓపిక నాకు లేదు. అందుకే నేను ఒక ప్లాను ఆలోచించాను. మీ ఇద్దరూ ఆ ఇంట్లో చేరాలి. తరువాత సమయం చూసి మన ప్లానును అమలు పరచాలి" అన్నది

అరుంధతి.

రంగశాయికి చెప్పలేనంత ఆనందం కలిగింది. గబుక్కున అరుంధతి చెయ్యి పట్టుకుని ముద్దు పెట్టుకున్నాడు.

"నీకు తొందరపాటు యెక్కువ శాయి" అన్నది అరుంధతి విసుగ్గా.

"ప్లాను పూర్తిగా ఆలోచించావా?" అడిగాడు దుష్యంతరావు.

"కొంతవరకు ఆలోచించాను. తర్వాత మిగిలింది ఆలోచించాలి. ముందు మీరద్దరూ ఆ ఇంట్లో చేరాలి" అన్నది.

"ఎలా?"

"దానికీ నేనో వుపాయం ఆలోచించాను."

"ఏమిటా వుపాయం?" దుష్యంతరావు అడిగాడు.

"ఆయనకు ఇప్పుడు ఒకే కారు వుంది. త్వరలోనే నాకు కూడా ఒక కారు కొంటానని అన్నాడాయన. ఇప్పుడున్న కారు డ్రయివర్ ముసలాడయినాడు. త్వరలోనే పని మానుకుంటాడు. అందుకని ఇద్దరిలో ఎవరయినా ఆయన దగ్గరకు వచ్చి డ్రైవర్ నని చెప్పి ఉద్యోగం కావాలని అడగండి. ఆయన తప్పకుండా యిస్తాడు. కొన్ని రోజుల తర్వాత నాకు కారు వస్తుంది. దానికి డ్రయివర్ గా మిగిలిన ఒక్కరూ చేరిపోవచ్చు. ఆ తర్వాత మిగిలిన ప్లానంతా" అన్నది అరుంధతి.

"గుడ్ ఐడియా" అన్నాడు దుష్యంతరావు సిగరెట్టు వెలిగిస్తూ.

"మీరు సిద్ధమేనా?"

"నువ్వు చెప్పినదానికి మేము కాదంటామా? నిన్ను చూస్తే నీ బుర్రలో ఇలాంటి ఆలోచనలు వున్నాయని

ఎవ్వరూ వూహించలేరు అరుంధతీ," అన్నాడు రంగ శాయి నవ్వుతూ__తనూ ఓ సిగరెట్టు వెలిగించి.

"అందుకే ఆయన భార్య నయ్యాను" అన్నది అరుంధతి నవ్వుతూ.

ఒక్కొక్కరే పార్కులోనించి వెళుతున్నారు.

"ఇక వెళదాం," అన్నది.

"అయితే రేపే మన ప్లాను అమలు పరుద్దాం" అన్నాడు దుష్యంతరావు.

"అవును" అన్నది.

"ముందు నేను చేరుతాను," అన్నాడు రంగశాయి.

"నువ్వు వొద్దు....నీకు కొంచెం తొందరెక్కువ.... నా కారు రాగానే నువ్వు తర్వాత చేరుదువుగాని."

ఒప్పుకున్నాడు రంగశాయి. తను అరుంధతికి కారు డ్రయివర్ అయితేనే బావుంటుంది.

"ఇక్కడ మీకో కండిషన్" అన్నది అరుంధతి.

"ఏమిటి?"

"మనకు ఇంతకుముందు పరిచయమున్నట్టుగా ఎప్పుడూ ఎక్కడా ప్రవర్తించకూడదు. ఎవ్వరికీ అనుమానం రాకూడదు...."

తలూపారు....

"ఇంకో విషయం. నా దగ్గర మీరు ఇదివరకటిలా ఎలాంటి పిచ్చి వేషాలూ వెయ్యకూడదు. మనం ఒక ప్రయోజనం కోసం పని చేస్తున్నాం. అది ఫలించాలి. ఈ విషయం గుర్తుంచుకోండి. ఎలాంటి పొరపాటు జరిగినా మన ప్లాను ఫెయిలవుతుంది. ముగ్గురం జైల్లో పనులు చేయాల్సి వస్తుంది".

"నాకు తెలుసు ఆ విషయం. నీ విషయంలో ఎలాంటి

వేషాలూ వెయ్యనని నేను హామీ ఇస్తున్నాను" అన్నాడు దుష్యంతరావు.

"మరి నువ్వు" అన్నది రంగశాయితో.

"నేనూ" అన్నాడు అయిష్టంగా.

"ఓ. కే. ఇదిగో మా ఇంటి అడ్రసు. రేపు ఉదయం ఎనిమిది గంటలకు రావాలి. అప్పుడాయన బయట కూర్చుని పేపరు చూస్తూ వుంటాడు" అని అడ్రసు వున్న కార్డు ఇచ్చింది దుష్యంతరావుకు.

దాన్ని షర్టు జేబులో పెట్టుకున్నా డతను. ముగ్గురూ నిలబడ్డారు.

అపటికే దాదాపు పార్కంతా ఖాళీ అయ్యింది.... దీపాలచుట్టూ పురుగులు తిరుగుతున్నాయి.

బయటకు వచ్చారు.

మెల్లగా నడుస్తూ టాంక్ బండ్ మీదకు వచ్చారు.

తర్వాత అరుంధతి ఓ టాక్సీ ఎక్కి వెళ్ళిపోయింది.

## 3

"నమస్తే సార్" అన్నాడు దుష్యంతరావు.

బయట పూలమొక్కలమధ్య కూర్చుని ఇంగ్లీషు డెయిలీ చదువుతున్న సేఠ్ ప్రేమ్‌చంద్ తలెత్తి-చూశాడు. ఎదురుగా నమస్కారం చేస్తున్న అతను కనిపించాడు.

"ఏమిటి?" అని అడిగాడు అతని దుస్తులనుబట్టి అతనెవరో గ్రహించి....

"డ్రయివర్ ఉద్యోగం కోసం వచ్చాను సార్" అన్నాడు.

"డ్రయివర్ ఉద్యోగం నా దగ్గర ఖాళీగా వుందని యెవరు చెప్పారు?" అడిగాడు ప్రేమ్‌చంద్.

"ఎవరూ చెప్పలేదు సార్. కారున్న ప్రతి ఇంట్లో

అడుగుతూ వస్తున్నాను సార్."

"ఇంతకుముందు ఎక్కడ చేశావ్?"

"కాచిగూడలో సేఠ్ అమర్‌లాల్ గారి దగ్గర పని చేశాను సార్."

"మరి అక్కడ ఎందుకు మానేశావ్?"

"నేను మానెయ్యలేదు సార్. వాళ్ళు ఈ వూరువదిలి మద్రాసు వెళ్ళిపోయారు" చెప్పాడు దుష్యంతరావు.

తృప్తిగా తల పంకించాడు ప్రేమ్‌చంద్. ఎందుకంటే సేఠ్ అమర్‌లాల్ హైద్రాబాద్ వదిలి మద్రాసు వెళ్ళిపోయినట్టు ఆయనకు తెలుసు.

ఇలాంటి ప్రశ్న సాధారణంగా ఎవరయినా అడుగుతారని దుష్యంతరావుకు తెలుసు. అందుకే ముందుగా తనకు కావలసిన ఇన్ఫర్మేషన్‌ని ఓ డ్రయివర్ ద్వారా సేకరించాడు.

"నా కారుకు డ్రయివర్ వున్నాడు. కాని ముసలివాడయిపోయాడు. అతను మానేస్తానన్నాడు. కాని నేనే కొన్నాళ్ళు వుండమన్నాను. నీ అంతట నువ్వే వచ్చి ఇడిగావ్. రేపట్నించే పనిలో చేరు. ఆ డ్రయివర్‌కి ఇచ్చినట్టుగానే నీకు నాలుగువందలు ఇస్తాను. నమ్మకంగా పని చేయాలి. ఏమంటావ్?" అన్నాడు ప్రేమ్‌చంద్.

"సరేసార్....మీ దయ" అన్నాడు దుష్యంతరావ్ వినయంగా.

అతని డ్రయివర్ వేషానికి తగ్గట్టుగానే అతనిమాటలు కూడా వున్నాయి.

"నీకెన్నేళ్ళు?" గబుక్కున అడిగాడు ప్రేమ్‌చంద్.

ఆశ్చర్యపోయాడు దుష్యంతరావు.

"నలభైయేళ్ళు సార్?" కావాలనే అర్థం చెప్పాడు.

"పిల్లలా?"

"అవును సార్. ముగ్గురు ఆడపిల్లలు. ఒక మగవాడు. ఇద్దరు ఆడపిల్లలు పెళ్ళిడుకొచ్చారు సార్" అన్నాడు చిన్నగా. తర్వాత "వాళ్ళంతా యిప్పుడు మద్రాసులో వున్నారు సార్" అన్నాడు.

తల వూపాడు ప్రేమ్‌చంద్.

తర్వాత—"ఎక్కడ వుంటున్నావ్?" అనడిగాడు.

"ఆట్టదిబ్బ దగ్గర సార్,"

"ఇక నువ్వెళ్ళు. రేపు వుదయం యిదే టైమ్‌కు వచ్చెయ్." అన్నాడు.

"నమస్తే సార్. వెళ్లొస్తాను" అని మరోసారి నమస్కారం చేసి వెళ్ళిపోయాడు దుష్యంతరావు బయటకు.

అతను వెళ్ళగానే నిలబడ్డాడు ప్రేమ్‌చంద్. చిన్నగా ఇంట్లోకి నడిచాడు.

ప్రేమ్‌చంద్‌కు అరవై యేళ్ళు దాటినా అలా కనిపించడు. కాని ఆయనలో వున్న శక్తి చాలా తక్కువ. తన శక్తినంతా వ్యాపారాన్ని వృద్ధి చేయటానికే వినియోగించాడు. ఆయన దురదృష్టం. ఆయనకు మగపిల్లలు లేరు. ఒక్కే ఒక్క ఆడపిల్ల కస్తూరి. కస్తూరికి పెళ్ళిచేస్తే యింట్లోనించి వెళ్ళిపోతుందని పెళ్ళి చెయ్యలేదు. ఇల్లరికం వచ్చేవాడి కోసం ఎదురుచూస్తున్నాడు.

ప్రేమ్‌చంద్‌కు ఆడతోడు కావాలి. అందుకే చూడగానే అరుంధతిని చేసుకోవటానికి నిర్ణయించుకున్నాడు. అరుంధతి మీద ఆయనకు యెంతో నమ్మకం. అందుక్కారణం అరుంధతి ఇప్పటివరకూ ఆయన ఆశక్తతను విసుక్కోలేదు. నిరసించలేదు. అదే కారణం.

ఆయన సరాసరి అరుంధతి వున్న గదిలోకి వెళ్ళాడు.

అరుంధతి బెడ్ మీద పడుకుని ఏదో మాగజైన్ చదువుతోంది.

ఆమె గుండెలమీద పమిట చెదిరిపోయింది. ప్రేమ్ చంద్ దృష్టి ఆమె గుండెలమీద పడింది.

అడుగుల చప్పుడు విని చూసింది అరుంధతి. ప్రేమ్ చంద్ కనిపించగానే "రండి" అంటూ లేచి కూర్చుంది.

"ఫర్వాలేదు. పడుకో" అని అరుంధతి పక్కనే కూర్చున్నాడు. అరుంధతి పడుకోలేదు. కూర్చునే వుంది.

"ఈ రాజు కొత్త డ్రయివర్ పనికోసం వచ్చాడు" అన్నాడు అరుంధతి భుజం మీద చెయ్యివేసి రాస్తూ.

"అలాగా" అన్నది ఎలాంటి ఆసక్తినీ చూపకుండా.

"ఇంతకు ముందు అమర్‌లాల్ దగ్గర పని చేశాడుట. ఆయన మకాంని మద్రాసు మార్చటం వల్ల పనిపోయింది. రేపట్నుంచి పనిలోకి రమ్మన్నాను" అన్నాడు. తలను ఆమె మెడదగ్గరకు తెచ్చి.

ప్రేమ్‌చంద్ వూపిరి అరుంధతికి వెచ్చగా తగులుతోంది. ఐనా ఉపయోగంలేదు. ప్రేమ్‌చంద్ పనికిరాని మనిషి. కోరికలను కొన్నాళ్ళవరకు జయించాలి.

"నాకు కస్తూరికీ టాక్సీల్లో తిరగటం న్యూసెన్స్‌గా వుంది" అన్నదామె.

"ఒక్క వారంరోజులు ఓపిక పట్టు అరుంధతీ. కారు వస్తుంది. నా స్నేహితుడే కొత్తకారును అమ్ముతానన్నాడు నిన్న కలుసుకున్నప్పుడు. వాడు ఇంకో కారును కొంటాడుట. బ్లూ కలర్ ఫియట్-బావుంటుంది మీకు."

సంతోషంతో ప్రేమ్‌చంద్‌ను కౌగలించుకొని ఆయన చెంపలమీద ముద్దుపెట్టుకుంది అరుంధతి.

ప్రేమ్‌చంద్ వుక్కిరిబిక్కిరయ్యాడు.

"మై హనీ" అని అరుంధతిని తన బాహువుల్లో బంధించాడు. అనీజీగా ఫీలయ్యింది అరుంధతి. అయినా మొహంలో అలాంటి భావాన్ని కనపరచలేదు.

గడియారం తొమ్మిదిగంటలు కొట్టింది.

"ఇక నేను తయారవుతాను" అని మరోసారి అరుంధతిని ముద్దు పెట్టుకుని ఆ గదిలోంచి బయటకు వెళ్ళాడు ప్రేమ్‌చంద్.

చిన్నగా నవ్వుకుంది అరుంధతి.

తనూ బెడ్ మీదనించి లేచి తన సూట్కేసు తెరిచి అందులో చీర మడతల మధ్య వున్న ఫోటో బయటకు తీసి "మనకు మంచిరోజులు రాబోతున్నాయ్ డియర్" అని ఆ ఫోటోని ముద్దు పెట్టుకుంది అరుంధతి.

## 4

కొత్త కారు దుష్యంతరావు నడుపుకుంటూ వచ్చాడు.

ఆ రోజు ఆదివారం. ప్రేమ్‌చంద్, దుష్యంతరావు టాక్సీలో వెళ్ళి వస్తూ కారును తీసుకొచ్చారు.

కారు వచ్చే టైముకు బయటే నిలబడివుంది అరుంధతి. బ్లూ ఫియట్ అరుంధతి ముందు ఆగింది. డ్రయివింగ్ సీట్లో నించి దుష్యంతరావు కిందికి దిగాడు.

అరుంధతిని చూసి "నమస్తే మేడమ్" అన్నాడు వినయంగా.

"చాలా బావుంది కారు" అన్నది అరుంధతి డోర్ తెరుస్తూ.

"నేను చెప్పాను కదా.... బావుంటుందని .... నీకు నచ్చింది కదా! అంతే చాలు...."అన్నాడు ప్రేమ్‌చంద్ ప్రేమగా ఆమె కేసి చూస్తూ.

"థ్యాంక్యూ" అన్నది అరుంధతి.

"అమ్మాయేదీ?" ప్రేమ్‌చంద్ అడిగాడు.

"నిద్రపోతోంది."

నౌకర్ని పంపించాడు ఆయన కస్తూరిని నిద్రలేపి కిందకు తీసుకురమ్మని.

దుష్యంతరావు - అరుంధతికేసి అదోలా చూశాడు. ఆమె అసలు అతనివైపు చూడడం లేదు.

'బాగా జాగ్రత్తపడుతోంది' అనుకున్నాడు దుష్యంతరావు.

కస్తూరి కిందకు వచ్చి కొత్త కారును చూడగానే సంతోషపడింది.

"భావుంది డాడీ కారు" అన్నది హుషారుగా.

"థ్యాంక్యూ.... థ్యాంక్యూ" అన్నాడు ప్రేమ్‌చంద్ నవ్వుతూ.

"సాయంత్రం నేను కొత్త కారులో షికారుకు వెళతాను" అన్నది అరుంధతి.

"నేను కూడా వెళ్ళాలి" అన్నది కస్తూరి.

"ఇద్దరూ కలిసి వెళ్ళండి" అన్నాడు ప్రేమ్‌చంద్.

అరుంధతి మాట్లాడలేదు. కస్తూరి రెండు నిమిషాల తర్వాత "నేను టాక్సీలో వెళతానులే" అన్నది.

"ఏమయినా యింకో డ్రయివర్ కావాలి మనకు" అన్నది అరుంధతి-దుష్యంతరావుకేసి చూసి.

"అవును.... అవును" అన్నాడు ప్రేమ్‌చంద్.

"ఇతనికే చెబుదాం ఇంకో డ్రయివర్‌ని తీసుకురమ్మని" ప్రేమ్‌చంద్‌తో అన్నది.

"నిజమే. డ్రైవర్ నీకు తెలిసి ఖాళీగా వున్న డ్రయివర్ యెవరయినా వున్నారా?" అడిగాడు ప్రేమ్‌చంద్ దుష్యంతరావుని.

"ఒకతను వుండాలి సార్. కావాలంటే కనుక్కుంటాను."

"కనుక్కుని అతను ఖాళీగా వుంటే రేపు నా దగ్గరకు తీసుకురా."

"అట్లాగే సార్."

"మంచివాడయి వుండాలి."

"నాకు బాగా స్నేహితుడు సార్. నమ్మకమయిన మనిషి."

"రేపు నీతో తీసుకురా."

తల వూపాడు దుష్యంతరావ్.

## 5

వెనుక సీట్లో కూర్చుంది అరుంధతి.

నెమ్మదిగా కారు నడుపుతున్నాడు దుష్యంతరావు.

సాయంత్రపు రోడ్లు రద్దీగా వున్నాయి.

"ఎక్కడయినా పార్కు దగ్గర ఆపేదా?"

"వద్దు. పోనిస్తూ వుండు. ఇప్పుడు నువ్వు డ్రయివర్ యూనిఫారంలో వున్నావ్. ఇద్దరం క్లోజ్ గా మాట్లాడుకోవటం చూస్తే బయట యెవరికయినా అనుమానం వస్తుంది. ఇలాగే మాట్లాడుకుందాం."

"ప్లాను ఆలోచించావా?"

"ఇంకా పూర్తిగా ఆలోచించలేదు."

"రేపు ఉదయం నాతో రంగశాయిని తీసుకొస్తాను."

"తీసుకురా. కాని అతను నీలాగే జాగ్రత్తగా బిహేవ్ చెయ్యాలని గట్టిగా చెప్పు. రంగశాయికి తొందరపాటు యెక్కువ. ఆయనకు ఏమాత్రం అనుమానం వచ్చినా మన ప్లాను సక్సెస్ కాదు."

"అలాగే."

"జీతం ఎంత యిస్తానన్నా అతన్ని ఒప్పుకోమని చెప్పు. బేరాలాడే వాళ్ళంటేనే ఆయనకు అసహ్యం. తెలిసిందా?" తలవూపాడు దుష్యంతరావ్.

"నువ్వుకూడా ఆయన వున్నప్పుడు నన్ను అదే పనిగా చూడకు. ఆయనకు అనుమానం వస్తుంది."

దుష్యంతరావు మాట్లాడలేదు.

ఫియట్ కారు టాంక్ బండ్‌ను దాటి లిబర్టీ వైపు మళ్ళింది.

"నువ్వు త్వరగా అసలు ప్లాను ఆలోచించాలి అరుంధతీ. నీవల్ల కాకపోతే చెప్పు. నేనే మంచి ప్లాను వేస్తాను" అన్నాడతను.

"వద్దు. ఈ ఇంట్లో పరిస్థితులు నీకు తెలియదు. నేనే త్వరలో ప్లాను ఆలోచించి చెబుతాను. నువ్వు అనవసరంగా తొందరపడకు. తొందరపడితే పనులు చెడిపోతాయి."

కారు చిక్కడపల్లి మెయిన్ రోడ్డుమీదకు వచ్చింది.

ఓ ఫాన్సీ స్టోర్ ముందుకు రాగానే "ఇక్కడ ఆపు" అన్నది.

కారు ఆగింది.

దిగి దాన్లోకి నడిచి హెయిర్ పిన్స్, ఓ పౌడర్ టిన్ తీసుకుని వచ్చి కారెక్కింది అరుంధతి.

ముందుకు కదిలింది బ్లూ కలర్ ఫియట్.

# 6

ప్రేమ్‌చంద్ దగ్గర పనిలో కుదిరాడు రంగశాయి.

అక్కడ చేరిన తరవాత అతని చూపు కస్తూరి మీద పడింది.

కస్తూరి అందమయినది. అంతకుమించి ఆమెలో బాగా

ఆకర్షణ వుండె.

ఆమెకు డ్రయివింగ్ రాదని రంగశాయికి తెలిసిన తర్వాత అతనికి బాగా హుషారు వచ్చింది.

కస్తూరి యూనివర్సిటీలో ఎదో డిప్లమా కోర్సు చదువు తోంది. రోజూ ఉదయం కొత్త కార్లో యూనివర్సిటీకి తీసుకు వెళ్ళటం రంగశాయి డ్యూటీ.

మొదటిరోజు అతను కస్తూరితో అంత యెక్కువగా మాట్లాడలేదు. ఆమెకూడా మాట్లాడలేదు.

కారు దిగి "రెండుగంటలకు ఇక్కడ వుండాలి" అన్నది చిన్నగా.

"అలాగే మేడమ్" అన్నాడతను.

చెప్పినట్టుగానే రెండుగంటలయ్యే సరికి బయటకు వచ్చింది.

అతను సిద్ధంగా వున్నాడు.

ఆమెను తీసుకొచ్చి ఇంటిదగ్గర దింపాడు.

రెండోరోజు ఇద్దరూ కొంచెం యెక్కువగానే మాట్లాడుకున్నారు.

మూడోరోజున ఆమె "నువ్వు యెంతవరకు చదువు కున్నావ్" అని అడిగింది.

"డిగ్రీవరకు మేడమ్" అన్నాడు రంగశాయి వినయంగా.

"గ్రాడ్యుయేటువా!" ఆశ్చర్యంగా అడిగింది కస్తూరి.

"అవును" అన్నాడతను నవ్వుతూ.

"డిగ్రీవరకు చదివి ఈ డ్రయివర్ ఉద్యోగం చేస్తు న్నావా?"

"మీకు తెలీనిదేముంది మేడమ్. ఈ రోజుల్లో పోస్టు గ్రాడ్యుయేట్లే హోటళ్ళల్లో పనిచేయటానికి సిద్ధమవు

తున్నారు.”

“నువ్వు ఇంకో మంచి ఉద్యోగం వస్తే ఈ డ్రయివర్ ఉద్యోగం మానేస్తావా?”

“మానెయ్యను మేడమ్.”

“ఏం ఎందుకని?” అతడి కళ్ళల్లోకి చూస్తూ అడిగింది.

“చెప్పను మేడమ్” నవ్వుతూ అన్నాడతను సిగ్గుపడుతున్నవాడిలా.

“సర్లే. తర్వాత చెబుదువుగాని” అన్నది కస్తూరి.

రంగశాయికి కారు డ్రయివింగ్ బాగా వచ్చు. మద్రాసులో చాలాసార్లు పోలీసులు జీపులో వెంటాడుతున్నప్పుడు అతడు కార్లో వాళ్ళకు దొరక్కుండా యెంతో నైపుణ్యంగా కారును నడిపాడు.

“మీకు డ్రైవింగ్ నేర్చుకోవాలని లేదా మేడమ్” కారు నడుపుతూ అడిగాడు రంగశాయి.

“ఎందుకలేదు?”

“మరి ఇంతవరకు నేర్చుకోలేదు?”

“ఇంతకుముందు మాకు ఓ ముసలి డ్రైవర్ ఉన్నాడు. వాడిదగ్గర డ్రైవింగ్ నేర్చుకోవాలంటే నాకు రోతగా అనిపించేది.”

“డ్రైవింగ్ స్కూల్సు ఉన్నాయి కదా?”

“డబ్బులిచ్చి నేర్చుకోవాలనిపించలేదు.”

నవ్వేడు రంగశాయి.

“పోనీ.....నువ్వు నేర్పుతావా?” సీటు మీదగా ముందుకు వొంగి అడిగింది కస్తూరి.

“సంతోషంగా.”

“థాంక్యూ. యెప్పుడు నేర్పుతావు?”

"రేపు మీరు మీ క్లాసు ఎగెయ్యండి. ఇంజనీరింగ్ కాలేజీ దగ్గర ఖాళీ స్థలముంది. అక్కడే నేర్పుతాను."

"ఓ. కే." అన్నది కస్తూరి సంతోషంగా.

# 7

ఫియట్ కారు పక్కనే నిలబడి సిగరెట్లు కాల్చుకుంటున్నారు రంగశాయి-దుష్యంతరావు.

ప్రేమ్‌చంద్ యెక్కడికో వెళ్ళాలన్నాడు. అందుకే దుష్యంతరావు ప్రేమ్‌చంద్ రాకకోసం ఎదురు చూస్తున్నాడు.

రంగసాయి అప్పుడే కస్తూరికి డ్రైవింగ్ నేర్పి వచ్చాడు. రంగశాయి తను కస్తూరికి ఎలా డ్రైవింగ్ నేర్పుతున్నదీ, నేర్పుతూ ఆమె అవయవాలను ఎలా తాకుతున్నదీ నవ్వుతూ చిన్నగా చెబుతున్నాడు.

"అయితే నీకు ఇప్పుడు అరుంధతి మీద వ్యామోహం లేదా?" అడిగాడు దుష్యంతరావు.

"లేదు. కస్తూరి హుషారైనది. నాకు అది తప్పకుండా దొరుకుతుంది. కాకపోతే ఇంకో వారం రోజులు టైము తీసుకుంటుంది."

"అదృష్టవంతుడివి."

"థాంక్స్" అన్నాడు రంగశాయి.

ఇంతలోనే వాళ్ళముందు చిన్న కాగితం వుండ వచ్చి పడింది.

దాన్ని చేతికి తీసుకున్నాడు దుష్యంతరావు. విప్పి చూశాడు. అందులో ఇలా వుంది.

'అవుట్ హౌస్‌లో మీరు ఉంటామని ఆయనను అడగండి.'

అరుంధతి ప్లాను కొంతవరకు దుష్యంతరావుకు అర్థ

మయింది.

దాన్ని చదివి రంగశాయి నవ్వుకున్నాడు. మంచి ఆలోచన అనుకున్నాడు. రాత్రిళ్ళు కస్తూరిని కలవొచ్చు. ప్రేమ్‌చంద్ కిందికి వచ్చాడు. అప్పటికే దుష్యంతరావు ఆ కాయితాన్ని ముక్కలు చేశాడు.

ఇద్దరూ తగిన కారణాలు చెప్పి అవుట్ హౌస్‌లో వుంటామని అడిగారు ప్రేమ్‌చంద్‌ని.

ముందు ఆయన వొప్పుకోలేదు. తర్వాత "రేపు చెబుతాను ఏ విషయం" అన్నాడు.

# 8

రాత్రి.

ఒంటిగంట దాటింది.

గదిలో దీపం సన్నగా వెలుతోంది.

నిద్ర పోతోంది అరుంధతి. ఆమె పక్కనే పడుకున్నాడు ప్రేమ్‌చంద్.

అతనికి మెలకువచ్చింది. కళ్ళు తెరిచాడు.

'ఎందుకు మెలకువ వచ్చింది' అనుకున్నాడు. ఏదో చప్పుడయింది. ఎవరో దూకిన చప్పుడు. ఎవరు? ఎవరు ఎక్కడ దూకారు?

మెల్లగా లేచాడు. అరుంధతి కేసి చూశాడు. ప్రశాంతంగా నిద్రపోతోంది.

స్విచ్ నొక్కాడు. లైటు వెలిగింది. వెలుతురు గదినంతటా పరుచుకుంది.

తలుపులు తెరిచి బయటకు వచ్చాడు.

పక్క గదిలో ఐరన్ సేఫ్ ఉంది. చప్పుడు చెయ్యకుండా తలుపు దగ్గరకు వచ్చాడు. కీ హోల్ లోనించి లోపలకు చూశాడు. లావుగా ఉన్న ఒకడు ఐరన్ సేఫ్

తెరవడానికి ప్రయత్నిస్తున్నారు.

ప్రేమ్‌చంద్‌కు చెమటలు పట్టాయి.

"దొంగ.... దొంగ" పెద్దగా అరిచాడు.

ఎవరో లేచి పరిగెత్తుకుంటూ వస్తున్నారు. అలా అరుస్తూనే ఉన్నాడు ప్రేమ్‌చంద్.

ఎవరో అతని నెత్తిమీద దేనితోనో కొట్టి ముందుకు పరుగు తీశారు.

బోర్లా పడిపోయాడు ప్రేమ్‌చంద్.

అతనికి స్పృహ పోయింది.

* * *

ప్రేమ్‌చంద్‌కు తలమీద గట్టి దెబ్బ తగిలింది. దొంగ దొరకలేదు. తప్పించుకుపోయాడు. ప్రేమ్‌చంద్ చూసి అరవకుండా ఉంటే ఐరన్ సేఫ్‌లో ఉన్నదంతా దోచుకుని పోయేవాడే.

ఆ రోజు ప్రేమ్‌చంద్ షాపుకు వెళ్ళలేదు. అరుంధతి భర్తకు బాగా సేవ చేసింది. ప్రేమ వొలకబోసింది.

రాత్రి వచ్చిన దొంగ యెవరో ఆమెకు అర్థం కాలేదు. ఎవరై వుంటారు? రంగశాయా? దుష్యంతరావా? వీళ్ళిద్దరిలో యెవరై వుంటారు? అసలు వీళ్ళిద్దరూ కాదేమో! ఇంకెవరో అయి ఉండాలి.

ఉదయమే డ్రైవరిద్దరూ వచ్చారు. రాత్రి దొంగతనం వార్త వినగానే, ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు.

ఎవడో తమకంటే ముందుగానే దోచుకుపోవడానికి వచ్చాడు.

భయంకొద్దీ డ్రైవర్లను అవుట్ హౌస్‌లోనే ఉంచటానికి ఒప్పుకున్నాడు ప్రేమ్‌చంద్.

"వీళ్ళెందుకు అవుట్ హౌస్‌లో" అన్నది అరుంధతి తనకు ఇష్టంలేనట్టు.

"నీకు తెలియదు అరూ.... వాళ్ళే ఉండాలి. మనకు తోడుగా ఉంటారు. మంచివాళ్ళు."

మనసులోనే నవ్వుంది అరుంధతి. ఫర్వాలేదు. ప్రేమ్‌చంద్‌కు నమ్మకం కలిగింది వాళ్ళమీద. మెల్లగా తన ప్లానును అమలు పరచాలి.

# 9

ప్రేమ్‌చంద్ మేడమీద గదిలో పడుకుని నిద్రపోతున్నాడు.

కస్తూరి ఫియట్‌లో క్లాసుకు వెళ్ళింది.

కార్లో కూర్చుని సిగరెట్టు కాలుస్తున్నాడు దుష్యంత రావు.

పైనుండి కిందకు చూసింది అరుంధతి. అతను కనిపించాడు.

మెల్లగా కిందికి వచ్చింది. ఇంట్లో ఎవ్వరూ లేదు. వంట మనిషి వెళ్ళిపోయింది.

అరుంధతిని చూశాడు దుష్యంతరావు. తనతో రమ్మన్నట్టు సైగ చేసింది. అతను ఆశ్చర్యపోయాడు. అవుట్ హౌస్‌లోకి వెళ్ళింది ఆమె. తర్వాత ఎవరూ చూడకుండా గబుక్కున తనుకూడా లోపలకు వెళ్ళాడు దుష్యంతరావు.

బూజుతో నిండివుంది ఆ ఇల్లు. తలుపు పక్కగా నిలబడిందామె.

"ఏమిటి?" అన్నాడతను చిన్నగా.

"తెలీనట్టు అడుగుతావేం?" అన్నది కోపంగా.

"ఏమిటి నువ్వనేది."

"రాత్రి వచ్చిందెవరు? నువ్వా రంగశాయా? "

"సరిగ్గా మాట్లాడు."

"సరిగ్గా నే మాట్లాడుతున్నా."

"మా ఇద్దర్లోలో ఎవ్వరం రాలేదు."

"మరెవరు వచ్చింది? ఇంకోమనిషిని పంపించారా?"

"అరుంధతీ. నువ్వు అనుమానిస్తున్నావ్ .... మేము ఇంకో మనిషిని ఎందుకు పంపిస్తాం? ఇంకోడిని కలుపుకుంటే వాడికి వాటా ఇవ్వద్దూ."

"అయితే రాత్రి వచ్చిన దొంగ ఎవరు?"

"మామూలు దొంగ ఎవడయినా అయివుండొచ్చు."

"మీరు రాత్రికల్లా ఈ ఇంట్లోకి వచ్చేస్తారా?"

"ఆఁ...."

"జాగ్రత్తగా ఉండండి. ఆ దొంగ మళ్ళీ రావొచ్చు. వారం రోజుల్లోగా నా ప్లాను చెబుతాను" అంది.

"అందుకోసమే యెదురు చూస్తున్నాం" అన్నాడు దుష్యంతరావు చిన్నగా.

"ఈ విషయం రంగశాయికి చెప్పు. ఏమయినా ఓ వారం రోజులపాటు అనుమానం రాకుండా మెలగండి" అని "ముందు నేను బయటకు వెళతాను. నువ్వు అయిదు నిముషాలాగి వచ్చెయ్" అని బయటకు నడిచింది అరుంధతి.

ఇంటికప్పును పట్టిన బూజును చూస్తూ నిలబడ్డాడు దుష్యంతరావు.

# 10

"ఇప్పుడు నువ్వు అందంగా ఉన్నావ్. వెధవ డ్రైవర్ యూనిఫామ్. ఇంకెప్పుడూ వేసుకోకు" అన్నది కస్తూరి.

"యస్ డియర్" అన్నాడు రంగశాయి నవ్వుతూ.

ఇద్దరూ యూనివర్శిటీ ఏరియాలో ఉన్న నేరేడు చెట్టు

కింద నిలబడ్డారు కారుపక్కనే.

సిగరెట్టు వెలిగించాడు రంగశాయి. పొగను బయటకు వదిలి కస్తూరివైపు నవ్వుతూ చూశాడు.

"నువ్వు అందమైన దానివి" అన్నాడు.

"థాంక్స్" అన్నదామె సిగ్గుపడుతూ.

"నీ ప్రేమ నాకు లభించటం నా అదృష్టం" అన్నాడతను.

"ఐ లైక్ యూ"

"మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు రంగశాయి సైడ్ మిర్రర్‌లో తన రూపాన్ని చూసుకుంటూ.

"మా నాన్న ఒప్పుకోడు."

"అయితే మనం యిలా ఉండిపోవలసిందేనా జీవితాంతం."

"అలా అనకు. ఆ ఆలోచనను నేను భరించలేను."

"మరేం చేద్దాం?"

"ఎలాగయినా పెళ్ళిచేసుకుందాం."

"ఎలాగయినా అంటే?"

"నువ్వే చెప్పు."

"ఇక్కడినించి వెళ్ళిపోయి పెళ్ళిచేసుకుందాం."

"నాన్న బాధపడతాడు."

"నువ్వు తండ్రిచాటు పిల్లవి. నేనవసరంలేదు" కోపంగా అన్నాడు.

"సారీ శాయి. నీకు కోపం తెప్పించాలని కాదు. నాన్న నన్ను అపురూపంగా పెంచాడు. మా స్టేటస్‌కు తగినవాడిని తెచ్చి పెళ్ళిచేయాలని చూస్తున్నాడు."

"అయితే వాడినే పెళ్ళిచేసుకో" సిగరెట్టును విసిరేస్తూ అన్నాడు.

"ప్లీజ్. నా పరిస్థితి ఆలోచించు. నాన్నంటే నాకు ప్రేమ. ఆయన్ని వదులుకోను. అలాగని నిన్నూ వదులుకో లేను. నన్ను ఈ రోజు ఆలోచించుకోనివ్వు. రేపు ఏ విషయం చెబుతాను."

"నీ యిష్టం. నిజంగా నువ్వు నన్ను ప్రేమిస్తే నీ నిర్ణయం నాకు అనుకూలంగా ఉంటుంది."

మాట్లాడలేదు కస్తూరి.

## 11

ప్రేమ్‌చంద్ దొంగ కొట్టిన దెబ్బనించి తేరుకున్నాడు. అతనికి బాగా నయమయింది. షాపుకు రోజూ వెళ్ళి వస్తున్నాడు.

రంగశాయి—దుష్యంతరావు ఔట్ హౌస్‌లోకి తమ మకాం మార్చారు.

అరుంధతి అవకాశం కోసం ఎదురుచూస్తోంది. ఆ అవకాశం ఆమెకు మరో మూడురోజుల్లో వస్తున్నట్టు ఆ రోజునే తెలిసింది.

"అరూ....మూడురోజుల తర్వాత నేను బొంబే వెళుతున్నాను" అన్నాడు ప్రేమ్‌చంద్ ఆమెతో ఆ రోజు ఉదయం భోజనం చేస్తున్నప్పుడు.

"మళ్ళీ యెప్పుడు వస్తారు?" అన్నది అరుంధతి.

"రెండురోజులు అక్కడ ఉంటాను."

"మీరే వెళ్ళాలా?"

"అవును. ఈసారి నేనే సరకు చూసి తీసుకొద్దామనుకున్నాను."

"మీరు లేకుండా రెండురోజులు నేను ఉండగలనా?"

"నాకు తెలుసు."

"పోనీ. నేను కూడా వచ్చేదా బొంబే."

"నువ్వా! వద్దు. ఇంకోసారి తీసుకెళతాను. నువ్వు వస్తే ఇంట్లో అమ్మాయి ఒంటరిగా ఉండాలి. దాని పెళ్ళయిన తర్వాత మనం ఇష్టమొచ్చినట్టు తిరగొచ్చు."

మాట్లాడలేదు అరుంధతి.

భోజనం చేసి పాపుకు వెళ్ళిపోయాడు ప్రేమ్‌చంద్.

ఆయనటు వెళ్ళగానే ఫోన్ దగ్గరకు నడిచింది అరుంధతి. డయల్ చేసింది ఎక్స్ఛేంజ్ కు.

కనెక్షన్ వచ్చిన తర్వాత మద్రాసుకు ట్రంక్ కాల్ బుక్ చెయ్యమన్నది ఓ నెంబర్ చెప్పి.

కస్తూరి ఇంట్లో లేదు. వంటమనిషి వంటగదిలో ఉంది. అయినా ఆమెకు చెముడు. మరీ పెద్దగా మాట్లాడినా అంత బాగా వినిపించదు.

పావుగంట తర్వాత కనక్షన్ వచ్చింది.

"మాట్లాడండి" అన్నది ఆపరేటర్.

"హలో" అన్నది అరుంధతి.

"హలో" అవతలి వైపునించి వినిపించింది.

"ఎవరు. నరేష్ నా?"

"అవును. నువ్వు అరుంధతివి."

"యస్. అరుంధతిని."

"ఏమిటి విశేషం."

"ఎదురు చూసిన ముహూర్తం."

"వచ్చిందా?"

"ఆ చెబుతాను విను. పన్నెండో తారీకు సాయంత్రం ఆయన బొంబే వెళుతున్నాడు. ఆ రోజు రాత్రికే అన్ని ఏర్పాట్లూ సిద్ధంగా ఉంటాయి. నువ్వు ఆ రోజుకు వచ్చెయ్. రాత్రి పదకొండు గంటలకు తోటలో కాచుకో. కావలసింది దొరకగానే వెళ్ళిపో. తర్వాత నేను వస్తాను.

సరేనా."

"ఓ.కె డియర్. నువ్వు చెప్పినట్టుగానే ఉంటాను" అన్నాడతను అవతలి నించి.

రిసీవర్ను పెట్టేసి హాయిగా గాలి పీల్చుకుంది అరుంధతి. ఆమె మనసు తేలికపడింది. ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న అవకాశం. ఇంతకుమించిన అవకాశం ఇక రాదు. ఉన్న డబ్బంతా దోచుకోవచ్చు. హాయిగా నరేష్తో ఎటయినా వెళ్ళిపోయి బతకొచ్చు. పిచ్చివెధవలు. రంగశాయి—దుష్యంతరావ్. వాళ్ళకేదో వస్తుందని సంతోష పడుతున్నారు. తన ప్లాన్ వాళ్ళకు తెలీదు.

నవ్వుకుంది అరుంధతి. వెళ్ళి తన గదిలో సూట్కేసు అడుగున ఉన్న ఓ ఫోటోను బయటకు తీసింది. ఓ నిముషం చూసి ముద్దుపెట్టుకుంది.

## 12

"ఏం నిర్ణయించుకున్నావ్?" అడిగాడు రంగశాయి. పబ్లిక్ గార్డెన్లో చెట్లచాటున కూర్చున్నారు ఇద్దరూ. కస్తూరి వెంటనే మాట్లాడలేదు. ఆమె కళ్ళు కొంచెం ఎర్రగా ఉన్నాయి.

"మాట్లాడవేం" అన్నాడు సిగరెట్టు వెలిగించి.

"నీతో రావడానికే సిద్ధపడ్డాను."

"గుడ్."

కస్తూరి అతని కళ్ళలోకి చూసింది.

"నువ్వు తెలివైన దానివి. ఇప్పుడు నమ్ముతున్నాను— నువ్వు నన్ను ప్రేమిస్తున్నావని" ఆమె చెయ్యిపట్టుకున్నాడు రంగశాయి. చిన్నగా నొక్కాడు.

కస్తూరి చిన్నగా వణికింది. ఆమె మనస్ఫూర్తిగా అతడిని ప్రేమించింది, అతన్ని నమ్మింది. కాని అతను మోస

గాడని ఆమెకు ఎక్కడా అనిపించలేదు.

"ఎప్పుడు వెళ్ళిపోద్దాం" అన్నదామె మెల్లగా.

"నీ ఇష్టం."

"నువ్వే చెప్పు."

"కాదు నువ్వెప్పుడంటే అప్పుడే."

"పన్నెండో తారీకు రాత్రి వెళ్ళిపోతాం."

"ఏం.... ఆరోజు యేమయినా విశేషముందా?"

"అవును. ఆరోజు సాయంత్రం నాన్న బొంబే వెళు తున్నాడు."

"అయితే ఆ రోజునే వెళ్ళిపోదాం."

"ఎక్కడికి?"

"మద్రాసు."

"ఆ వూరు నీకు బాగా తెలుసా?"

"అవును... నేను అక్కడే చదువుకున్నాను కొన్నాళ్లు. ఇంతకూ అక్కడకు వెళ్ళి తర్వాత మనం ఎట్లా బతుకు తాము?"

"నువ్వు ఏదయినా ఉద్యోగం చూసుకో."

"డ్రయివర్ ఉద్యోగమే చూసుకోవాలి."

కస్తూరి మాట్లాడలేదు.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్? డ్రయివర్ ఉద్యోగం చెయ్యడం నీకు ఇష్టం లేదా?"

"ఇష్టం లేకపోయినా చెయ్యక తప్పదు గదా! నేను కూడా యేదో ఒక ఉద్యోగం చేస్తాను."

"నువ్వా!"

"అవును....ఏం తప్పా."

"వద్దు. నువ్వు ఉద్యోగం చెయ్యటం నాకు ఇష్టంలేదు."

"చెయ్యక తప్పదు."

"నిన్నొక విషయం అడుగుతాను. యేమీ అనుకోవు గదా."

"ఏమిటి?"

"మీ నాన్నకు నువ్వొక్కదానివే కదూ?"

"అవును."

"అలాంటప్పుడు నువ్వు నాతో వచ్చి యేమీ లేని దానిలా యెందుకు బతకాలి?"

"అయితే యేం చెయ్యమంటావ్?"

"నువ్వు ఇంట్లోవున్న డబ్బు తీసుకురా. మద్రాసులో నేను ఏదయినా వ్యాపారం చేస్తాను."

ఉలిక్కిపడింది కస్తూరి.

"ఏమిటలా చూస్తావ్. మీ నాన్న ఆస్తికి నువ్వు వారసురాలివి. నీ ఆస్తిని నీతో తెచ్చుకోవటంలో తప్పు లేదు....మనం ఆ డబ్బుతో వెళ్ళిపోదాం. మిగిలింది మీ నాన్నకు ఉంటుంది. మనం వృద్ధిలోకి వచ్చిన తర్వాత మీ నాన్న డబ్బు ఆయనకు ఇచ్చేద్దాం."

"ఈ ఆలోచన నాకు నచ్చలేదు శాయి," అన్నది కస్తూరి.

"నచ్చకపోతే మనం కష్టాలలో పడాలి డియర్. కష్టాలు నాకు అలవాటే ననుకో. నీవు దరిద్రం అనుభవించటం దేనికి?"

"నాకు భయంగా ఉంది."

"భయం దేనికి? నీ సొమ్మును నీవెంట తెచ్చుకుంటున్నావ్. నువ్వు సరేనంటే నేను నీకు సహాయపడతాను. మనం సుఖంగా బతుకుతాము." అన్నాడతను ఆమె కళ్ళల్లోకి చూస్తూ.

ఆ చూపునించి తప్పించుకోలేక పోయింది కస్తూరి.

"నిన్నే ప్రేమించాను. నమ్ముతున్నాను. నీ యిష్టం వచ్చినట్టే చెయ్యి" అన్నది కళ్ళు దించుకుని.

# 13

గోడనున్న గడియారం పన్నెండు గంటలు కొట్టింది. అప్పటివరకు నిద్రపోతున్నట్టు నటిస్తున్న అరుంధతి చిన్నగా కళ్ళు తెరిచింది.

గదినిండా మసక వెలుతురు పరుచుకుని వుంది. వస్తువులన్నీ అస్పష్టంగా కనిపిస్తున్నాయి.

ప్రేమ్‌చంద్ బోర్లా పడుకుని నిద్రపోతున్నాడు.

బెడ్ మీదనించి దిగింది ఆమె.

నిద్రపోతున్న అతనివేపు ఓసారి చూసి తలుపుల దగ్గరకు వెళ్ళి చప్పుడు కాకుండా తలుపు తెరిచింది. బయటకు వచ్చింది. కస్తూరి గది తలుపులు మూసి వున్నాయి. కిటికీ సందుల్లోంచి దీపం వెలుతురు బయటకు వస్తోంది.

మెట్లు దిగి కిందకు వచ్చింది.

ఒకసారి అటూ ఇటూ చూసి అవుటు హౌస్ వైపు నడిచింది.

ఆమెను ఓ ఆకారం అనుసరిస్తున్నట్టు ఆమెకు కొంచెం కూడా అనుమానం రాలేదు.

తోటలో చీకటిగా ఉంది. చెట్లు కదులుతున్నాయి. ఇంటిముందున్న వీధి దీపం వెలగడంలేదు.

తలుపులమీద చప్పుడు చేసింది అరుంధతి.

రెండు నిమిషాల తర్వాత తెరుచుకున్నాయి. గబుక్కున లోపలకు నడిచి తలుపులను మూసింది.

"నిద్ర పోలేదా?" ఎదురుగా నిలబడిన ఇద్దర్నీ చూస్తూ అడిగింది.

"నీకోసమే ఎదురు చూస్తున్నాం. రాత్రి కూడా

యెదురుచూశాము."

"మనకు అవకాశం వస్తోంది."

"ఎప్పుడు?" ఆత్రంగా అడిగాడు దుష్యంతరావు.

ఎప్పుడో రంగశాయికి తెలుసు. అయినా బయట పడ లేదు. తమ విషయం దుష్యంతరావుకు కూడా చెప్పలేదు అతను.

"పన్నెండో తారీఖు రాత్రి."

"ఆ రోజు ప్రేమ్‌చంద్ వూళ్ళో ఉండడా."

"అవును. ఆయన బొంబే వెళుతున్నాడు సాయంత్రం. ఆ రోజు రాత్రికి మీరు పరికరాలు సిద్ధం చేసుకోండి. పన్నెండు గంటలకు ఐరన్ సేఫ్ తెరవండి. దొరికినదాంట్లో ముగ్గురం పంచుకుందాం. నా వాటా నేను దాచిపెట్టు కుంటాను. మీరు వెళ్ళిపోండి. తర్వాత నేను ఎప్పుడో ఇక్కడనించి బయట పడతాను. సరేనా." తల వూపారు ఇద్దరూ.

"వెళతాను. గుడ్ నైట్" అని తలుపులు తెరుచుకుని బయటకు వచ్చింది.

అప్పటివరకు ఆమె మాటలను విన్న ఆ ఆకారం ఆమె బయటకు వస్తుందని గ్రహించి గబ గబా అక్కడినించి చెట్ల చాటుగా లోపలకు వెళ్ళిపోయింది.

చప్పుడు చెయ్యకుండా మెట్లెక్కి తన గదిలోకి చేరింది అరుంధతి.

బోర్లా పడుకుని నిద్రపోతున్నాడు ప్రేమ్‌చంద్ .... వెళ్ళి అతని పక్కనే పడుకుంది ఆమె.

## 14

సూర్యోదయం కాలేదు. ఆరు గంటలకే నిద్రలేవటం అరుంధతికి అలవాటు. ఎప్పుడయినా ఒంట్లో బావుండక

బద్ధకంగా ఉంటే యెండెక్కిన దాకా పడుకుంటుంది.

ఆరూ ఇరవై అయింది. అప్పుడే వీధుల్లో సందడి మొదలవుతోంది.

అవుటు హవుస్‌లో మిత్రులిద్దరూ ఇంకా నిద్ర పోతూనే ఉన్నారు.

తోటలో తిరుగుతోంది అరుంధతి.

పేపర్ వాడు దినపత్రికను లోపల పడేసి వెళ్ళి పోయాడు అప్పుడే.

దాన్నందుకుంది అరుంధతి. వార్తలను చదువుతోంది.

పేజీ తిప్పింది.

ఉలిక్కిపడింది. నిజంగా షాక్.

గబ గబా అవుట్ హవుస్ దగ్గరకు పరుగు తీసింది. తలుపులమీద చప్పుడు చేసింది.

తలుపులు తెరిచాడు దుష్యంతరావు.

"ముందు ఇక్కడినించీ పారిపొండి" అన్నది గాభరాగా.

"ఏమయ్యింది," అడిగాడతను కంగారుగా.

"ఇదిగో" అని పేపరు చూపించింది.

అందులో దుష్యంతరావు రంగశాయి ఫోటోలు వేశారు. కింద వాళ్ళను పట్టుకున్నవాళ్ళకు అయిదువేలు బహుమతి అని రాశారు. ఇద్దరికి ఉన్న చరిత్ర కింద రాశారు.

దాన్నలా వదిలేసి గబుక్కున వెళ్ళి రంగశాయిని లేవగొట్టాడు దుష్యంతరావు. లేవగానే పేపరు చూపించాడు.

"ఇప్పుడెలా?" అన్నాడతను.

"కారులో ఎక్కడికయినా దూరంగా పారిపొండి. పన్నెండో తారీఖు రాత్రి పన్నెండు గంటలకు రండి."

అన్నదామె.

నిముషంలో ఇద్దరూ బయటకు వచ్చి గ్యారేజ్ లో ఉన్న ఫియట్ కారును బయటకు తీశారు. రంగశాయి డ్రయివింగ్ సీట్లో కూర్చున్నాడు. వెనుకసీట్లో కూర్చు న్నాడు దుష్యంతరావు.

కారు బయటకు వెళ్ళింది.

పేపరు మడిచి తోటలో మొక్కల చాటున పడేసి గబ గబా పైకి వెళ్ళింది అరుంధతి.

కస్తూరిగానీ, ప్రేమ్‌చంద్ గానీ లేవలేదు. తను వెళ్ళి అతని పక్కనే పడుకుంది.

కళ్ళు మూసుకుని నిద్రపోతున్నట్టు పడుకుంది.... ఆమెలో ఆలోచనలు పరుగులు దీస్తున్నాయి.

ఒకరకంగా వీళ్ళిద్దరి ఫోటోలు పేపర్లో వెయ్యటం మంచిదే అయింది. తనమీద ఎవరికీ అనుమానం రాదు దొంగతనం జరిగిన తర్వాత.

ప్రేమ్‌చంద్ యేడు గంటలకు లేచాడు.

"టైమెంతయింది" అన్నది అరుంధతి కిటికీలోనించి బయటకు చూసి.

"ఏడుగంటలు" అన్నాడు ప్రేమ్‌చంద్.

గదిలోనించి బయటకు వచ్చాడు అతను. అప్పుడే మెట్లెక్కి వస్తున్న నౌకరు చేతిలో పేపరు వుంది. పేప ర్ను ప్రేమ్‌చంద్ కు ఇచ్చాడు.

ముందు పేజీ చూసి పక్కనున్న పేజీ తిప్పాడు. ఆ పేజీలో ఉన్న రెండు ఫోటోలను చూడగానే షాక్ కొట్టినవాడిలా అయ్యాడు. కింద రాసివున్న మేటర్ ని చదివాడు.

రంగశాయి-దుష్యంతరావు పేరుమోసిన తోడుదొంగ

లనీ మద్రాసులో బ్యాంకు దొంగతనంచేసి పారిపోయారనీ, వాళ్ళు ప్రస్తుతం హైద్రాబాద్‌లో ఉంటున్నట్టు పోలీసులు భావిస్తున్నారనీ-వాళ్ళను పట్టిన వాళ్ళకు అయిదు వేలు బహుమానం ఇస్తామనే పోలీసు ప్రకటన ఉంది. గబగబా కూతుర్నీ భార్యనీ కేకేశాడు ప్రేమ్‌చంద్.

"ఏమిటి?" ఇద్దరూ వచ్చారు.

పేపరు చూపించాడు వాళ్ళకు.

కస్తూరికి కళ్ళు తిరిగాయి. వెనక్కు పడబోయి ఎలాగో నిలదొక్కుకుంది.

"మన డ్రైవరిద్దరూ తోడుదొంగలా," భయంగా అన్నది అరుంధతి.

నౌకర్ని పిలిచి అవుట్ హవుస్‌లో వాళ్ళిద్దరూ లేచారో లేవలేదో చూసిరమ్మని పంపించాడు ప్రేమ్‌చంద్.

"మన మెవ్వరం గ్రహించలేదు వీళ్ళు దొంగలని. వేధవలు పెద్దప్లానుతోటే మనదగ్గర చేరారు. మొన్నటి దొంగ వీళ్ళిద్దర్లో ఒకడయివుంటాడు" అన్నాడతను.

కస్తూరి అక్కడ నిలబడలేక తన గదిలోకి వెళ్ళి పోయింది. ఆమెకు ఏడుపు వస్తోంది. ఒక దొంగ తను మొదటిసారిగా ప్రేమించింది. ఇంకా నయం. ఎప్పుడో అతనితో డబ్బు నగలు కాజేసి ఇంట్లోనించి పారిపోలేదు. తన అదృష్టం.

నౌకరు వచ్చి "వాళ్ళిద్దరూ ఆ ఇంట్లోలేరు. గ్యారేజ్‌లో ఫియట్ కారు కూడా లేదు" అని చెప్పాడు.

"అయితే పారిపోయారు" అన్నాడు ప్రేమ్‌చంద్.

"వాళ్ళకెలా తెలుసు పేపర్లో వాళ్ళగురించి ఇలా ప్రకటించినట్టు" అన్నది అరుంధతి.

"పొద్దున్నే చూసివుంటారు పేపర్లో. చూడగానే

పేపర్ని అక్కడే పడేసి కార్లో వెళ్ళిపోయి ఉంటారు. కారు తీసుకువెళ్ళారు. దాన్నేం చేస్తారో వెధవలు. ముందు పోలీసు రిపోర్టు ఇవ్వాలి" అన్నాడు ప్రేమ్‌చంద్.

"అవును ఫోన్ చేస్తాను" అని ఫోన్ దగ్గరకు నడవ బోయింది అరుంధతి.

"వద్దు అరూ.... ఫోనులో రిపోర్టు వద్దు. నేనే వెళ్ళి స్వయంగా రిపోర్టు యిస్తాను" అని తన గదిలోకి వెళ్ళాడు.

రెండునిముషాల్లో డ్రెస్ మార్చుకుని తనే డ్రైవ్ చేసుకుంటూ కార్లో బయల్దేరాడు.

అతను వెళ్ళినవైపే చూస్తుండిపోయింది అరుంధతి.

## 15

పన్నెండో తారీకు.

రాత్రి పదకొండు గంటలు దాటుతోంది. ప్రేమ్ చంద్ ఇల్లు—పరిసరాలు అన్నీ ప్రశాంతంగా వున్నాయి. మేడమీద గదిలో ఎక్కడో ఒక్కచోట సన్నగా దీపం వెలుగుతోంది.

ఎదురింట్లోనించి తోటలో పలుచగా వెలుతురు పడు తున్నది.

చల్లనిగాలికి చెట్లు తలలు వూపుతున్నాయి.

రోడ్డుచివర్న అప్పుడప్పుడు ఏవో వాహనాలు వెళ్ళు తున్న మోత వినిపిస్తోంది.

మేడమీద చీకటిగా ఉన్న గదిలో నిలబడి కిటికీలో నించి బయటకు చూస్తున్నారు ఇన్‌స్పెక్టర్ ప్రదీప్, నలుగురు కానిస్టేబుల్స్, ప్రేమ్‌చంద్. వాళ్ళకళ్ళు రోడ్డు మీదకు చూస్తున్నాయి.

టైము పదకొండూ ఇరవై అయ్యింది.

కస్తూరి ఇంట్లోలేదు. తన స్నేహితురాలితో రెండో

ఆట సినిమాకు వెళ్ళింది. ఆమె ఇంటికి తిరిగి రాదు ఆ రాత్రికి. తెల్లవారిన తర్వాత వస్తుంది.

వాళ్ళు చూస్తుండగానే ప్రహరిగోడ మీద యెక్కి లోపలకు దూకాడు ఓ మనిషి.

రెండు నిముషాలు గోడదగ్గర నిలబడ్డాడు మేడకేసి చూస్తూ.

దీపం వెలుతురు యెక్కడినించో అతనిమీదకు పడు తోంది కొంచెంగా.

"వీడు ఆ ఇద్దర్లో ఒకడా" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కాదు. వీడెవడో కొత్తవాడు. ఇంతకుముందు చూళ్ళేదు" అన్నాడు ప్రేమ్‌చంద్.

గోడదగ్గర నిలబడ్డ మనిషి అక్కడేవున్న ఓ క్రోటన్ మొక్కచాటున దాక్కున్నాడు.

ఇన్‌స్పెక్టర్ ఓ కానిస్టేబుల్‌కు ఏదో చెప్పి యింటి వెనుక వయిపునించి బయటకు పంపించాడు. వాళ్ళు చూస్తుండగానే ఆ కానిస్టేబుల్ చెట్లచాటుగా వెళ్ళి క్రోటన్ మొక్కచాటున కూర్చున్న అతని మెడమీద వెనుకనించి అరచేతితో గట్టిగా కొట్టాడు. అతను చిన్నగా మూల్గి వెనక్కి పడిపోయాడు. వాడిని భుజంమీద వేసు కుని గదిలోకి తీసుకు వచ్చాడు. తాడుతో అతని కాళ్ళూ, చేతులూ కట్టేశారు.

"మనం ఇక్కడ వద్దు. తోటలో దాక్కుందాం. అక్కడే పట్టుకోవచ్చు" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"మీ ఇష్టం" అన్నాడు ప్రేమ్‌చంద్.

"మీరు ఇక్కడే ఉండండి. వాళ్ళను పట్టుకోగానే రండి"అని వాళ్ళు గబగబా బయటకు వెళ్ళి చెట్ల చాటున కూర్చున్నారు తోటలో.

పన్నెండు గంటలు కావస్తుండగా రంగశాయి—దుష్యంతరావు ఒకరి తర్వాత ఒకరు గోడ దూకారు.

వాళ్ళు దూకగానే గబుక్కున వాళ్ళమీద పడి పట్టుకున్నారు. వాళ్ళకేమీ అర్థంకాలేదు. విదిలించుకుని పారిపోవటానికి ప్రయత్నించారు. కాని కుదర్లేదు. బేడీలు పడ్డాయి ఇద్దరికీ—

"మోసం....రాక్షసి అరుంధతి మోసంచేసింది" అరిచాడు రంగాశాయి.

"నోర్ముయ్. మోసంచేసింది అరుంధతి కాదు. మీ దురదృష్టం. దొరికిపోయారు. అరుంధతిని మీకంటే ముందుగానే మూశాం" అన్నాడు ప్రదీప్.

ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

"నా ఇంట్లో చేరి నా ఆస్తినే కాజెయ్యాలని ప్లాను వేస్తార్రా వెధవలూ" అన్నాడు ప్రేమ్‌చంద్ కోపంగా.

ఉలిక్కిపడ్డారిద్దరూ.

అందరూ గదిలోకి వచ్చారు. అతను ఇంకా స్పృహలోకి రాలేదు.

"వాడిమొహాన నీళ్ళు కొట్టండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"వీడెవడు?" అన్నాడు దుష్యంతరావు-రంగశాయితో.

"ఏమో" అన్నాడతను.

అతనికి స్పృహ వచ్చింది.

లేచి "అరుంధతి ఏది?" అన్నాడు పోలీసులను చూసి కంగారుగా.

"కటకటాల వెనుక వుంది."

"ఆ" అన్నాడతను ఆశ్చర్యంగా.

"ఇంతకీ నువ్వెవరు నాయనా?" అడిగాడు ప్రేమ్‌చంద్.

"చెప్పను."

"నువ్వు చెప్పకపోయినా అరుంధతి చెపుతుంది. మర్యాదగా అన్ని విషయాలూ చెప్పు. లేకపోతే చచ్చేట్టు తన్నులు తింటావ్" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఇంతకీ మేము ఈ రాత్రికి ఇక్కడికి వస్తామని మీ కెలా తెలుసు" అడిగాడు దుష్యంతరావు అనుమానంగా. అతనికంతా అయోమయంగా వుంది.

"ఆ రోజు రాత్రి అరుంధతి మీతో అవుట్ హౌస్‌లో దొంగతనం ప్లానుగురించి మాట్లాడుతున్నప్పుడు విన్నాను ఆమె వెనుకేవచ్చి. అప్పుడే మీ గురించి తెలిసింది. అప్పుడే మిమ్మల్ని పోలీసులకు పట్టించే ప్లాను ఆలోచించాను. అందుకే అప్పుడు ఏమీ మాట్లాడలేదు. తెల్లారి మీ ఫోటోలు పేపర్లో పడ్డాయి. రిపోర్టు యివ్వాలని అరుంధతికి చెప్పి స్టేషన్‌కు వెళ్ళి అంతా చెప్పాను. నేను ఈ సాయంత్రం బొంబేకి వెళతానని మీకు తెలుసు. మీరు వస్తారని తెలుసు. అందుకే ముందుగా అరుంధతిని అరెస్టుచేసి లాకప్‌లో ఉంచి, మీ కోసం వలవేశాం. అనుకోకుండా యితనెవరో కూడా యిరుక్కున్నాడు" అన్నాడు ప్రేమ్‌చంద్ అతనివైపు చూసి.

"ఇంతకీ నీ విషయం చెప్పు ఆగంతకుడా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"చెబుతాను. ఎందుకు అనవసరంగా దెబ్బలు తినటం. అరుంధతి నేను ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకోవాలనుకున్నాం. కాని ఇంతలోనే ప్రేమ్‌చంద్ ఆమెను చేసుకుంటాననటం ఆమె వొప్పుకోవటం జరిగాయి. నాకు చెప్పింది. తిట్టాను. కేవలం ఆ సిరికోసమే ఒప్పుకున్నాననీ త్వరలో ఆస్తి కాజేసే ప్లాను వేసి డబ్బు చేతికి రాగానే

పెళ్ళిచేసుకుందామంది. సరేనన్నాను. తర్వాత కొన్నాళ్ళకు ఉత్తరం రాసింది. రంగశాయి—దుష్యంతరావు కనిపించారనీ వాళ్ళని పావులుగా వుపయోగించి డబ్బు కాజేసే ప్లాను వేశాననీ రాసింది. ఆ ప్లాను ప్రకారం వాళ్ళు దొంగతనంచేసి బయటకు రాగానే నేను వాళ్ళను రివాల్వర్‌తో కాల్చి ఆ డబ్బు తీసుకొని వెళ్ళిపోవాలి. తర్వాత పోలీసులకు తెలిసినా వాళ్ళు ఆ ఇద్దరినీ దొంగలని తెలుసుకుని ఇంకొక దొంగ ఇద్దరినీ కాల్చి డబ్బుతో పారిపోయాడని అనుకుంటారు. అరుంధతి మీద ఎవ్వరికీ అనుమానం రాదు. తర్వాత కొన్నాళ్ళకు అరుంధతి నా దగ్గరకు వచ్చేస్తుంది. ఇదీ సంగతి. నాలుగు రోజుల క్రితం ట్రంక్‌కాల్ చేసి ఈ రోజు రాత్రి పదకొండు గంటలకు వచ్చి తోటలో దాక్కొని వుండమంది. వచ్చాను. పట్టుకున్నారు" అన్నాడతను.

దుష్యంతరావు—రంగశాయి ఒకరినొకరు భయంగా చూసుకున్నారు.

"నీ పేరు" అడిగాడు ప్రేమ్‌చంద్ అతన్ని.

"నరేష్" చెప్పాడతను.

"నేను పొరపాటు చేశాను ఇన్‌స్పెక్టర్ గారూ. ఓ ఆడదాన్ని పెళ్ళిచేసుకునే ముందు ఆమె గురించి తెలుసుకోవాలి. కేవలం అందం చూసి మోసపోయాను. మీ సహాయానికి నా కృతజ్ఞతలు" అన్నాడు ప్రేమ్‌చంద్.

"మేమే మీకు థాంక్స్ చెప్పాలి—ఆరితేరిన తోడు దొంగల్ని పట్టిచ్చినందుకు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ ప్రదీప్ వాళ్ళిద్దరికేసి చూసి.

ఇద్దరూ తలలు వంచుకున్నారు.

—:ఐపోయింది:—

# కంబళి కప్పిన శవం

## సికిందర్

**మిస్.** సుజాతను చూసి లాల్ అసహనంగా నిట్టూర్చి, తీవ్రస్వరంతో అన్నాడు: "మీరు వచ్చి నాలుగు నిమిషాలవుతోంది. ఇంతవరకూ పేరు మాత్రమే చెప్పారు. ఇంకేమీ చెప్పదలచలేదా? నా పార్ట్‌నర్ ఇది బ్యూటీ కాంటెస్టు అనుకుంటున్నాడు!"

లాల్ మాటలు విని జాన్ ఘటుక్కున నాలిక కరచుకొని, సుజాత మీదనుంచి చూపులు తప్పించి సీలింగ్ కేసి చూడసాగాడు.

సుజాత చిన్నగా నవ్వుతూ అంది, "బ్యూటీ కంటెస్ట్, టీజింగ్స్....అవన్నీ కాలేజీ లైఫ్‌తోటే అంతమయ్యాయి. నేనిప్పుడు బాధ్యతగల వ్యక్తిని!"

"కానీ....మీరింకా కుమారి...." లాల్ నసిగాడు.

సుజాత మళ్ళీ నవ్వింది. "మీ అనుమానం అర్థమైంది. కుమారి అయినంత మాత్రాన బాధ్యతలుండవా? నా బాధ్యత సంసారపరమైనది కాదు. వ్యాపారపరమైనది.

అంతేకాదు—నా తండ్రి ఆరోగ్యాన్నీ, చెల్లెలి భవిష్యత్తును కూడా పరిరక్షించే బాధ్యత నాది."

లాల్ ఆసక్తిగా ముందుకు వంగాడు, "మీ కుటుంబ సభ్యులెవరు?"

"నా తండ్రి—నేను—నా చెల్లెలు" చెప్పింది సుజాత, "నా తండ్రికి సంవత్సరం నుంచి గుండెజబ్బు వుంది.... రెండుసార్లు స్ట్రోక్ కూడా వచ్చింది. ఇప్పటి పరిస్థితినిబట్టి యెలాంటి ఉద్రేకాలకి గురయినా ప్రాణాపాయం వుంటుందని మా డాక్టర్ అన్నాడు."

"ఐ యాం వెరీసారీ. మీ రిక్కడికి వచ్చారంటే...."

సుజాత అందుకుంది. "మిస్టర్ లాల్ సమస్య ఏమిటో చెప్పేముందు మా కుటుంబం గురించి చెప్పాలి. ఇది పరిస్థితని స్పష్టంగా అర్థంజేసుకోవడానికి మీకు చాలా ముఖ్యం."

లాల్ తలూపాడు.

సుజాత ఒక్కక్షణం ఆగి ప్రారంభించింది: "సంవత్సరం నుంచీ మా నాన్న ఆరోగ్యం బాగాలేదు. సంవత్సరం క్రితంవరకూ ఆయన ఎన్నో వ్యాపారాలు చేశారు. తీరిక, విశ్రాంతి వుండేవికావు. అయినా ఆయన లెక్కచెయ్యలేదు. అదే ఆయన ఆరోగ్యాన్ని దెబ్బతీసింది.... గుండెజబ్బు ప్రారంభమైంది.

"అప్పటికీ ఆయన డాక్టర్ సలహా లెక్కచెయ్యలేదు! పూర్తి విశ్రాంతి అవసరమని డాక్టర్ చెప్పాడు. మరి వ్యాపారం చూసేదెవరు? దగ్గరి బంధువులెవరూ లేరు—వున్నా ఆయన నమ్మరు. చివరికి ఆయన కయిష్టమైనా, నా చదువు పూర్తికావడంతో ఆ బాధ్యత నేనే తీసుకొన్నాను.

"ఈ సంవత్సరం నుంచీ వ్యాపారమంతా నేనే చూస్తున్నాను. నాన్న ఇల్లు కదలకుండా విశ్రాంతి తీసుకొంటున్నారు—నా చెల్లెలు ఆయనకు సపర్యలు చేస్తోంది. ఆమెకు తండ్రిపట్ల ప్రేమ ఎక్కువ. రోజల్లా ఆయన్నే అంటిపెట్టుకొని వుంటుంది. ఈ సంవత్సరం నుంచీ ఆమెకు ఇల్లు తప్ప బయటి ప్రపంచం తెలీదు! నాన్న జబ్బుపడడంతో బియ్యే సగంలో మానేసి నాట్యం నేర్చుకుంది. ఈ మధ్య డ్రైవింగ్ కూడా నేర్చుకుంటోంది."

"ఒక్క సంవత్సరంలో మీ జీవితాలు చాలా మారిపోయాయి కదూ?"

"అవును. ఇంతకాలం ఎలాటి అవాంతరం లేకుండా గడిచిపోయింది. నా తండ్రి ఇంకెంతో కాలం బ్రతకరని తెలిసినా; బ్రతికినంతకాలం సుఖంగా ఎలాంటి సమస్యలూ భయాలూ లేకుండా, ఉద్రేకాలకి లోనుకాకుండా వుండాలని ప్రతి చిన్నవిషయంలోనూ ఎంతో జాగ్రత్త వహిస్తూ వచ్చాను.... కానీ, ఇప్పుడు నాకు అగ్నిపరీక్ష యెదురయింది."

"ఏమిటది?"

"ఇందాక నాకో ఫోన్ కాల్ వచ్చింది. ఫోన్‌లో మాట్లాడిన మనిషి నన్ను—మా కుటుంబాన్ని బెదిరిస్తున్నాడు!"

"ఏ విషయంలో?"

"నేను నమ్మలేని విషయంలో! నా చెల్లెలి ప్రేమలేఖలు తనవద్ద వున్నాయని చెప్పాడు!"

"ఐసీ. అతని మాటలు మీరు నమ్మలేదా?"

"నమ్మను—ఉష అలాంటి పని చెయ్యదు! ఆమెకు జీవితంపట్ల, వివాహంపట్ల నిర్దిష్టమైన అభిప్రాయా

లున్నాయి. ప్రేమవివాహాల్లో విశ్వాసంలేదు."

"ఈ మాటలు మీకు చెప్పిందా?"

"ఇలాటి విషయాలు ఆమె మాట్లాడదు! మీకు ముందే చెప్పాను—ఆమె ఇల్లు కదలదు! ఆమెకు ఇల్లే ప్రపంచం, తండ్రియే సర్వస్వం. పైగా బిడియమెక్కువ. పరాయి మనుషుల దగ్గర — మగవాళ్ళు కానీండి, ఆడవాళ్ళు కానీండి—తలెత్తి చూడదు. ఈ ఏడాదినుంచి ఆమెకు బయటి పరిచయాలు లేవు—స్నేహితులు కూడా యెవరూ లేరు. మీ రొకసారి ఆమెని చూస్తే స్వభావం అర్థం చేసుకొంటారు. బయటిప్రపంచంతో సంబంధాలు లేని మనిషి ప్రేమలేఖలు వ్రాస్తోందంటే మీరు నమ్ముతారా?"

"ఆమె కారు డ్రైవింగ్ నేర్చుకుంటుందన్నారు—ఎవరు నేర్పుతున్నారు?"

"ప్రతీ ఆదివారం—నేను."

"ఆమెకు దేనిలో ఆసక్తి ఎందుకు కల్గింది?"

"ఆమె వ్యాపకాలలాటివి. చదువుకొనే రోజుల్లో స్టాంపులు సేకరించేది. చదువు మానేశాక నాట్యం నేర్చుకుంది. ఇప్పుడు కారుపిచ్చి పట్టింది—ప్రత్యేకంగా కారణమంటూ ఏమీలేదు."

"సరే, ఇక అసలు విషయానికి వద్దాం. మిమ్మల్ని బెదిరించిన మనిషి పేరేమిటో తెలుసా?" అడిగాడు లాల్.

"తెలుసు" అంది సుజాత బ్యాగులోంచి ఒక చిన్న కాయితం తీస్తూ. లాల్ దాన్ని అందుకొని చూశాడు: పేరు, ఫోన్ నెంబర్ అడ్రసు వున్నాయి.

"అతని పేరు దివాకర్" సుజాత మళ్ళీ అంది, "అతనికి తెలుగు రాదనుకొంటాను, హిందీలోనే

మాట్లాడాడు."

"మిమ్మల్ని ఏమని బెదిరించాడు?"

"ఉష వ్రాసిన ప్రేమలేఖలు ఒకానొక చోటనుంచి తనకు లభించాయట. అవి చాలా అసభ్యకరంగా ఆమె పరువునూ తద్వారా కుటుంబ ప్రతిష్టనూ నాశనం చేసే విలా వున్నాయట. వాటికి తగిన ధర చెల్లించి నేను స్వాధీనం చేసుకోకపోతే ఏర్పడే దుష్పరిణామాలకి నేనే బాధ్యురాల్నవుతానట!"

"ఎలాటి దుష్పరిణామాలు....?"

"నేను డబ్బివ్వకపోతే వాటిని నాన్నకు చూపిస్తాడట. ఇక మీరే వూహించండి! ఆ ఉత్తరాలు చదివి నాన్న—"

"అయితే మీరు డబ్బు చెల్లించాలనుకొంటున్నారా?"

"అవును."

"మరి యిక్కడికెందుకొచ్చారు?"

"ఆ ఉత్తరాలకి ఎంత ధరయినా చెల్లిస్తాను. కాని, బ్లాక్ మెయిలర్స్‌ని యెప్పుడూ నమ్మకూడదు! అలాటి ఉత్తరాలెన్ని వున్నాయో నాకెలా తెలుసు!"

"అవును, ఎవరికీ తెలియదు, అతనికి తప్ప."

"అంతేకాదు—వాటికి డూప్లికేట్స్ కూడా వుంటే-మళ్ళీ మళ్ళీ బెదిరిస్తాడు. జలగలా పీడిస్తాడు. మిస్టర్ లాల్, అతడి పీడ ఈ ఒక్క ప్రయత్నంలోనే తొలగిపోవాలి! అతని దగ్గర యెన్ని ఉత్తరాలున్నాయో, వాటికి డూప్లికేట్స్ యెన్ని వున్నాయో మీరు తెలుసుకుంటే—"

"ఆ విషయం మీ రతన్ని అడగలేదా?"

"అడిగితే చెప్పలేదు. ఒంటి గంటకు తనింటికొస్తే

విషయాలన్నీ మాట్లాడుకోవచ్చన్నాడు. నేను వెళ్ళదల్చుకున్నాను. కానీ మీ సహాయం లేనిదె ఈ గండాన్ని తప్పించలేను!"

"ఆ ఉత్తరాలు మీ చెల్లెలు వ్రాయనప్పుడు యెందుకింత భయపడుతున్నారు? ఆమె దస్తూరీని ఫోర్జ్ చేసే అవకాశం యెవరికి వుంటుంది?" లాల్ అడిగాడు.

"అదే అర్థంగావడం లేదు. ఆ ఉత్తరాలు ముమ్మాటికీ ఉష వ్రాయలేదు! ఈ నిజం నాకు తెలుసు, ఆమెకూ తెలుసు. మరి నాన్నకు? ఆయన వాటిని నమ్మి ఉషను ఇంటినుంచి బహిష్కరిస్తే? ఆమె విశ్వాసఘాతానికి ఆయన ఉద్రేకానికి లోనై గుండెపోటు వచ్చి—ఓహ్, ఇక చెప్పకండి!"

"సరే, ఆ ఉత్తరాల్ని స్వాధీనం చేసుకోడానికి మేం మీకు తోడ్పడతాం. కానీ చూస్తూ చూస్తూ ఒక బ్లాక్ మెయిలర్‌ని వదిలేయమంటారా?"

"అవును! ఇందులో మీరేమీ చట్టవ్యతిరేక చర్యకు పూనుకోవడంలేదు. చట్టం గురించి నాకూ తెలుసు. మా కుటుంబ ప్రతిష్టకూ, ఐక్యతకూ ప్రమాదం వాటిల్లే ఈ వ్యవహారంలో మీరు అనుమతి లేకుండా నా ప్రత్యర్థికి రవంత హాని కూడా తలపెట్టలేరు! ఇది పోలీసులకు కూడా వర్తిస్తుంది. నేను పోలీసు సహాయమే కోరేదాన్ని— కాని రహస్యాలకు భద్రత వుండదు. అందుకే మీ దగ్గరకొచ్చాను. మీ కిష్టం లేకపోతే విషయాలన్నీ ఇక్కడితో మర్చిపొండి!"

ఛటుక్కున లేచి నిలబడింది సుజాత.

జాన్ గాభరాగా లాల్‌ని చూశాడు.

లాల్ ఒక్క క్షణం తర్వాత అన్నాడు, " ఇందులో

మా మధ్యవర్తిత్వం దివాకర్ అంగీకరిస్తాడా?"

"చచ్చినట్టు! మీరు ఫోన్ చెయ్యండి!"

లాల్ రిసీవరెత్తి ఒక నెంబర్ డయల్ చేశాడు. వెంటనే అవతల రెస్పాన్స్ రావడంతో హిందీలో అన్నాడు.

"మిస్టర్ దివాకర్, డిసీజ్ లాల్ స్పీకింగ్. యస్, TCDA పార్ట్‌నర్‌ని. నేను మిమ్మల్ని చూడాలి.... ఎందుకా? మీరు బ్లాక్‌మెయిల్ చేస్తున్న సుజాత మమ్మల్ని కలుసుకుంది గనుక! నో, నో! గాభరాపడవద్దు! దటీజ్ రైట్....ఈ వ్యవహారంలో పోలీసులకు ప్రవేశం లేదు. టాప్ సీక్రెట్! ఓ.కే. నేనా ఉత్తరాలు చూడాలి. కాదు, పూర్తి ఉత్తరం—ప్రతి అక్షరం చదవాలి. గుడ్-వైనాట్? తప్పకుండా వస్తాను. ఆ ఉత్తరాలు చూపించనిదే నయాపైసా కూడా ముట్టదు! అవి దొంగ వుత్తరాలు కాదని నాకు నమ్మకం కుదరాలి. అప్పుడుగానీ డబ్బు చెల్లించబడదు....గో టు హెల్! మీ రిప్పుడు డిటెక్టివ్‌తో వ్యవహరిస్తున్నట్లు గమనించండి! అవును.... అవును....మా క్లయంట్స్ గాడిదను కొనాలని చెప్పినా సరే, మేం దాన్ని పరీక్షించి మేలైనదేనని నిర్ణయించవల్సిందే! అలాగే, థాంక్స్, పెట్టేస్తున్నాను."

లాల్ రిసీవర్ పెట్టేసి అదోలా నవ్వాడు.

"ఏమన్నాడు" జాన్ అడిగాడు.

"ఉత్తరాలు చూపిస్తానన్నాడు. ఇప్పుడు నేనూ, సుజాత వెళతాం" అని సుజాతవైపు తిరిగి మళ్ళీ అన్నాడు లాల్, "మీ చెల్లెలి చేతివ్రాత చూడాలి. చదువుకొనే రోజుల్లో ఆమె నోట్స్‌గానీ, ఉత్తరాలుగానీ వుందా."

"ఆమె గేయాలు వ్రాస్తుంది" అంది సుజాత,

"ఇప్పటికీ! కానీ పత్రికలకి పంపను. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్. మీ రామె దస్తూరీ చూడాలనుకుంటే ఆమె నోట్ బుక్ లో ఒక గేయం చింపి తెస్తాను."

"అది చాలా మంచిపని" అన్నాడు జాన్ సొరుగు లోంచి ఆంధ్రసచిత్ర వారపత్రిక తీస్తూ.

## 2

సరిగ్గా మధ్యాహ్నం ఒంటిగంటకి లాల్, సుజాత కారులో శాంతినగర్ లో ఒక ఇంటికి చేరుకున్నారు.

ఇద్దరూ కారుదిగి లోనికి నడిచారు. లాల్ మెట్లెక్కి కాలింగ్ బెల్ బజర్ నొక్కి, సుజాతవంక చూశాడు'

ఆమె గాభరాగా చూసింది.

ఇంతలో తటాలున తలుపు తెరిచి ఒక యువకుడు ప్రత్యక్షమయ్యాడు.

"మిస్టర్ దివాకర్" లాల్ అడిగాడు.

"యస్, కమిన్" అన్నాడు దివాకర్ ప్రక్కకు తొలగి.

ఇద్దరూ లోనికెళ్ళారు.

"నాకు చాలా ఆనందంగా వుంది, మిస్టర్ లాల్! మిమ్మల్ని నా యింట్లో కలుసుకొంటానని వూహించలేదు! ఇవి మరపురాని క్షణాలు.... ఓహ్, మిస్ సుజాత! ఎలా వున్నారు? మీ డాడీ ఆరోగ్యం బాగుందా? ఆయన్ను మీరు జాగ్రత్తగా కాపాడాలని మరువకండి!"

సుజాత అయోమయంగా చూసింది.

దివాకర్ మళ్ళీ అన్నాడు, "కూర్చోండి, మిస్టర్ లాల్. సుజాతను ఇలా అప్ సెట్ చెయ్యడం నాకే మాత్రమూ ఇష్టంలేదు. కాని పొట్టకోసం దుర్మార్గం చేయవల్సి వచ్చినప్పుడు స్త్రీ పురుష భేదం వుండదు!"

"మీ వృత్తి ఏమిటి? బ్లాక్ మెయిల్?...."

"కాదు—"

"మీ యింట్లో చాలా విలువైన వస్తువులున్నాయి."

"అవును. సంపాదించేవాడికి అనుభవించే హక్కు వుంది."

"అక్రమ సంపాదనతో కాదు."

"మీరు సక్రమమైన పదాలు వాడండి! మిస్టర్ లాల్, పరిస్థితి విషమించడం నా కిష్టంలేదు. ఈ బిజినెస్ ప్రశాంతంగా ముగిద్దాం. నా వ్యక్తిగత వివరాలతో మీకు పని లేదు."

"ఆల్ రైట్. మీరు ఉత్తరాలు చూపించండి!"

లాల్ చేతిలో బ్రీఫ్ కేస్‌ను చూసి దివాకర్, "దానిలో ఏముంది?" అన్నాడు.

"నా సరంజామా—మీ కభ్యంతరమా?"

దివాకర్ అడ్డంగా తలూపి జేబులోంచి రివాల్వర్ తీశాడు. "కాదు, కానీ మిస్టర్ లాల్, మీ రెలాంటి పిచ్చిపనులు చెయ్యకూడదు! ఉత్తరాలు నా దగ్గర వున్నంత వరకు నా చేతిలో రివాల్వర్ వుంటుంది."

"మంచిది, మీ దగ్గరెన్ని వుత్తరాలున్నాయి?"

"నాలుగు."

"వాటికి డూప్లికేట్స్?"

"లేవు. మీరు పూర్తిగా నమ్మవచ్చు. ఇలాంటి విషయాల్లో నమ్మటం కష్టం. అయినా నమ్మితీరాలి తప్ప మీకు గత్యంతరం లేదు!" దివాకర్ గిరుక్కున తిరిగి వెనుక గదిలో కెళ్ళిపోయాడు.

"నాకు భయంగా వుంది!" అంది సుజాత.

"దేనికి?"

"అతని దగ్గర రివాల్వర్ వుంది. మీరేం చేయ బోతున్నారు?"

లాల్ నోరు విప్పేలోపున దివాకర్ గ్లోవ్స్ తొడుక్కున్న చెరో చేతిలో రివాల్వర్, వుత్తరాలతో తిరిగి వచ్చాడు.

"సిడవున్, మై డియర్ ఫ్రెండ్స్! ఆ టేబిల్ దగ్గర కూర్చోండి!"

లాల్, సుజాత చెప్పినట్లు చేశారు. టేబిల్ మీద యెలాంటి వస్తువులూ లేవు. ఒక వెడల్పాటి అద్దం మాత్రం దానిమీద అమర్చి వుంది.

దివాకర్ రివాల్వర్ టేబిల్ మీద పెట్టి, ఉత్తరాలు మడత విప్పుతూ అన్నాడు. "మిస్టర్ లాల్, డీల్ సెటిల్ అయ్యేవరకూ మీరీ వుత్తరాలు ముట్టుకోకూడదు!"

"ఎందుకు?"

"ఆ అవకాశం మీకిస్తే మీరు వాటికి నిప్పంటించ వచ్చు—లేదా—వుండచుట్టి కిటికీలోంచి విసిరేస్తే అవతల మీ పార్ట్‌నర్ అందుకోవచ్చు?

నవ్వాడు లాల్, "జాన్ ఇక్కడ లేడు."

"ఆల్ రైట్, మీరు డిటెక్టివ్‌లు. మీ తెలివితేటల్ని నేను గౌరవిస్తానుగానీ, నా దగ్గర ప్రదర్శిస్తే మాత్రం సహించను. మరువకండి! నా చేతిలో రివాల్వర్ వుంది."

"ఈ ఉత్తరాల్ని నేను టేబిల్ గ్లాస్ క్రింద పరుస్తాను. మీరు కూర్చున్న చోటునుంచి కదలకూడదు! వీటిని ముట్టుకోకూడదు! అద్దంలోంచి వంగి వాటిని చదువుకో వచ్చు."

దివాకర్ టేబిల్ గ్లాస్ ఎత్తి నాలుగు వుత్తరాల్ని

పరిచి తిరిగి అద్దం పెట్టేశాడు.

సుజాత ఛటుక్కున ముందుకు వంగి చూసింది.

లాల్ దివాకర్‌ని ఓ క్షణం చూసి తరువాత ముందుకి వంగాడు. తెల్లటి మామూలు కాయితాలపైన సిరాతో వ్రాసిన నీలిరంగు అక్షరాలు అద్దంలోంచి స్పష్టంగా కనిపిస్తున్నాయి. అయిదు నిమిషాల్లో వుత్తరాలన్నీ చదివి సుజాతను చూశాడు. అవమానంతో ఆమె ముఖం ఎర్రబడింది "చాలా ఛండాలంగా వున్నాయి" అర్చిందామె.

లాల్ జేబులోంచి సుజాత తెచ్చిన కాగితం తీశాడు. అందులో ఉష దస్తూరీని, వుత్తరాల్లోని అక్షరాల్ని భూతద్దంతో మార్చి మార్చి చూసి, నెమ్మదిగా అన్నాడు. "సందేహంలేదు. ఇవి మీ చెల్లెలు వ్రాసినట్లుగానే వున్నాయి."

దివాకర్ గర్వంగా నవ్వుకున్నాడు.

"ఓహ్! వాటిని చింపేయండి, మీకు పుణ్యముంటుంది!" సుజాత అర్చింది.

దివాకర్ ఛటుక్కున ముందుకు జరిగాడు, "డీల్ యింకా సెటిల్ కాలేదు, సిస్టర్! ముందు డబ్బు విషయం మాట్లాడండి!"

"ఎంత కావాలి?" లాల్ అడిగాడు.

"పాతిక వేలు."

లాల్ సుజాత వైపు తిరిగాడు, "మీరేమంటారు?"

"ఇప్పుడే చెక్కు వ్రాస్తాను!"

"నో అర్జెన్సీ! నేను చిటికె వేసేవరకు చెక్కు వ్రాయకండి!" దివాకర్ వైపు తిరిగి మళ్ళీ అన్నాడు లాల్. "వుత్తరాలు బావున్నాయి. అయితే నా షరతు మీకు తెలుసు...."

"ఏమిటి?"

"ఈ వుత్తరాలు ఫోర్జరీ అని మీకూ నాకూ తెలుసు కాబట్టి అదెలా జరిగిందో తెలుసుకుందాం!"

"అరె! అరెరె! మీరు చాలా గమ్మత్తుగా మాట్లాడుతున్నారు!" దివాకర్ రివాల్వర్ అందుకొని అర్చాడు.

"అవును. మీకు ముందే ఫోన్‌లో చెప్పాను. ఇవి దొంగ వుత్తరాలు కాకపోతేనే డబ్బు చెల్లించబడుతుంది."

"దొంగ వుత్తరాలైతే?"

"నయాపైసా ముట్టదు! ఏం చేసుకుంటారో చేసుకోండి!" లాల్ లేచి నిలబడ్డాడు, "పదండి సుజాతా, వెళ్ళిపోదాం!"

సుజాత కంగారు పడింది.

"ఆల్‌రైట్, ఆల్‌రైట్, మిస్టర్ లాల్. త్వరపడి నిర్ణయం తీసుకొంటున్నారు. ఈ వుత్తరాలు ఫోర్జరీ కావు!"

"మీ మాటలు వినదల్చుకోలేదు, నేను స్వయంగా ధృవపర్చుకోవాలి."

"ఎలా ధృవపర్చుకొంటారు?"

"ఆ ఉత్తరాల్ని ఫోటోలు తీస్తాను. వాటిని నాకు తెలిసిన ఎక్స్‌పర్టుకు చూపించి ఫోర్జరీ అవునో కాదో తెలుసుకుంటాను. అప్పుడే మీకు డబ్బివ్వవల్సిందీ లేనిదీ నిర్ణయించుకొంటాను."

"అందుకు నే నొప్పుకోను!"

"ఒప్పుకోకపోతే నూలువడుకుతూ కూర్చోండి! కాని వుత్తరాల్ని బయటపెడితే మాత్రం ప్రయోజనంలేదు. అవి ఫోర్జరీ అని నే నెప్పుడైనా నిరూపించగలను. మీరను

కుంటున్నట్లు ఎవరిపరువూ మంటగలవదు. ఇది గ్యారంటీ!''

దివాకర్ యిబ్బందిగా చూశాడు.

"మిస్టర్ లాల్, యిలాంటి సున్నిత పరిస్థితిలో మీరు మొరటుగా ఎందుకు వ్యవహరిస్తున్నారో అర్థంగావడం లేదు! ఈ ఉత్తరాలు ఫోర్జరీ కావని నాకు తెలుసు, మీతో పంతాలకుపోయి సుజాతకు అన్యాయం చేయదల్చలేదు. ఆల్ రైట్, రండి, మీ ప్రయోగాలు చేసుకోండి!''

లాల్ నవ్వి బ్రీఫ్ కేసులోంచి కేమెరా తీశాడు. దానికి ఎక్స్టెన్షన్ రాడ్ బిగించి చకచక నాలుగు స్నాప్స్ లాగి, తిరిగి పెట్టేసి థాంక్స్ చెప్పాడు.

"ఓ.కే, మిస్టర్ దివాకర్! నా నిర్ణయం సాయంత్రం తెలియజేస్తాను. మీ రింట్లోనే వుంటారా?''

"అవును.''

"ఇక మేం వెళ్ళవచ్చా?''

"సంతోషంగా!''

లాల్ మారుమాట్లాడకుండా సుజాతతో బయట కొచ్చి కారెక్కాడు.

"లాల్, నా మాట వినండి! మీరేం చేస్తున్నారో నాకు తెలియదు! అవి దొంగ ఉత్తరాలైనా కాకపోయినా డబ్బిచ్చి వాటిని స్వాధీనం చేసుకోవడం ముఖ్యం! వింటున్నారా?''

సుజాత మాటలకి లాల్ నవ్వాడు, "డిటెక్టివ్‌లు యెలాంటి బెదిరింపులకూ డబ్బు చెల్లించరు. అది మా వృత్తికే తలవంపు! పైగా తల వంచడమంటే నాకు చాలా నామోషీ కూడా! వెల్ సుజాతా, మీరు నిశ్చింతగా వుండండి! సాయంత్రం ఏడుగంటలకి పాతిక వేలకి

చెక్కుతో మా ఆఫీసుకు రండి! మిస్త్రీ ఎక్కడ డ్రాప్ చెయ్యను?" అడిగాడు.

## 3

సాయంత్రం నాలుగు గంటలకు లాల్ ఇచ్చిన నెగటివ్‌ని డెవలప్ చేసి జాన్ ప్రింట్స్ తీశాడు. సరిగ్గా లాల్ చెప్పిన ఎన్‌లార్జిమెంట్‌లో వున్న ఆ బ్లో అప్స్‌లో వున్న వుత్తరాల్ని చదివి బిత్తరపోయాడు.

లాల్ ఆ ఫోటోల్ని చూసి "గుడ్! ఆ వుత్తరాలు కూడా ఇవే సైజులో వున్నాయి—1/8 ఫుల్ స్కేప్" అన్నాడు మెచ్చుకోలుగా. "వీటితో ఇప్పుడు చాలా ముఖ్యమైన పని వుంది. అది నువ్వు చెయ్యాలి. ఈ ఫోటోల్లో మేటర్‌ని జాగ్రత్తగా చూడు! ఎన్ని పంక్తులున్నాయి? అక్షరాలెలా వున్నాయి? మార్జిన్, స్పేస్ ఎంత వున్నాయో, పైన తేది, క్రింద సంతకం యెలా వున్నాయో జాగ్రత్తగా గమనించు. ఇవి లైంగిక విశ్వాసం లేని వ్యక్తి సృష్టించిన నాలుగు అసభ్య లేఖలు—అతని అసంతృప్తికి ప్రతీకలు. వీటి స్థానంలో మనం నాలుగు సాధారణ ఉత్తరాలు తయారు చెయ్యాలి"

"ఎలా?"

"చెప్తాను, వ్రాసుకో!"

జాన్ పాడ్, కలం అందుకున్నాడు.

లాల్ అన్నాడు: "ప్రియమైన వసంతకు, నీ స్నేహితురాలు వ్రాయునది.... ముఖ్యంగా వ్రాయున దేమనగా, మీ ఇంట్లో ఫోన్ చెడిపోవడంవల్ల నీతో మాట్లాడే అవకాశం లేకపోయింది. అందుకే ఆ శుభ సందర్భానికి రెండు రోజులు ముందుగా నీకీ వుత్తరం వ్రాస్తూ ఆహ్వానిస్తున్నాను. నా సంగతి నీకు తెలుసు కదా? ఇలు

కదలడమంటే నాకు మహా ఇది! — పేరాగ్రాఫ్—
ఇంతకూ ఆ శుభ సంద్భమేమిటో చెప్పనా? నేను కారు డ్రైవింగ్ ఇప్పుడు పూర్తిగా నేర్చుకున్నాను. ఎల్లుండి సాయంత్రం నిన్ను కార్లో కూర్చోబెట్టుకొని వూరంతా త్రిప్పాలని నాకు చాలా తహతహగా వుంది! తప్పకుండా వస్తావు కదూ?—ఇట్లు—నీ ప్రాణ స్నేహితురాలు—ఉష."

జాన్ వ్రాసుకొని తలూపాడు.

"ఇలాటివే మరో మూడు వివిధ రకాల ఉత్తరాలు తయారు చేయాలి. చేస్తావా?"

జాన్ ఉత్సాహంగా తలాడించాడు.

"ప్రేమలేఖలు కాదు!" లాల్ హెచ్చరించాడు.

జాన్ నవ్వి, "ఇంతకూ ఏమిటి నీ అయిడియా?" అన్నాడు.

"బ్లాక్ మెయిలర్ని ట్రిక్ చేయబోతున్నాను."

"ఎలా?"

"అతనికి తెలుగు రాదు. ఈ వీక్ పాయింట్తో నా ట్రిక్ ప్రయోగిస్తాను. హైద్రాబాదులో పేరు మోసిన ఫోర్జర్ ఎవరు?"

"మాస్టర్ ఆచారి—ఆరు భాషల్ని అనర్గళంగా మాట్లాడ్డమేగాక అక్షరం పొల్లుపోకుండా వ్రాయగలడు!"

"అలాటి మొనగాడే కావాలిప్పుడు! నేను చెప్పిన ఉత్తరంతోబాటు నువ్వు వ్రాసే మూడు వుత్తరాల్ని కూడా ఉష దస్తూరీలో ఫోర్జ్ చేయించాలి."

"ఆచారి మనల్ని చూసి చెయ్యడు!"

"అతను చేసేలా నువ్వొప్పించాలి! సాయంత్రం ఏడు గంటలకల్లా అవి సిద్ధంగావాలి! స్పెసిమెన్ కోసం ఆచారి

దగ్గరకు ఈ ఫోటోలు తీసికెళ్ళకు—ఉష వ్రాసిన గేయం పట్టుకెళ్ళు. దివాకర్ దగ్గరవున్న ఉత్తరాలు మామూలు తెల్లకాయితాల్లోనే వున్నాయి—క్రింద స్టేషనరీ షాపుల్లో దొరుకుతాయి—ఈ ఫోటో సైజుకి కత్తిరించి తీసికెళ్ళు!"

## 4

సాయంత్రం ఆరు గంటలకి జాన్ తిరిగివచ్చాడు.

"సక్సెస్?" లాల్ అడిగాడు.

"నేను వెళ్ళడమూ, సక్సెస్ కాకపోవడమూనా! కల్లోకూడా అనుకోకు!" జాన్ బిగ్గరగా నవ్వి, కుర్చీలో కూలబడి, బ్యాగును లాల్ మీదకు విసిరాడు.

లాల్ గ్లోవ్స్ తొడుక్కొని బ్యాగులోంచి వుత్తరాలు తీశాడు. వాటిని కళ్ళు విశాలంగా చేసి చూసి, "వండర్ఫుల్!" అన్నాడు.

జాన్ అన్నాడు, "నాకో సందేహం వుంది....దివాకర్‌కు తెలుగు రాకపోతే ఈ వుత్తరాలెలా సృష్టించగల్గాడు?"

లాల్ వులిక్కిపడ్డాడు. "అవును! నాకు తట్టనేలేదు! ఎలా సృష్టించాడు?"

"అతను సృష్టించలేదు. ఎవరో అదృశ్యవ్యక్తి.... లాల్, నీకు ఆచారి గురించి చెప్పాలి?"

"ఏమిటతని గురించి?"

జాన్ అన్నాడు: "నేనీ వుత్తరాలు ఫోర్జ్ చెయ్యాలని చెప్పినప్పుడు అతనికి అనుమానం కల్గింది. అది తనను పట్టుకోవడానికి పోలీసులు పన్నిన ట్రాప్ అనుకున్నాడు. కాదని నమ్మించేసరికి నా తల ప్రాణం తోకకొచ్చింది. చివరికి రెండువేలకి ఆశ పెట్టాను. ఒప్పుకొన్నాడు. నేనా వుత్తరాలిచ్చాను. అతను చదివి, దస్తూరీక్రింద సంతకం

చూసి వులిక్కిపడ్డాను."

"ఎందుకు?"

"ఎందుకో అతను చెప్పలేదు. పైగా ఆ పనికి ఒప్పుకోలేదు. కారణం సనేమిరా చెప్పనన్నాడు. డబ్బు తిరిగి ఇచ్చేశాడు. అతని ప్రవర్తన నా కనుమానం కలిగించింది.. దివాకర్ దగ్గరవున్న వుత్తరాలు అతనే ఫోర్జ్ చేసి వుండాలి! అందుకే అతని క్లయంట్ ప్రయోజనాల్ని దెబ్బతీసే ప్రయత్నానికి ఒప్పుకోలేదు. ఈ విషయం నేను చెప్పేసరికి తెల్లమొహం వేశాడు. నా అవసరానికి అతన్ని పోలీసులకి పట్టిస్తానని బెదిరించాను. అతను కాళ్ళ మీద పడి తిరిగి బిజినెస్ ఒప్పుకొన్నాడు."

"వెరీగుడ్! అతనిదగ్గర కొచ్చిన వ్యక్తి ఎవరు?"

"దివాకర్ కాదు. అతనికి యాభై యేళ్ళుంటాయి. పేరూ వూరూ ఏమీ తెలియదట. వెయ్యి రూపాయ లిచ్చి నాలుగురోజుల క్రితం ఆ వుత్తరాల్ని వ్రాయించుకొని వెళ్ళాడట. అయితే అతను తెలుగువాడు."

"వెరీ ఇంట్రెస్టింగ్! దివాకర్ వెనుక మరో వ్యక్తి వున్నాడన్నమాట! సుజాత కుటుంబంతో పరిచయం వున్న వ్యక్తి...."

"ఎవరై వుంటారు?" జాన్ అడిగాడు.

ఇదే ప్రశ్న సాయంత్రం యేడు గంటలకు సుజాత నడిగాడు లాల్.

ఆమె తికమకగా చూసి, "యాభైయేళ్ళ మనిషి.... తెలుగువాడు.... మా కుటుంబానికి తెలిసినవాళ్ళలో.... అందులోనూ గుర్తొద్దును....ఆగండి! అతనెవరో నాకు తెలుసు!" అంది వుద్రేకంగా.

"ఎవరు?" లాల్ అడిగాడు ఆసక్తిగా.

"భూషణ్!" సుజాత అంది ఇంకా ఉద్రేకంగా, "వారం క్రితం మా ఇంటికి వచ్చినట్టుగా ఉష చెప్పింది."

"అతనెవరో నిదానంగా చెప్పండి."

"భూషణ్ నాన్నకు చాలా కాలంగా తెలుసు. ఖమ్మంలో వుంటాడు. చిన్నవయసులోనే అతని భార్య అసహ్యించుకుని వదిలేసింది. మళ్ళీ పెళ్ళి చేసుకోలేదు. తరచు మా ఇంటికొచ్చేవాడు సంవత్సరం క్రితంవరకూ. అతన్ని చూస్తే నా ఒళ్ళు కంపరం పుట్టేది. అతని అలవాట్లూ ప్రవర్తన మంచివి కావు. అతన్ని రానివ్వద్దని నాన్నకి గట్టిగా చెప్పాక మానేశాడు. ఈ సంవత్సరమంతా కనిపించలేదు....

"కానీ వారం క్రితం మళ్ళీ వచ్చినట్లు ఉష చెప్పింది. నాన్నతో ఏవేవో విషయాలు రహస్యంగా మాట్లాడాడట. నేను ఆయన్ని గద్దించాను. భూషణ్ విషయం ఆయన చెప్పాడు. పదివేలు అప్పడిగాడట — ఏదో వ్యాపారం చెయ్యడానికి.

"మిస్టర్ లాల్, నాకిప్పుడంతా అర్థమవుతోంది— నాన్న తిరస్కరించడంతో డబ్బుకోసం వాడా వుత్తరాల్ని సృష్టించి బెదిరిస్తున్నాడు!"

జాన్ ముక్కుమీద వేలేసుకొని దీర్ఘాలోచనలో పడ్డాడు.

## 5

సరిగ్గా రాత్రి ఎనిమిది గంటలకు లాల్ దివాకర్ ఇంటికెళ్ళాడు.

దివాకర్ సంతోషంగా ఆహ్వానించాడు.

"ఏమాలోచించుకొన్నారు, మిస్టర్ లాల్?"

"చెక్కు ఇస్తాను."

"చాలా సంతోషం! కూర్చోండి, ఇప్పుడే వస్తాను."

దివాకర్ వెనుకగదిలోకెళ్ళాక లాల్ టేబిల్ దగ్గర కూర్చొని, ఎడమ కాలెత్తి కుడికాలు తొడమీద వేశాడు. ఆ తర్వాత సిగరెట్టు వెల్గించి రెండు దమ్ములు లాగాడు.

దివాకర్ తిరిగి వచ్చాడు — మధ్యాహ్నం వచ్చిన భంగిమలో—గ్లోవ్స్, రివాల్వర్, ఫ్రుత్తరాలతో.

"ఆల్ రైట్, మిస్టర్ లాల్, మీరు చెక్కు తీసి టేబిల్ మీద పెట్టండి నేను వుత్తరాలిస్తాను."

లాల్ జేబులోంచి చెక్కు తీసి టేబిల్ మీద పెట్టాడు. దివాకర్ అందుకొని దాన్ని పరీక్షగా చూసి తలూపాడు.

"థాంక్స్, వుత్తరాలు తీసుకోండి—"

ఒకచేత్తో దివాకర్ నించి వుత్తరాలు తీసుకుంటూనే లాల్,మరోచేత్తో ఎడమకాలు ప్యాంటు అంచుల్ని పిక్కల వరకూ లాగి, అక్కడ రబ్బర్ బాండ్ లో చుట్టివున్న వుత్తరాల్ని చటుక్కున తీశాడు.

దివాకర్ వుత్తరాలందించి సిగరెట్ కోసం సొరుగు లాగుతుండగా, లాల్ క్షణంలో దివాకర్ వుత్తరాల్ని రబ్బర్ బాండ్ లో ఇరికించి, కాలును నేలమీద పెట్టేశాడు.

ఇద్దరిమధ్య టేబిల్ ఈ చర్యమీద తెర కప్పింది.

ఇప్పుడు లాల్ చేతిలో తను తెచ్చిన మారు వుత్తరాలున్నాయి. వాటిలో ఒకదాని మడత విప్పి చూస్తూ ముఖం చిట్లించసాగాడు. గబగబ మిగిలిన వుత్తరాల్ని చూశాడు. వెంటనే అతని ముఖం కోపంతో యెర్రబడింది.

"ఏమిటిది దివాకర్! మీరు పొరబడ్డారు! నాకివ్వవలసిన వుత్తరాలివి కావు!"

దివాకర్ సిగరెట్ వెలిగించి ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఏమిటి మీర నేది?"

"చూడండి!" వుత్తరాల్ని ముందుకు తోశాడు లాల్ "ఇవి హృదయం చూపించిన వుత్తరాలు కావు!"

దివాకర్ వాటిని చూసి అటూ ఇటూ తిరగేశాడు.

"ఈ వుత్తరాలు మీవి కావా?"

"గాడ్! నావి కావు! కావలిస్తే చదివి చూడండి!"

"క్రింద సంతకం చూడండి! అదే సంతకం!"

"నాన్సెన్స్! మీకు తెలుగు రాకపోతే ఎవరి చేతనైనా చదివించి అర్థం తెలుసుకోండి! ఇవి హృదయం చూపించిన ప్రేమ లేఖలు కావు! మీరు మోసం చేస్తున్నారు!"

"ఆగండి మిస్టర్ లాల్!" దివాకర్ మళ్ళీ వుత్తరాల్ని అందుకొని చూశాడు, "అవే అక్షరాలు, అదే వ్రాత, అదే సంతకం! కాదంటారేమిటి!"

లాల్ చటుక్కున లేచి నిలబడ్డాడు, "చెక్కిలా ఇవ్వండి! ఆ వుత్తరాలు డబ్బు చెల్లించాల్సినంత ముఖ్యమైనవి కావు! ఏం చేసుకుంటారో చేసుకోండి। క్విక్! చెక్కు—"

"ఆగండి, మిస్టర్! మోసం ఎక్కడుందో నాకు తెలుసు!" దివాకర్ తటాలున ముందుకొచ్చి రివాల్వర్ గురిపెట్టాడు, "చేతులెత్తండి! మీరు వుత్తరాలు తెచ్చి మీరే మోసం చేస్తున్నారు! మిమ్మల్ని పూర్తిగా సోదా చెయ్యాలి—కదలకండి!"

లాల్ చేతులెత్తి కఠినంగా అన్నాడు. "నన్నిలా ట్రీట్ చేస్తున్నారు! తర్వాత చింతిస్తారు మిస్టర్!"

"ఓహ్। నీరసం వస్తోంది! మీ కూతలు కట్టిపెట్టండి!"

దివాకర్. లాల్ షర్టునీ, ప్యాంటునీ పూర్తిగా సోదా చేశాడు. అతని ముఖం యెర్రబడి, కలవరంగా దిక్కులు చూశాడు.

"ఇదెలా జరిగింది, ఓహ్!"

"మీ సేఫ్‌లో కలిసిపోయాయేమో చూడండి!"

"నా దగ్గర సేఫ్ లేదు, వేరే వుత్తరాలూ లేవు!"

"అయితే బాగా ఆలోచించి అసలు వుత్తరాలు ఎక్కడ పెట్టారో తెలుసుకోండి. నాకు మరో అర్జంటు పని వుంది, చెక్కిలా ఇవ్వండి!"

దివాకర్ ముఖం ఒక్కసారిగా వెల్గింది, "మిస్టర్ లాల్! నా కిప్పుడర్థమైంది! అసలు వుత్తరాలెక్కడ వున్నాయో—అసలు మర్మం ఎక్కడుందో తట్టింది! మీరు వెళ్ళండి! పది గంటలకు ఫోన్ చేసి ఏ విషయం చెప్తాను....మీరు వెళ్ళండి ప్లీజ్!"

దివాకర్ అందించిన చెక్కు తీసుకుని, లోలోన నవ్వుకుని బయటికి నడిచాడు లాల్. ఆఫీసుకెళ్ళేసరికి అక్కడ సుజాత, జాన్ అసహనంగా ఎదురు చూస్తున్నారు.

"ఏమైంది?" సుజాత అర్చింది.

లాల్ జేబులోంచి చెక్కుతీసి టేబుల్ మీద పెట్టాడు. సుజాత ఆదిరిపడి అంది. "వుత్తరాలు తేలేదా?"

లాల్ నవ్వాడు, "డబ్బూ ఉత్తరాలు రెండూ తెచ్చాను!" అంటూ ప్యాంటు లేపి, రబ్బర్ బాండ్‌లోంచి ఉత్తరాలు తీసి సుజాత వొళ్ళో విసిరాడు.

"ఇవి-ఈ చెక్కు-ఓహ్-ఏమిటిది!"

"ట్రిక్. ఈ దెబ్బకి బ్లాక్ మెయిలర్ ఈ ఉత్తరాలకి డూప్లికేట్స్ వుంటే బయటికి తీస్తాడు. మీరు డూప్లికేట్స్ విషయం కూడా తేల్చమని కోరలేదూ?"

"ఆశ్చర్యంగా వుంది! వాడు డూప్లికేట్స్ తీస్తే ఏం చేస్తారు? ఇంకేం ట్రిక్ వుంది? డబ్బిచ్చేస్తారా!"

"నో — ముందు అతను డూప్లికేట్స్ లేవని నమ్మించాడు. ఇప్పుడు వాటిని అమ్మకానికి పెడితే నేను కోర్టులో కేసు పెడతాను!" నవ్వాడు లాల్, "మీకో విషయం చెప్పాలి. ఆ మారు వుత్తరాలు వాళ్ళిద్దరి మధ్య తగువు పెట్టాయి. ఆ వుత్తరాలు చూసి ముందు గొడవ పెట్టినా దివాకర్ కు తర్వాత ఏదో తట్టి నన్ను వెళ్ళిపొమ్మన్నాడు. ఆఫీసుకు ఫోన్ చేస్తానన్నాడు. అంటే భూషణ్ యేదో గూడుపుఠాణీ నడుపుతున్నాడని అతని అనుమానం. కాని, ఆ వుత్తరాలు చూసి భూషణ్ ఏమనుకొంటాడు? దివాకర్ అసలు వుత్తరాలు అమ్ముకొని మోసం చేశాడని కయ్యానికి దిగుతాడు! అరమైందా! కాబట్టి మీరేమీ భయపడకండి! దివాకర్ ఏమని ఫోన్ చేస్తాడో ఎదురు చూద్దాం!"

కానీ ఆ రాత్రి దివాకర్ నుంచి ఫోన్ రాలేదు.

# 6

మర్నాడు వుదయం 10 గంటలకు సుజాత నుంచి ఫోన్ వచ్చింది. "మిస్టర్ లాల్, ఈ విషయం చెప్పడాని కాలస్యం చేసినందుకు క్షమించండి.... ఈ వుదయం మా నాన్నగారు పోయారు...."

లాల్ వులిక్కిపడ్డాడు "ఏమిటీ!"

"రాత్రి నిద్రలో గుండె ఆగిందని డాక్టర్ చెప్పాడు" సుజాత కంఠంలో గాంభీర్యం సడలలేదు.

లాల్ అసహనంగా చెంపలు రుద్దుకొని జాన్ ని చూశాడు.

"చాలా ఆశ్చర్యంగా వుంది, మిస్ సుజాత! నమ్మలేక

పోతున్నాను...."

అవతల బలహీనంగా నవ్వు.

"లాల్, ఒకసారి మా ఇంటికొస్తారా-ఒక ముఖ్యమైన విషయం చెప్పాలి?"

"వస్తాను" లాల్ రిసీవర్ పెట్టేసి భారంగా వూపిరి పదిలాడు.

"ఆమె తండ్రికేమయింది?" జాన్ ఆతృతగా అడిగాడు.

"గుండె ఆగింది."

డిటెక్టివ్‌లు సుజాత ఇంటికి చేరుకొనే సరికి అక్కడ చాలా మంది వున్నారు: ఇరుగు పొరుగు వాళ్ళూ, స్నేహితులూ....

హాలు ప్రక్కన పడగ్గదిలో సుజాత యెదురై, తండ్రి దేహాన్ని చూపించింది. జాన్ దేహంమీద పుష్పగుచ్ఛం వుంచాడు. ఆమె తండ్రి వయసు సుమారు అరవై వుంటుంది. ప్రశాంతంగా శ్వాస వదిలినట్టు ముఖం చెప్తోంది.

పైకి గాంభీర్యం ప్రదర్శిస్తోన్నా, లోలోపల దుఃఖానికి ఆనకట్టు వేయలేక సతమతమవుతోన్న సుజాత, లాల్ చెయ్యిపట్టుకొని మరో గదిలోకి తీసికెళ్ళింది. జాన్ వాళ్ళ ననుసరించాడు.

ఆమె గదితలుపు మూసి, పరుపు క్రిందనుంచి కొన్ని కాగితాలు తీసి లాల్ చేతిలో పెట్టింది.

"ఏమిటివి?"

"ఉత్తరాలు!"

లాల్ చటుక్కున వాటిని విప్పి చూశాడు. అవి దివాకర్ దగ్గర తస్కరించిన అసలు వుత్తరాల తాలూకు ఫోటోస్టాటిక్ కాపీలు.

"ఎక్కడివి!" అన్నాడు ఆశ్చర్యంగా.

"నాన్న తలగడ క్రింద వున్నాయి...."

"ఎలా వచ్చాయి?"

"రాత్రి ఆయన దివాకర్ దగ్గరికెళ్ళారు."

"ఏమిటీ!"

"అవును లాల్, అంతా అయోమయంగా వుంది! రాత్రి నాన్న దివాకర్ యింటికెళ్ళి యీ వుత్తరాలు తెచ్చారు!"

"మీ కెలా తెలుసు?" జాన్ అరిచాడు.

"నేను చూశాను....రాత్రి ఒంటి గంటకనుకుంటాను, కారు శబ్దమైతే కిటికీ దగ్గర కెళ్ళి చూశాను. రాత్రి నాకో పట్టాన నిద్రలేదు. కారు శబ్దానికి మేల్కొని చూశాను. నాన్న కారు డ్రైవ్ చేసుకుంటూ గేటువరకు వెళ్ళి, అక్కడ దిగి గేటు తెరిచాడు. అప్పుడు స్పష్టంగా చూశాను. ఆయన ఒంటిమీద నల్లటి లాంగ్ కోటు వుంది-అది ఆయనదే. నాకేమీ అర్థంకాలేదు. ఆయన తిరిగి కారెక్కి వెళ్ళిపోయారు."

"అప్పుడు నా కామెనుసెన్స్ మేల్కొంది. బయటకురికి ఆయన్నాపాలనుకున్నాను. ఆయన గుండెజబ్బు మనిషి—ఎలాటి శ్రమ తీసుకోకూడదు. ఎన్నడూ లేనిది అలా అర్థరాత్రి ఆయన యెక్కడికి బయలుదేరాడో అంతుబట్టలేదు! ఒకవేళ స్లీప్ వాకింగ్ చేస్తున్నాడేమోనని భయపడ్డాను."

"అప్పుడేం చేశారు?"

"నేను వీధిలోకురికేటప్పటికి కారు మలుపు తిరుగుతోంది. నా కంటుబాటులో ఏ వాహనమూ లేదు! మెయిన్ రోడ్డు వరకూ పరిగెత్తాను. అక్కడా ఏమీ లభించ

లేదు పదినిమిషాల వరకూ. ఇంతలో ఒక ఆటో దొరికింది. కానీ యెక్కడికెళ్ళాలో తెలియదు! నాన్న కారు కను మరుగై యెక్కడికెళ్ళిందో తెలియలేదు. వెంటనే మెరుపు లాటి ఆలోచన వచ్చి దివాకర్ ఇంటికి బయలుదేరాను."

ఊపిరి తీసుకొని మళ్ళీ అంది సుజాత: "ఎక్కడో జరిగిన పొరపాటువల్ల ఈ బ్లాక్ మెయిల్ నాన్నకు తెలిసి పోయిందనుకున్నాను. అయితే నాన్నకు దివాకర్‌తో ఘర్షణ తప్పదు! కానీ-నేనక్కడి కెళ్ళేసరికి కారూ లేదు, నాన్నా లేడు!"

"మరి?"

"నేనా యింటికి దూరంగానే వుండి చూశాను. కారు లేదు——అయితే అక్కడికి రాలేదనుకొని తిరిగి వచ్చేశాను. ఆశ్చర్యం! అప్పుడు కారు ఇంట్లో వుంది."

"అయితే ఏం చేశారు?"

"తేలికపడి, లోనికెళ్ళి నాన్నగదిలో చూశాను. ప్రశాంతంగా నిద్రపోతున్నారు. కోటు హాంగర్‌కి వేలాడు తోంది. పెద్దగండం తప్పినందుకు సంతోషించి వచ్చి నిద్ర పోయాను.

"ఇంతలో తెల్లవారుతోండగా ఉష కేకలు విన్పించి పరిగెత్తికెళ్ళాను. నాన్న ప్రాణాలు విడిచారు. రాత్రి ఆయన డ్రైవ్ చేయడంవల్ల గుండెమీద స్ట్రెయిన్ పడింది. చనిపోయారు!" సుజాత గాఢంగా వూపిరి పీల్చి దుఃఖం దూరం చేసుకొంది.

"అప్పుడాయన తలగడ సవరిస్తునప్పుడు ఈ వుత్తరాలు దొరికాయి. నా ఆశ్చర్యాని కంతులేదు! రాత్రి నాన్న భూషణ్ దగ్గరికెళ్ళి బ్రతిమాలి వాటిని తెచ్చారు——"

"ఆగండి, భూషణ్ ఎక్కడుంటాడు?"

"హోటల్స్‌లో తిరుగుతుంటాడు."

"ఉష యెక్కడ వుంది?"

"పైన గదిలో. ఆమెని ఓదార్చడం యెవరి తరమూ కాలేదు! పిచ్చిగా కేకలు పెడుతూ నాన్నమీద పడి ఏడ్చింది! ఇప్పుడు డాక్టర్ ఆమెని సెడేషన్‌లో వుంచాడు."

లాల్ నిట్టూర్చాడు. "సరే, మేం ఇప్పుడు దివాకర్ దగ్గరికెళ్తాం. రాత్రి అక్కడేం జరిగిందో, అతనెందుకు ఫోన్ చేయలేదో తెలుసుకోవాలి" అని, మృదువుగా సుజాత చెయ్యి నిమిరి బయటికి దారితీశాడు.

శాంతినగర్‌లో దివాకర్ యిల్లు చేరుకొనేటప్పటికి సమయం సరిగ్గా 11-30 అయింది.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. జాన్ కాలింగ్ బెల్ నొక్కితే సమాధానం లేదు. లాల్ దివాకర్‌ని పిల్చినా బదులు లేదు. నెమ్మదిగా తలుపు నెట్టి లోనికెళ్ళారు. ఇంట్లో యెక్కడా కదలిక లేదు.

లాల్ గబగబ గదులన్నీ తిరుగుతూ చూడసాగాడు. చివరికి ఓరగా వేసివున్న కిచెన్ తలుపు తెరిచి అప్రయత్నంగా ఆగిపోయాడు.

లోపల ఒక శవం బోర్లా పడివుంది.... దాని తల రెండుగా చీలిపోయి, రక్తం విశాలంగా మడుగు కట్టింది.

లాల్ సైగచేసి జాన్‌కు చూపించాడు.

జాన్ లోనికి తొంగిచూసి, "ఓహ్! దిసీజ్ టూ కాంప్లికేటెడ్!" అనర్చాడు.

## 7

ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్ చకచక నడిచి లోనికి వచ్చి "హల్లో ఫ్రెండ్స్! మీరు మరో శవం కనుక్కున్నారట?"

అన్నాడు.

"మరో శవం కాదు—ఓ శవం" అన్నాడు జాన్.

"ఓహ్, సారీ! మరో కేసు గురించి ఆలోచిస్తూ ఏదో అనేశాను—ఈ మధ్య మెదడంతా గజిబిజిగా ఉంది! శవం ఏది?"

లాల్ కిచెన్ తలుపు విశాలంగా తెరిచాడు.

కృష్ణన్ లోనికి చూసి ఒక్క అడుగు వెనక్కి వేశాడు, "చాలా ఘోరం! యెవరతను?"

"తర్వాత అన్నీ తెలుస్తాయి....మీ సిబ్బందిని పిలవండి!"

లాల్ లోనికెళ్లి చుట్టూ కలయజూశాడు.

గదిలో తలుపుకు కుడివైపు ఉన్న టేబిల్ దగ్గర శవం పడివుంది. హతుడి వయసు సుమారు 50 ఉంటుంది. తల వెనుకభాగం నాలుగంగుళాల మేరకు రెండుగా చీలిపోయి, లోపలి భాగాలు కన్పిస్తున్నాయి. తల చుట్టూ రక్తం మడుగుకట్టి ఘనీభవించింది. ముఖం రక్తంలో మునిగివుంది. చేతులు విశాలంగా చాపి వున్నాయి. కాళ్ళు దగ్గరగా చేర్చి ఉన్నాయి. ఒంటిమీద తెల్లటి షర్టు ఖాకీప్యాంటు ఉన్నాయి. పాదరక్షలు లేవు. కుడిపాదం ప్యాంటు అంచు నూనెలో బాగా తడిసినట్లు కనిపిస్తున్నాయి.

లాల్ కళ్ళు శవం ఎడమకాలి ప్రక్కన అడుగు దూరంలో పడ్డాయి. అక్కడ నూనె మడుగుకట్టింది. తలెత్తి టేబుల్ మీద చూశాడు.

టేబిల్ మీద కిరోసిన్ స్టవ్, దానిమీద పెనం, పెనంమీద ఒక ఆమ్లెట్ ఉన్నాయి. ఆమ్లెట్ పూర్తిగా నల్లగా మాడిపోయి వుండి. స్టవ్ ప్రక్క చిన్నప్లాస్టిక్

బుట్టలో నాలుగు గ్రుడ్లున్నాయి. అక్కడే రెండుసీసాల్లో కారప్పొడి, ఉప్పు వగైరా ఉన్నాయి. టేబిల్ అంచు మీద నుంచి నూనెడబ్బా ఒలికి నూనె అంతా నేల పాలయ్యింది.

ఈ దృశ్యాన్నంతా చూస్తున్న జాన్, ఛటుక్కున వంగి టేబిల్ క్రింద నుండి రెండు గ్రుడ్డు పెంకులు తీశాడు.

"పెనంమీద ఒక ఆమ్లెట్ వుంది. మరొకటి కడుపులో ఉండాలి" అన్నాడతను.

లాల్ తలూపి, "శవం కదల్చబడిందని నా అనుమానం" అన్నాడు.

"ఎలా?"

"శవం తల చూడు—గాయం వెనకభాగంలో ఉంది. అంటే అతను స్టవ్ ముందు నిలబడి వంట చేస్తున్నాడు. కుడిచేతివైపు నూనె డబ్బా ఉంది. ఇంతలో వెనకనించి దెబ్బపడింది....అప్పుడేం జరుగుతుంది?"

"అతను వెనక్కి విరుచుకు పడతాడు. అలా పడుతున్నప్పుడు కుడిచెయ్యి నూనెడబ్బాని తాకివుండాలి.... డబ్బా పడిపోయి నూనె నేలపాలయ్యింది" అన్నాడు జాన్.

"దటీజ్ రైట్. అందుకే కుడిపాదం నూనెలో తడిసి ఉంది. అంటే అతను వెల్లకిలా పడ్డాడన్న మాట. అంటే కుడిపాదం ఆ నూనెమడుగులో లేదా, దాని దిశలో ఉంటుంది. కానీ యిప్పుడు శవం బోర్లా పడివుంది. నూనె మడుగువేపు కుడికాలుగాక ఎడమకాలు ఉంది. అదీ అడుగుదూరంలో! అంత బలమైన దెబ్బ పడ్డాక అతను కదిలే ప్రయత్నం చేసి వుంటాడనుకోను."

"అయితే శవం యెలా కదిలింది?"

"తర్వాత ఆలోచిద్దాం" అని, శవాన్ని పరీక్షిస్తున్న డాక్టర్ రఘునాథ్ వైపు తిరిగాడు లాల్.

డాక్టర్ అన్నాడు, "ఇన్‌స్పెక్టర్, చావు రాత్రి సంభవించిందని మీకు తెలుసు. సరిగ్గా ఏ సమయంలో సంభవించిందో పోస్ట్‌మార్టమ్‌లో చెప్తాను. అయితే, యిటు చూడండి.... మెడదగ్గర గడ్డకట్టిన రక్తంలో కొన్ని పోగులు అంటుకొని ఉన్నాయి. ఏమిటివి?"

కృష్ణన్ వంగి పరీక్షించాడు, "ఉన్నిపోగులు...."

"స్వెటర్‌వి అనుకుంటాను" డాక్టర్ అన్నారు.

జాన్ అడ్డంగా తలూపి లాల్‌తో అన్నాడు, "ఈ పోగులు సుజాత తండ్రి కోటువి అనుకుంటాను. రాత్రి ఘర్షణలో...."

లాల్ భారంగా నిట్టూర్చి డాక్టర్‌ని అడిగాడు: "గాయం దేనివల్ల అయింది?"

డాక్టర్ గాయాన్ని కాస్సేపు పరీక్షగా చూశాడు.

"గాయాన్నిబట్టి చూస్తే హత్యాయుధం గొడ్డలి అయి వుండాలి."

రకరకాల నిపుణులు యెవరి పనులు వారు చకచక చేసుకుపోతున్నారు. లాల్ కృష్ణన్‌తో బయటకొచ్చి మిగతా గదులు సోదా చేశాడు. ఇంట్లో ఎక్కడా సేఫ్ లాంటిది లేదు. ఎక్కడా సోదా జరిపిన సూచనలులేవు. డ్రాయింగ్ రూం టేబుల్ సొరుగులో రివాల్వర్, గ్లోవ్స్ ఉన్నాయి. రివాల్వర్ ఖాళీగా ఉంది. బెడ్ రూంలో మంచంమీద దుప్పటి, దిండు చెదరకుండా ఉన్నాయి. మిగతా వస్తువులన్నీ యథాస్థానంలో ఉన్నాయి.

ఇంతలో జాన్ డాక్టర్‌తో గదిలోకొచ్చాడు. లాల్

ఏమిటన్నట్టు చూశాను.

జాన్ అన్నాడు: "లాల్, భూషన్ హోటల్స్‌లో దిగుతాడని సుజాత చెప్పింది కాబట్టి అతని దగ్గర రూం తాళంచెవి ఉండాలి. కానీ దుస్తుల్లో యెక్కడా లేదు."

"ఘర్షణలో ఎక్కడైనా పడచ్చు. గదిని క్షుణ్ణంగా గాలించావా??"

"మిస్టర్ లాల్, హతుడు ఎలాటి ఘర్షణలోనూ పాల్గొనలేదు!" అన్నాడు డాక్టర్.

"ఓహ్! యెలా చెప్తున్నారు?"

"అతని దుస్తులు, దేహం చెప్తున్నాయి: బట్టలు ఎక్కడా చిరిగిలేవు. ఎక్కడా గుండీలు వూడలేదు. ఒంటిమీద యెక్కడా గాట్లుగానీ వాపులుగానీ లేవు."

"వెరీవెల్! అయితే శవాన్ని కదిల్చి హంతకుడు తాళంచెవి తీసుకొనుండాలి. జేబుల్లో ఇంకేమున్నాయి?"

"కొంత డబ్బు. ఇంకేమీ లేదు" అన్నాడు జాన్.

"సరే, హత్యాయుధం కన్పించిందా?"

"లేదు— ఇల్లంతా గాలించాను."

కృష్ణన్ అన్నాడు: "నా అనుమానం హంతకుడు గొడ్డలి కూడా తెచ్చుకొనుండాలని. ఏమంటారు? ఈ ఇంట్లో గొడ్డలి ఉండేందుకు తగిన కారణం కన్పించటం లేదు. ఇంట్లో ఎక్కడా కట్టెలపొయ్యి లేనప్పుడు గొడ్డలి అవసరమేమిటి? పోనీ, కొమ్మలు నరకడానికి పెద్ద వృక్షం కాదు కదా—ఎడారిలాంటి ఈ ఇంట్లో ఆడ ఛాయలెక్కడా లేవు కనీసం ఓ పూలమొక్కకి ప్రాణం పోయడానికి. నో, నో— హంతకుడు గొడ్డలితో వచ్చి హత్యచేసి తిరిగి దానితో వెళ్ళిపోయాడు."

లాల్ సాలోచనగా తలూపి ఫోన్‌వైపు కదిలాడు.

ఒక నెంబరు డయల్ చేసి కాచుకున్నాడు. కొన్నిక్షణాల తర్వాత సుజాత కంఠం నీరసంగా పలికింది. "ఎవరది?"

"లాల్ ని.... సుజాత, పరిస్థితి ఇప్పుడు చాలా విచిత్రంగా తయారైంది!"

"ఏం జరిగింది?"

"ఎలా చెప్పాలో తెలియటంలేదు. మీరు తట్టుకొంటారా? భూషణ్ ఇక్కడ చచ్చి పడి ఉన్నాడు."

అవతల ఒక్క క్షణం నిశ్శబ్దం. ఆ తర్వాత సుజాత కంఠంలో గాంభీర్యం ప్రదర్శించే ప్రయత్నం చేస్తూ అంది. "లాల్. నాన్న వాడ్ని చంపాడంటే మీరు నమ్ముతారా?"

"శవంమీద కొన్ని పోగులున్నాయి—నల్లటివి. మీ నాన్న కోటు కూడా నల్లదేననుకొంటాను. త్వరలో దాన్ని పోలీసులు స్వాధీనం చేసుకొని లాబ్ కి పంపుతారు...."

"ఓహ్! అయితే ఇప్పుడేమిటి? ఏం జరుగుతుంది?"

"హత్య గొడ్డలితో జరిగింది. మీ ఇంట్లో గొడ్డలి ఉందా?"

సుజాత వూపిరి బిగబట్టింది. "ఉంది...."

"ధైర్యంగా ఉండండి! ఈ మొత్తం వ్యవహారం నేనిప్పుడు పోలీసులకు చెప్పేస్తాను. మీ చెల్లెలి జీవితాన్ని కాపాడ్డానికి మీ నాన్న ప్రాణాల్ని లెక్కచెయ్యకుండా మిత్రద్రోహిని శిక్షించడానికి పూనుకొన్నారు. ఆయన అంత్య క్రియలు మీరు హృదయపూర్వకంగా ముగించండి. ఆయనపట్ల ఎలాంటి ఏహ్యాభావం కల్పించుకోకండి."

ఇన్ స్పెక్టర్ చెవులు రిక్కించి లాల్ మాటలు వింటున్నాడు.

లాల్ ఫోను పెట్టేసి డాక్టర్ ని నవ్వుతూ చూశాడు.

డాక్టర్ తడబడ్డాడు.

"వెల్, డాక్టర్ హంతుడు ఘర్షణలో పాల్గొనకపోతే అతని మెడదగ్గర ఉన్ని పోగులెలా వచ్చాయి?"

డాక్టర్ ఇబ్బందిగా మొహం పెట్టాడు.

# 8

తిరిగి యేజెన్సీ ఆఫీసుకొచ్చి డిటెక్టివ్‌లు తీవ్రమైన ఆలోచనల్లో పడ్డారు. క్రింద రోడ్డుమీద రోజురోజుకీ పెరిగిపోతున్న ట్రాఫిక్ ఆలోచనల్ని చెదరగొడ్తోంది.

పది నిమిషాలు గడిచాక జాన్ అడిగాడు, "అయితే దివాకర్ పారిపోయాడంటావా? సుజాత తండ్రి గొడ్డలితో ప్రత్యక్షం కావటంతో చేతులెత్తి దండంపెట్టి కాలికి బుద్ధి చెప్పాడు—అంతేనా?"

"సరిగ్గా అంతే!" అన్నాడు లాల్ తేరుకొని, "సుజాత తండ్రి గొడ్డలితో అక్కడికెళ్ళాడంటే ముందూ వెనుకా ఆలోచించకుండా భూషణ్ తల పగులగొట్టాలనే అనుకొన్నాడు. కాబట్టి పగులగొట్టాడు. దివాకర్ ఆ క్షణంలో పలాయనం చిత్తగించి ప్రాణాలు రక్షించుకున్నాడు. ఇక ఇంటి పరిస్థితి చూస్తే సుజాత తండ్రి డూప్లికేట్ ఉత్తరాలకోసం ఎక్కడా సోదా చేసిన సూచనలు లేవు. అతను భూషణ్ జేబులోంచి హోటల్ తాళం తీసుకొని, అక్కడికెళ్ళి ఉత్తరాలు తెచ్చుకున్నాడు."

"అందువల్ల అతని కోటు పోగులు శవాన్ని కదిలిస్తున్నప్పుడు అంటుకొని ఉండాలి." అన్నాడు జాన్.

"కావచ్చు...." లాల్ అన్నాడు. "ఇక ఇందులో మనం చేసేదేమీ కన్పించటంలేదు. ఓపెన్ అండ్ షట్

కేసు. ఇరుపక్షాలవారికీ న్యాయం చేకూరింది——"

హఠాత్తుగా ఫోన్ మ్రోగటంతో లాల్ రిసీవరందు కొని "హలో!" అన్నాడు.

"మిస్టర్ లాల్! గుడ్ న్యూస్!" కృష్ణన్ గొంతు పలికింది.

"వ్హాట్!"

"దివాకర్ని పట్టుకున్నాం! అతనింటికి వచ్చాడు.... అతను చెప్పే కథ నా ద్వారా గాక అతనితోనే స్వయంగా చెప్పించాలనుకుంటున్నాను...."

"అతన్నిక్కడికి తీసుకరండి!"

"అలాగే. తర్వాత మరో బ్యాడ్ న్యూస్...."

"ఏమిటి?"

"దివాకర్ ఎదురింటి అతను నిన్న రాత్రి సెకెండ్ షో చూసి వస్తూ ఇంటి ముందు ఒక కారును చూశాడు. ఇంతలో ఒక అమ్మాయి గాభరాగా అందులో ఎక్కుతూ కన్పించింది——ఆమె దివాకర్ ఇంట్లోంచి గేటు తెరుచు కొని వచ్చిందట. నల్లటి లాంగ్ కోటులో వుంది. అప్పుడు సమయం సరిగ్గా 1:20 అవుతోంది. స్ట్రీటు లైటు వెలుగులో అతడామెను స్పష్టంగా చూశాడట——"

"ఆమె యెవరో తెలుసా?" ముఖం ఎర్రబడింది.

"తెలుసుకొన్నాను. హత్యాయుధం మీరు చెప్పిన కోటును, స్వాధీనం చేసుకోవడానికి సుజాత ఇంటి కెళ్లాను. అక్కడి వాతావరణంలో నా ప్రవేశం కలకలం రేపింది. సుజాత వెంటనే ఆ కోటును స్వాధీనం చేసింది. ఆ తర్వాత గొడ్డలి కోసం గాలించేందుకు అన్నివిధాలా తోడ్పడింది——కాని గొడ్డలి ఇంట్లో ఎక్కడా లేదు! నేను సెలవు తీసుకుంటూ ఎలాటి కారణం చెప్పకుండా

అక్కా–చెల్లెలిద్దరి ఫోటోలు తీసుకొన్నాను. ఆ రెండు ఫోటోల్లో మన ఫ్రెండ్ ఉషను చూసి—"

లాల్ టక్కున రిసీవర్ పెట్టేసి జాన్ వైపు తిరిగాడు: "బ్రదర్! రైలు పట్టాలు తప్పింది!"

"ఏం జరిగింది?"

"ఈ కేసులో మరో దారి చీలింది. రాత్రి లాంగ్ కోటులో దివాకర్ ఇంటికి ఉష వెళ్ళిందని ఫ్రెష్ న్యూస్...."

జాన్ తెల్ల మొఖం వేశాడు.

లాల్ ఫోనందుకుని సుజాతకు డయల్ చేశాడు.

"హలో, సుజాతా! ఈ రోజు మీ కన్నీ దుర్వార్తలే!"

"ఈసారి ఏమిటి లాల్?"

"ఏమీ లేదు, రాత్రి దివాకర్ ఇంటికెళ్ళింది మీ నాన్న అని నిశ్చయంగా చెప్పగలరా?"

"ఎందుకు? ఆయన వెళ్ళలేదా? అయితే...."

"రాత్రి కార్లో మీరెవర్ని చూశారు!" తీవ్రంగా అడిగాడు లాల్.

"నేను—నేను—అయితే నేను చూసింది పొర పాటా?"

"పటవ్! దేవుడు మేలుచేసి ఇప్పుడా అభిప్రాయా నికి రాకండి. పరిస్థితి మారటంతో మీ స్టేట్మెంట్ కూడా మార్చేయకండి! మీరు చూసింది చూసినట్లు అంతా నిజం చెప్తే మీ చెల్లెలికి చాలా మేలు చేసిన వారవుతారు!"

"ఓహ్ లాల్! ఉష ఏం చేసింది!"

"రాత్రి ఆమె దివాకర్ ఇంటికెళ్ళిందని ఇప్పుడే సాక్ష్యం లభించింది. దానికి తిరుగు లేదు! ఆమె లాంగ్

కోటులో లేకపోతే మీరు గుర్తించేవారు. కానీ గొడ్డలిని దాచడానికామె దాన్ని తోడుక్కొని వెళ్ళింది. అది చూసి మీరు తండ్రి అని పొరబడ్డారు.... మీ ఇంట్లో ఫోన్‌కి ఎక్స్‌టెన్షన్ ఉందా?"

"ఉంది—దేనికి?"

"దివాకర్ మీకు ఫోన్ చేసి బెదిరించినప్పుడు విషయాలన్నీ ఆమె ఎక్స్‌టెన్షన్‌లో విని వుండాలి."

"ఓహ్! నేను నమ్మను! ఉష! అది ఒట్టి పిచ్చిది! దానికి ఒకర్ని చంపే ధైర్యం తెగువ...."

లాల్ గట్టిగా కళ్ళు మూసుకొని, రిసీవర్ పెట్టేసి, పిడికిలి బిగించి టేబిల్ మీద కొట్టాడు. "భూటాన్ విస్కీ!"

జాన్ యంత్రంలా లేచివెళ్ళి విస్కీ బాటిల్, గ్లాసులతో తిరిగి వచ్చాడు.

లాల్‌కో గ్లాసు అందించి, విస్కీ పోసి, "పార్ట్‌నర్! తండ్రిని విపరీతంగా ప్రేమించి—అతనే సర్వస్వమనుకున్న ఒక కుమార్తె తన శత్రువును హత్యచేసి, దాన్ని తండ్రి మీదకు నెడుతుందా?" అనడిగాడు.

"నో, నో పార్ట్‌నర్, నో!"

"అయితే తండ్రి తలగడ క్రింద ఆ ఉత్తరాలెలా వచ్చాయి?"

లాల్ ఒక్క గుక్కలో గ్లాసు ఖాళీచేసి, "అవును.. ఎలా వచ్చాయి?" అని గొణిగాడు.

ఇంతలో రివ్వుమని స్వింగ్ డోర్ తెరుచుకోవడం, డిటెక్టివ్‌లు గ్లాసులు దాచెయ్యడం ఒకేసారి జరిగాయి.

కృష్ణన్ నవ్వాడు, "రైట్! భూటాన్ విస్కీతో కాన్ఫరెన్స్ జోరుగా సాగుతోందన్నమాట?"

"కృష్ణన్, పరాచికాలకి నేనిప్పుడు మూడ్‌లో లేను" లాల్ అన్నాడు.

జాన్ నాలిక కరుచుకొని, టేబిల్ మీది విస్కీ బాటిల్ చటుక్కున తీసి క్రింద పెట్టాడు.

"కమాన్ బాయ్!" కృష్ణన్ చెయ్యిపట్టి ద్వారంలో నిలబడ్డ దివాకర్‌ని లోనికి లాగాడు.

దివాకర్ డిటెక్టివ్‌లను అయోమయంగా చూసి, లోనికొచ్చి కూర్చున్నాడు. అతని ఎర్రబడ్డ కళ్ళు, పీక్కుపోయిన ముఖం, రేగిపోయిన జుత్తు, మాసిపోయిన దుస్తులు యివన్నీ అతను రాత్రంతా నిద్రపోలేదని సూచిస్తున్నాయి.

లాల్ అన్నాడు, "మిస్టర్ దివాకర్, పొట్టకోసం దుర్మార్గం చేసేటప్పుడు ఎదుటివ్యక్తి సామర్థ్యం అంచనా వెయ్యడం మరువకూడదు. మీ తెలివితక్కువతనం వల్లనే మీ డర్టీ బిజినెస్‌లో మీ పార్ట్‌నర్‌ని పోగొట్టుకున్నారు. రాత్రంతా మీ రెక్కడున్నారు?"

"లాడ్జింగ్‌లో...."

"ఏ లాడ్జింగ్‌లో?"

"భగవాన్ లాడ్జి—బేగం బజారులో వుంది. అక్కడ భూషణ్ ఒకగది తీసుకున్నాడు."

"మీ రక్కడ కెందుకెళ్ళారు?"

"మిస్టర్ లాల్, మీరు మారు ఉత్తరాలతో నన్ను మోసం చేశారు!"

లాల్ అతన్ని ఏవగింపుగా చూశాడు. "అవును, చేశాను. మీరేం చేశారు?"

"మీ రెళ్ళిపోయాక భూషణ్‌కు ఫోన్ చేశాను. అతనువచ్చి ఆ ఉత్తరాల్ని చదివి నన్ను తిట్టాడు! అవి అత

నిచ్చిన బూతులేఖలు కావట! ఆ మారువు త్తరాలతో మీరు నన్ను చవటనుచేసి అసలు ఉ త్తరాలతో వెళ్ళిపోయారు!"

"అప్పుడు భూషణ్ ఏం చేశాడు?"

"నన్ను ఇష్టంవచ్చినట్లు బూతులు తిట్టాడు! నాకు తెలుగురాక ఈ వ్యవహారంలో అన్ని విధాలా చెడ్డాను! అతను స్నేహితుడి కుటుంబాన్ని బ్లాక్ మెయిల్ చెయ్యడానికి నన్ను ఎన్నుకొని, తను చాటుగా ఉండిపోయాడు. బిజినెస్ సక్సెస్ చేస్తే అయిదువేలు ఇస్తానన్నాడు. అతను స్మగ్లింగ్‌లో దిగడానికి ఏజెంటుకి యిరవై వేలు డిపాజిట్ కట్టవల్సి వచ్చింది. ఆ డబ్బుకోసం ఈ ఎత్తు వేశాడు.

"నా వల్ల వ్యవహారం చెడిపోవడంతో నాకిస్తానన్న కమీషన్ ఇవ్వనని చెప్పాడు—ఇక నా సహాయం అవసరం లేదన్నాడు. అతని జేబులో అసలు ఉ త్తరాలకి డూప్లికేట్ కాపీలున్నాయి. వాటి సహాయంతో మిమ్మల్ని పిల్చి స్వయంగా బిజినెస్ సెటిల్ చేసుకుంటానన్నాడు. నా మీద రూం తాళంచెవి విసిరి వెంటనే వెళ్ళిపొమ్మన్నాడు. చేసేదిలేక నేనక్కడనుంచి వెళ్ళిపోయాను."

"ఎన్ని గంటలకి?"

"సుమారు పదకొండు గంటలకి. భూషణ్ చేత తిట్లు తిని, నా చేతగానితనం నిరూపించుకోవడంతో మనసు విరిగిపోయింది. మెహదీ పట్నంలో ఒక బార్‌లో కూర్చుని చిత్తుగా తాగేశాను. తెలివితప్పాను. చివరికి అపస్మారక స్థితిలో నన్ను బార్ వాళ్ళు భూషణ్ గదికి తరలించారు. అప్పుడు సమయం రెండు దాటిందనుకొంటాను. గదిలో రాత్రంతా నాకు నిద్రపట్టలేదు. తెల్లారాక ఇంటికి ఫోన్ చేశాను—"

"ఎన్ని గంటలకి?"

"పది—పదిగంటలకి!" దివాకర్ తడబడ్డాడు. "కాని సమాధానంలేదు! అతను ఇంట్లో లేడనుకున్నాను. గదికే వస్తాడనుకున్నాను. కాని యెంతకూ రాకపోవడంతో నేనే యింటికెళ్ళాను. అక్కడ పోలీసులు-భూషణ్—"

"సరే, మీరు చేసే వృత్తి ఏమిటి?"

"నేనీమధ్యే బొంబాయి నుంచి వచ్చాను—ఏదైనా ఉద్యోగం చేద్దామని."

"ఏం ఉద్యోగం?"

"ఏదైనా ఉద్యోగం—చివరికి బూట్ పాలీషైనా, ఒళ్ళు మాలీషైనా సరే! ఇంతవరకూ ఏ అవకాశమూ లభించలేదు. ఇక్కడ బొంబాయికంటే మరీ అధ్వాన్నంగా వుంది!"

"మీ దగ్గర రివాల్వర్ యెక్కడిది?"

"అది—దాన్ని—అది నాదేగానీ అందులో గుళ్ళుండవు! ఖాళీగానే వుంచుకుంటాను. ఆత్మరక్షణకోసం బొంబాయిలో కొన్నాను. అక్కడ అరాచకం రోజు రోజుకీ ఎలా పెరిగిపోతుందో మీకు తెలుసు...."

"అయినా మీరు దాన్ని ఖాళీగానే వుంచుకుంటారన్న మాట?"

"అవును. దాన్ని చూసి నా దరికెవరూ రారు! అపార్థం చేసుకోకండి—దానికి పర్మిట్ కూడా వుంది."

"ఐ సీ! రాత్రి మీరు 11 ప్రాంతాల యింటినుంచి వెళ్ళారా?"

"అవును."

"ముందా, వెనకా?"

"పది నిమిషాల ముందు."

"భూషణ్ మీ ఇంటి కెప్పుడొచ్చాడు?"

"తొమ్మిది గంటలకు."

"అప్పుడు మీ రేం చేస్తున్నారు?"

"ఎందుకు? ఏమీ లేదు!"

"మీ రప్పుడు కిచ్చెన్‌లో ఆమ్లెట్స్ వేయడం లేదా?"

"ఏమిటీ!"

"ఆమ్లెట్స్. రెండు ఆమ్లెట్స్ వేసి ఒకటి తిన్నారు. ఇంతలో భూషణ్ వచ్చి మిమ్మల్ని తరిమివేయడంతో రెండో ఆమ్లెట్ పెనంమీదే వుండిపోయి మాడి పోయింది...."

"గాడ్! మీరు నన్ను చవటనుచేసి వెళ్ళిపోతే నేను ఆమ్లెట్స్ వేసుకొని తింటూ కూర్చుంటానా! భూషణ్ వచ్చేటప్పుడు అరడజను గుడ్లు తెచ్చాడు."

"ఎక్కడ?"

"వీధి చివర షాపులో. నన్ను వెళ్ళగొట్టి అతనే వేసుకొని తింటున్నాడనుకొంటాను — ఇంతలో హంతకుడు వచ్చి—"

లాల్ కృష్ణన్ వైపు తిరిగాడు, "ఇన్‌స్పెక్టర్ ఇతన్ని కస్టడీలో ఉంచండి!"

"దేనికీ?"

"బ్లాక్‌మెయిల్ గేమ్‌లో మీ చేతులు మురికి అయ్యాయి."

"మరి ఉష గురించేమిటి?" కృష్ణన్ అడిగాడు.

"ఆమె సెడేషన్‌లో ఉంది. అరెస్టు చెయ్యడానికి డాక్టర్ ఒప్పుకోడు. మీరు ముందు వీలైనంత త్వరగా మెడికల్ రిపోర్టు నా ముందు వుంచి—వేరే విషయాలు ఆలోచించండి!" అని లేచాడు లాల్.

# 9

సాయంత్రం ఏడు గంటలకు కృష్ణన్, డాక్టర్ రఘునాథంతో యేజెన్సీ ఆఫీసులో ప్రవేశించాడు.

"హల్లో గ్యాంగ్! ఎంతవరకొచ్చింది?"

జాన్ భుజాలెగరేసి అన్నాడు: "ధైర్యసాహసాలు బొత్తిగా లేని ఒక అమాయకురాలు దారుణంగా హత్యయెలా చేస్తుందా అని ఆలోచిస్తున్నాను. ఒకవేళ తెగించి కారెక్టర్ కోసం చేసినా, అదే కారెక్టర్‌ను దెబ్బతీసే ఉత్తరాల్ని నాశనం చెయ్యకుండా ప్రాణప్రదంగా ప్రేమించే తండ్రి దగ్గర ఎందుకు పెట్టిందో అర్థం గావడంలేదు."

కృష్ణన్ ముఖం మాడ్చుకొని, "ఆమె నడకప్పోయారా?" అన్నాడు.

డాక్టర్ బ్యాగులోంచి కొన్ని కాయితాలు తీసి టేబిల్ మీద పెట్టేడు.

లాల్ అడ్డంగా తలూపి, "చదివే ఓపిక లేదు. మీ రిపోర్టు ఏమిటో నోటితో చెప్పండి!" అన్నాడు.

డాక్టర్ అన్నాడు: "చావు నిన్న రాత్రి 1-2గంటల మధ్య సంభవించింది. తలమీద గొడ్డలి పోటు బలంగా పడింది. గాయం మూడంగుళాలు లోతు, నాలుగంగుళాల పొడవు, ఒక అంగుళం వెడల్పు వుంది. గాయాన్ని బట్టి హత్యాయుధం గొడ్డలి అని ధృవపడుతోంది. గాయం వెనుకనుంచి తగిలింది గనుక హతుడు ప్రమాదాన్ని ముందు పసిగట్టే స్థితిలో లేడు—అది నిశ్చయంగా దొంగచాటు దెబ్బ! కాబట్టి ఎలాటి ప్రతిఘటన లేకుండా ప్రాణం వదిలాడు.

అయితే మెడదగ్గర ఉన్న పోగులకు ఎక్స్‌ప్లనేషన్

మీరూహించే వుంటారు—శవం కదల్చబడింది. లాంగ్ కోటులోవున్న హంతకుడు లేదా హంతకురాలు శవం మీద సోదా జరుపుతున్నప్పుడు పోగులు అంటుకొని వుండాలి. అంతేగాని, ఆ ఇద్దరిమధ్య ఘర్షణ జరగలేదు. శవస్థితి శవం కదల్చబడిందని సూచిస్తోంది.

"అంతేగాక అందుకు హేతుబద్ధమైన ఆధారం కూడా వుంది—పోస్టుమార్టమ్ లివిడిటీ.

"చావు సంభవించాక దేహంలోని రక్తం ద్రవస్థితిని కోల్పోయేవరకూ గురుత్వాకర్షణవల్ల దేహం క్రింది భాగానికి చేరుకొని అక్కడ గడ్డ కడుతుంది. ఆయా దేహ భాగాలు నేలవల్లగానీ, మరే వస్తువువల్లగాని వత్తిడికి లోనయివుంటే అక్కడ చర్మంలో రక్తం గడ్డకట్టిన మచ్చలు కన్పిస్తాయి."

"వెరీవెల్! ఈ శవంమీద మీకలాంటి మచ్చలెక్కడ కన్పించాయి."

"భుజాలమీద—పిరుదలమీద—కాళ్ళ పిక్కల మండల మీద—మోచేతులదగ్గర కన్పించాయి."

"కాబట్టి చావు సంభవించాక శవం చాలాసేపు వెల్లకిలా వుందన్న మాట?"

"అవును."

"ఆల్ రైట్, ఇక జీర్ణకోశంలో ఆహార స్థితి గురించి చెప్పండి."

"జీర్ణకోశంనిండా ఆహారం జీర్ణక్రియ ప్రాథమిక దశలోనే వుంది. అంటే చావుకు ముందు సుమారు గంట క్రితం తీసుకునుండాలి."

"ఎలాంటి ఆహారం?"

"అన్నం—పప్పు—బంగాళాదుంప — సాంబారు—

అప్పడం— పెరుగు. ఇవన్నీ ఏ శాఖాహార హోటల్‌లో నైనా ఆహారంలో కలుస్తాయి."

లాల్ తలూపాడు, "అంతేనా? ఆహారంలో ఇంకేమీ కలిసిలేదా?"

"లేదు."

"వెల్, హతుడు భోజనం తిన్నాక ఒక ఆమ్లెట్ తిన్నాడు."

"అలాటిదేమీ లేదు."

"నమ్మకంగా చెప్తున్నారా?"

"అవును. కడుపులో ఆమ్లెట్ లాటిదేమీ లేదు!"

"సరే," లాల్ కృష్ణన్ వైపు తిరిగాడు. "మీరేం చెప్తారు?"

కృష్ణన్ అన్నాడు: "దివాకర్ స్టేట్‌మెంట్‌ని చెక్ చేశాను. అనుమానాల్లేవు. రాత్రి తొమ్మిది ప్రాంతాల భూషణ్ దివాకర్ ఇంటికొస్తూ వీధి చివర షాపులో అర డజను గుడ్లు తెచ్చుకున్నాడు. దివాకర్ రాత్రి సుమారు పదకొండున్నరకి మెహదీ పట్నంలో విక్రాంత్ బార్‌లో బాగా తాగి అల్లరి చేశాడు. అతను రెగ్యులర్ కస్టమర్ అవడంవల్ల బార్ వాళ్ళు బయటికి గెంటలేకపోయారు.

సుమారు రెండు గంటలకి శాస్త్ర తెలివిలోకొచ్చాక, అడ్రసు తెలుసుకొని బేగం బజారులో భగవాన్ లాడ్జికి చేర్చారు. అక్కడ భూషణ్‌కో గది వుంది. ఆ రాత్రంతా అతను గది కదల్లేదని లాడ్జింగ్ వాళ్ళన్నారు. దట్సాల్! హత్యా సమయంలో దివాకర్ ఇంట్లో లేడని బలమైన ఎలిబీ వుంది. ఆ సమయంలో ఉష—"

"ఓ. కే. హత్యాయుధం ఇంకా దొరకలేదా?" జాన్ అడిగాడు.

"లేదు. దాని అదృశ్యం నా కర్థంగావడం లేదు. రాత్రి ఉష దివాకర్ ఇంటికి లాంగ్ కోటులో వచ్చింది గనుక అందులో గొడ్డలిని దాచి తెచ్చివుంటుంది. పని య్యాక దాన్ని తిరిగి ఇంటికి తీసికేళ్ళే అవసరం లేదు. దారిలో ఎక్కడేనా పారెయ్యొచ్చు."

"ఆ కోటును లాబ్ కు పంపారా?" లాల్ అడిగాడు.

"పంపాను."

"రిజల్ట్ యేమిటి?"

"అనుకున్న రిజల్ట్ కాదు...." చిన్నగా గొణిగాడు కృష్ణన్.

"అంటే!"

"ఆ ఉన్ని పోగులు ఆ కోటువి కావు!"

"మరి!"

"ఆ కోటువి కావు! మరి దేనివో నాకు తెలియదు!"

"ఇన్ స్పెక్టర్!" లాల్ అన్నాడు తీవ్రంగా, "ఆ పోగులు ఆ కోటువి కాకపోతే మరి దేనివి? శవంమీద ఎలా వచ్చాయి? హతుడు స్వెటర్ తొడుక్కున్నాడా?"

కృష్ణన్ నోరు మెదపలేదు.

డాక్టర్ ఆశ్చర్యంలోంచి తేరుకుని అన్నాడు: "ఇన్ స్పెక్టర్, ఈ విషయం నాకెందుకు చెప్పలేదు? చాలా వింతగా వుంది! మిస్టర్ లాల్, స్వెటర్ తొలగించే అవసరం హంతకుడికేమిటి? అసలు స్వెటర్ తొడుక్కునే అవసరం హతుడికేమిటి? ఇది చలికాలం కాదు—ఎండలు మండిపోయి చెమటలుకక్కి ఛస్తున్నాం!"

లాల్ ముఖం కర్కశంగా మారింది. తలతిప్పి జాన్ ని చూశాడు. జాన్ కలవరంగా చూశాడు.

కొన్ని క్షణాలయ్యాక కృష్ణన్ లేచి వెళ్ళడానికి సిద్ధ

మయ్యాడు.

"గుడ్ లక్, లాల్! ఈ క్లిష్ట దశలో మీకేదో మార్గం తడుతుందని ఆశిస్తాను. గుడ్ నైట్."

"గుడ్ నైట్."

కృష్ణన్ డాక్టర్‌తో వెళ్ళిపోయాక నిశ్శబ్దం ఆవరించు కుంది. లాల్ కిటికీదగ్గర నిలబడి రాకెట్ ఇంధనం వదిలి నట్లు సిగరెట్ పొగ వూదుతూ బయటికి చూడసాగాడు. పొగ రింగులు రింగులుగా బయట వెచ్చటి గాలిలోపై పైకి లేస్తూ తనతోబాటు లాల్ దృష్టిని కూడా తీసుకు పోతోంది.

లాల్ దృష్టి ఎదుటి బిల్డింగ్ ఆరో అంతస్థు నియాన్ లైట్లమీద పడి నిశ్చలంగా వుండిపోయింది. కొన్నిక్షణాల తర్వాత అతని కనుబొమలు ముడిపడ్డాయి. వెంటనే ముఖం విచ్చుకుంది. చిన్నగా ఈలవేసి వెనక్కి తిరిగాడు.

"ఏమిటి?" జాన్ అడిగాడు ఆత్రుతగా.

"ఒక మార్గం తట్టింది...."

"ఎలా?"

"చెప్తాను—జాన్, ఆ కోటు సుజాత మార్చెయ్య లేదనుకొంటే, ఈ సమస్యకు ఒకే ఒక్క పరిష్కార ముంది," అన్నాడు లాల్.

# 10

"జెంటిల్ మెన్! ఇప్పుడీ కేసు పొగమంచులా విడిపో తోంది!" అన్నాడు లాల్, మర్నాడు ఉదయం యేజెన్సీ ఆఫీసులో కృష్ణన్, డాక్టర్ రఘునాథ్, దివా కర్‌లను సమావేశపరచి.

లాల్ మాటలు విని కృష్ణన్ ఆసక్తిగా చూశాడు, "ఏం చేశారు?"

"వంద రూపాయలు ఖర్చు చేసి ఈ కేసులో అతి ముఖ్యమైన క్లూ కనుకున్నాను!"

"ఆ ఖర్చును సుజాత ఫీజుకి జోడిస్తాం," జాన్ ఏజెన్సీ పాలసీ వివరించాడు.

"ఓహ్! సమస్య సాధించారన్న మాట!" కృష్ణన్ అర్చాడు.

లాల్ తలూపాడు, "సాధించడానికి సమస్యలు లేక పోతే మేమెందుకు? నిన్న రాత్రి మిస్టర్ దివాకర్ ఇంటి కెవరెళ్ళారో మా అందరికీ తెలుసు!"

"ఎవరు?" దివాకర్ ఆతృతగా అడిగాడు.

లాల్ అతన్ని సూటిగా చూశాడు.

"ఓహ్ దివాకర్ మీ ఫ్రెండ్‌ని చంపిందెవరో తెలుసుకోవాలని—కాదు—పట్టుకోవాలని మీకు చాలా తొందరగా వుంది కదూ? మీ ఫ్రెండ్‌ని యెవరు చంపారో మీకు తెలుసా? పాపం, భూషణ్! ఈ పవిత్ర భారత భూమ్మీద స్మగ్లింగ్ బిజినెస్‌లో కాబోయే ఒక ధృవతార రాలిపోయింది! ప్చ్, రాలగొట్టిందెవరు? ఒక మామూలు బ్లాక్ మెయిల్ గేమ్‌లో తప్పటడుగు వేసి ఎలా బాల్చీ తన్నేశాడు?"

దివాకర్ ముఖంలో రంగులు మారుతున్నాయి.

జాన్ తటాలున వంగి టేబిల్ క్రిందనుంచి గొడ్డలి తీసి మెరుపులా దివాకర్ తలమీదుగా విసిరాడు. దివాకర్ గావుకేక పెట్టి పైకెగిరాడు. జాన్ చటుక్కున మళ్ళీ వంగి టేబిల్ క్రిందనుంచి కంబళితీసి వల విసిరినట్టు దివాకర్ మీద కప్పేశాడు.

ఈ హఠాత్సంఘటనకి దివాకర్ అదిరిపోయి, వెనక్కి దూకి, ప్రాణం పోయేలా అర్చాడు.

"వద్దు! నన్ను చంపొద్దు! నేను నిజం చెప్పేస్తాను! భూషణ్‌ని నేనే చంపాను—ఆ గొడ్డలితోనే!"

కృష్ణన్ డాక్టర్‌లు కొయ్యబారిపోయి చూస్తున్నారు.

లాల్ నవ్వుతూ లేచి, దివాకర్ దగ్గరికెళ్ళి వీపు మీద ఛెళ్ళుమని చరిచాడు. "గుడ్! నువ్వు చాలా బుద్ధిమంతుడివి! ఇక నీ చేతులు జోడించి ఇన్‌స్పెక్టర్‌కేసి జాపుతావా—నువ్వు చాలా తెలివైన హంతకుడివని లోకానికి తెలియడానికి?"

డాక్టర్ రఘునాథ్ డిటెక్టివ్‌లను వింతగా, అనుమానంగా, భయంగా, రకరకాలుగా చూశాడు.

"మిస్టర్ లాల్! నే నింకా ఆ షాక్‌నుంచి కోలుకోలేదు! నిజంగా అతన్ని చంపేశారనుకున్నాను! మైగాడ్! ఆ గొడ్డలి యెక్కడిది? ఆ కంబళి ఎక్కడిది?"

డిటెక్టివ్‌లు చిన్నగా నవ్వి వూరుకున్నారు.

"అసలు దివాకర్ మీద అనుమానం ఎలా వచ్చింది?" మళ్ళీ అడిగాడు డాక్టర్.

లాల్ ఒకక్షణం తర్వాత అన్నాడు:

"భూషణ్ ఆమ్లెట్ తిన్లేదని పోస్టుమార్టమ్‌లో తేలినప్పుడు అనుమానం వచ్చింది. గదిలో రెండు గ్రుడ్డుపెంకులున్నాయి. పెనంమీద ఒక ఆమ్లెట్ మాడిపోయి ఉంది. మరో ఆమ్లెట్ యెలా మాయమైంది? భూషణ్ తినలేదు. పిల్లి తిన్నదా? ఆలా జరిగివుంటే అది శవంచుట్టూ కేకలు వేస్తూ తిరిగినప్పుడు రక్తంలో, నూనెలో చాలా అడుగు జాడలు కన్పించేవి. నాకప్పుడే అనుమానం వచ్చింది—అది రెండుకాళ్ళ పిల్లి దివాకర్ అని.

"దివాకర్ ఆమ్లెట్ తినలేదని అబద్ధం చెప్పాడు.

దేనికి? పోస్టుమార్టం ప్రకారం హత్యాసమయంవల్ల అతని ఎలిబీ గాలికి కొట్టుకుపోతుంది గనుక! భూషణ్ చావుకి ముందు—అంటే—ఒంటిగంట ప్రాంతాల ఆమ్లెట్స్ వేస్తున్నాడని ఎవరైనా హత్యాస్థలం చూసి చెప్తారు. కాని అది పొరపాటు. ఆ సమయానికి అతను చచ్చి రెండు గంటలయింది!"

"ఏమిటీ! అతను చచ్చి...."

"మీరు పోస్టుమార్టమ్‌లో హత్యాసమయం గురించి వెలిబుచ్చిన అభిప్రాయం పూర్తిగా పొరపాటు. హత్య సుమారు పదకొండు గంటలకు జరిగింది. మీరు తప్పుడు నిర్ణయం చేయడానికి దివాకర్ శవంతో తమాషా చేశాడు."

"ఏం చేశాడు?"

"మొదటినుంచీ అంతా వివరంగా చెప్తాను." అన్నాడు లాల్ సిగరెట్ వెలిగించి "దివాకర్ ఇక్కడికి ఉద్యోగం కోసం రాలేదు. అతను స్మగ్లరకి ఏజెంట్. లేకపోతే ఒక సామాన్య పౌరునిదగ్గర ఆత్మరక్షణ కోసం రివాల్వర్ వుండే అవకాశం లేదు. ఇది అమెరికా కాదు—ఇక్కడి సమాజం స్థితిగతులు వేరు.

"భూషణ్ స్మగ్లింగ్‌లో దిగడానికి దివాకర్‌కు 20 వేలు డిపాజిట్ కట్టే అవసరం ఏర్పడింది. ఆ డబ్బుకోసం అతను సుజాత తండ్రిని అప్పు అడిగాడు. అక్కడ చుక్కెదురైంది. దానితో మార్గం తోచలేదు.

"అందువల్ల బాగా ఆలోచించి, ఓ పథకంవేసి సుజాతను బ్లాక్‌మెయిల్ చేశాడు. ఆ బ్లాక్‌మెయిల్‌లో తాను అజ్ఞాతంగా ఉండాలి గనుక దివాకర్ సహాయం తీసుకున్నాడు. అయితే ఆనతల సుజాత మా సహాయం

తీసుకోవడంతో వ్యవహారం బెడిసికొట్టింది. మేం దివాకర్‌ని ట్రిక్ చేసి అసలు ఉత్తరాల్ని చేజిక్కించుకున్నాం.

"అప్పుడు భూషణ్ రెచ్చిపోయి దివాకర్‌ని చివాట్లు పెట్టాడు. ఇక ఆ ఉత్తరాలకి డూప్లికేట్ కాపీలు తియ్యక తప్పదుగనుక, అలా చేయడంవల్ల మా విశ్వాసాన్ని వమ్ముచెయ్యడం జరిగింది గనుక, రాబోయే క్లిష్ట పరిస్థితిని తనే స్వయంగా చక్కబెట్టుకోవాలనుకొని దివాకర్‌ని కిక్ యిచ్చాడు. కమీషన్ ఇవ్వనని కచ్చితంగా చెప్పేసాడు.

లాల్ కాస్సేపాగి మళ్ళీ అన్నాడు, "అందుకు ప్రతి చర్యగా దివాకర్ భూషణ్ వ్యవహారం పోలీసులకు హెచ్చరించవచ్చుగానీ—భూషణ్ అంతకంటే పెద్ద నేరస్థునిగా తనని పట్టివ్వగలడు. కాబట్టి ఆ ఆలోచన విరమించుకున్నాడు. అయితే అతను హత్య చెయ్యడానికి దారితీసిన పరిస్థితి ఏమిటో నా కొకటే తోస్తోంది—"

"ఏమిటది?" డాక్టర్ అడిగాడు.

"డిపాజిట్ కట్టేందుకు దివాకర్‌లాంటి చవటని నమ్మకూడదనుకొని భూషణ్ తాను నేరుగా అతని బాస్‌తోనే సంప్రదిస్తానని చెప్పి వుండవచ్చు. అప్పుడు దివాకర్ భయపడ్డాడు. బాస్‌కి తన అసమర్థత భూషణ్ వివరిస్తే శిక్ష తప్పదు! వెలివేయవచ్చు లేదా ప్రాణం తీయవచ్చు. ఆ ప్రమాదం తప్పించడానికి దివాకర్ ఈ హత్యకు పూనుకొన్నాడు."

"దటీజ్ రైట్. అయితే ఈ హత్య ఎలా చేశాడు?"

"చాలా సింపుల్!" లాల్ అన్నాడు, లేచి పచార్లు

చేస్తూ. "ఈ హత్యమీద దివాకర్ బ్లాక్ మెయిల్ ముసుగు కప్పాలనుకున్నాడు. కాబట్టి సుజాత తండ్రిని హంతకుడు చెయ్యాలనుకున్నాడు. భూషణ్‌తో వాదన జరిగాక అతను సుజాత ఇంటికెళ్ళి ఏదైనా హత్యాయుధం కోసం వెతికాడు. అప్పుడు పెరట్లో గొడ్డలి దొరికింది. దానితో తిరిగివచ్చి కిచెన్‌లోకెళ్ళాడు.

గొడ్డలిని దాచి, ఆమ్లెట్స్ వేస్తున్న భూషణ్ దగ్గరి కెళ్ళి మాటలు కలిపాడు. అప్పుడు సమయం సుమారు 11 గంటలవుతోంది. భూషణ్ మాటలు వింటూ మొదటి ఆమ్లెట్ వేస్తున్నాడు. క్రమంగా అతన్ని తిరిగి మచ్చిక చేసుకొని దివాకర్ ఆ ఆమ్లెట్ తిన్నాడు. భూషణ్ మరో ఆమ్లెట్ వేశాడు. ఈ లోపు దివాకర్ ఆమ్లెట్ తినేసి వెంటనే రంగంలోకి దిగాడు.

"బయటనుంచి గొడ్డలి తెచ్చి భూషణ్ తలమీద ఓ దెబ్బ వేశాడు. అంతే, భూషణ్ తలపట్టుకొని వెనక్కి కూలాడు. అతని చెయ్యితగిలి సూసెడబ్బా పడిపోయింది. క్షణాల్లో రక్తం మడుగుకట్టింది. దివాకర్ బ్లీడింగ్ పూర్తయేవరకూ ఆగి, శవాన్ని ఒక కంబళిలోకి చేర్చాడు. తర్వాత శవానికి బిగుతుగా కంబళి కప్పాడు—"

"ఓహ్—దేనికి?"

"ఎలిబీ కాపాడుకోవడానికి. ఆ తర్వాత అతను శవం జేబులోంచి రూం తాళాలు, డూప్లికేట్ ఉత్తరాలు తీసుకొని, ఇంటికి తాళంవేసి సుజాత ఇంటికి చేరుకున్నాడు. అక్కడ గొడ్డలి పారేసి, సుజాత తండ్రి తలగడ క్రింద ఆ ఉత్తరాల్ని పెట్టేసి, అప్పుడు బార్‌కెళ్ళాడు. అక్కడనుంచి లాడ్జింగ్‌కెళ్ళి, తెల్లారుతోండగా ఇంటికి తిరిగివచ్చి, శవంమీద కంబళి తీసేసి,

శవాన్ని తిరిగి కిచెన్‌లో పడేసి—ఈ సారి ఇంటికి తాళం వేయకుండా వెళ్ళిపోయాడు. తర్వాత మధ్యాహ్నం అమాయకంగా తిరిగివచ్చి బూటకపు కథ విన్పించాడు!"

"కంబళి కప్పటంలో అతని ఉద్దేశమేమిటి? మీా కను మానమెలా వచ్చింది?"

లాల్ వివరించాడు: "ఉష రాత్రి దివాకర్ యింటి కెళ్ళింది. ఈ బ్లాక్ మెయిల్ గురించి ఆమెకు తెలుసు. దివాకర్‌ని బ్రతిమిలాడి ఆ ఉత్తరాల్ని తెచ్చుకోవాలను కుంది. కానీ అతనింటికి తాళం వేసివుంది. ఆమె తిరిగి వచ్చేసింది. లాంగ్ కోటుతో వున్న ఆమెని చూసి సుజాత తండ్రి అనుకుంది. దురదృష్టవశాత్తూ పరిసితిని కిష్టం చేస్తూ అదే రాత్రి అతను గుండె ఆగి మరణించాడు.

అతని తలగడ క్రింత ఆ ఉత్తరాలు, సుజాత మాటలు విన్నాక అతనే హంతకుడనుకున్నాం. కానీ ఉష ప్రవేశంతో అది వమ్ము అయింది. ఆ తర్వాత శవంమీాద ఉన్ని పోగులు ఉషను కూడా ఈ వ్యవహారం నుంచి తప్పించాయి. ఆ పోగులు ఉష తొడుక్కున్న కోటువి కావు. అలాటి కోటు ఆమె తండ్రికి ఒక్కటే ఉంది. సుజాత దాన్ని తారుమారు చేయలేదు. హతుడు స్వెటర్ తొడుక్కోలేదు.

"మరి ఆ పోగులు దేనివి?"

"మొదట నా కంతుబట్టలేదు! కాని దివాకర్ ఆమ్లెట్ గురించి అబద్దం చెప్పాడని తెలిశాక నాకో అనుమానం వచ్చింది....అతను ఎలిబీకోసం తప్పకుండా శవంమీాద ఏదో ప్రయోగం జరిపి వుంటాడనుకున్నాను. అలాటి ప్రయోగం హత్యా సమయం గురించే అయివుండాలను కున్నాను. వెంటనే నాకు మర్మం తెలిసిపోయింది!"

"ఏమిటది?"

లాల్ నిట్టూర్చాడు.

"తెలివైన హంతకుడు కంబళినుపయోగించి హత్యా సమయాన్నెలా మార్చాడో వివరిస్తాను: మరణం సంభవించాక శరీరోష్ణోగ్రత ముప్పావుగంట వరకు స్థిరంగా వుంటుంది. తరువాత 3 నుంచి 5 గంటలవరకు నెమ్మదిగా తగ్గుతుంది. ఆ తర్వాత త్వరితంగా తగ్గిపోతుంది. చివరికి దేహ ఉష్ణోగ్రత వాతావరణ ఉష్ణోగ్రతకు పడిపోయినపుడు ఈ తగ్గుదల వేగం క్షీణిస్తుంది. ఈ తగ్గుదల రేటు గంటకు 0.4C° డిగ్రీల చొప్పున వికిరణ పద్ధతిలో జరుగుతుంది.

"అయితే దేహంమీద బిగువైన దుస్తులుంటే ఉష్ణనష్టం ప్రారంభమయ్యే సమయం ముప్పావుగంటగాక మరికొంత ఆలస్యంగా వుంటుంది. అదే కంబళిలాటి ఉన్ని వస్త్రాలు చుట్టివుంటే ఈ భేదం కొన్ని గంటలకు చేరుకొంటుంది.

"అయితే దేహం వేడిని కోల్పోకుండా కంబళి కొన్ని గంటలవరకు ఉష్ణ వికిరణాన్ని నిరోధిస్తుందన్న మాట-

"కాబట్టి ఇక్కడ హంతకుడు శవాన్ని కొన్ని గంటలపాటు కంబళిలో చుట్టిపెట్టటం వలన ఉష్ణోగ్రత తగ్గుదల వెంటనే ప్రారంభం కాలేదు. రెండు గంటలు ఆలస్యంగా, సుమారు ఒంటిగంటకు ప్రారంభమైంది. అందువల్లనే మీరు హత్యాసమయాన్ని 1—2 గంటల మధ్య నిర్ణయించారు. ఆ సమయంలో దివాకర్ పటిష్టమైన ఎలిబీ సృష్టించుకొన్నాడు.

డాక్టర్ ముఖం ఉద్రేకంతో ఎర్రబడింది.

లాల్ మళ్ళీ అన్నాడు: "దివాకర్ ఆమ్లెట్ తిన్నా

నని చెప్తే అతని ఎలిబీ ముక్కలయ్యేది. ఎందుకంటే—పదకొండు గంటలకి అతను ఆమ్లెట్ తిని బయలుదేరితే, పోస్టుమార్టమ్‌లో తారుమారయ్యే హత్యాసమయం ఒంటిగంటవరకూ భూషణ్ యింకా రెండవ ఆమ్లెట్ వేస్తూనే వున్నాడా అన్నది అతన్ని పట్టిస్తుంది. కాబట్టి తిన్లేదని చెప్పాడు. దట్సాల్ డాక్టర్. ఈ హత్యలో మర్మం తెలిశాక మేం రాత్రి దివాకర్ యింటిని సోదా చేశాం. అక్కడ బీరువాలో రక్తం మరకలున్న ఒక కంబళి దొరికింది. వెంటనే హత్యాయుధం కోసం సుజాత ఇంటిని రహస్యంగా గాలించాము. నేను వారించినా వినకుండా జాన్ బావిలో దిగి గొడ్డలి తీశాడు."

"ఓహ్! అయితే దాన్ని దివాకర్ మీదకు ఎందుకు విసిరారు?"

జాన్‌ని చూసి లాల్ నవ్వి అన్నాడు: "నేరం చేసిన వాళ్ళ అంతరంగంలో ఎన్నో భయాలూ బలహీనతలూ వుంటాయి. అవి ఏ క్షణంలో తమకు తెలియకుండా బయట పడతాయోనన్న స్పృహ వాళ్ళకుండదు. జాన్ గొడ్డలి విసిరి కంబళి-కప్పటంతో, దివాకర్ గావుకేక పెట్టి నిజం కక్కేశాడు—బావుంది కదూ?"

ఫోన్ మ్రోగింది.

లాల్ రిసీవరందుకున్నాడు. అవతల సుజాత పలికింది.

"మిస్టర్ లాల్! కంగ్రాచ్యులేషన్స్! మీరు హంతకుడ్ని పట్టుకున్నారని విన్నాను.... థాంక్ గాడ్! నా తండ్రి గురించి లోకం చెడుగా అనుకునే ప్రమాదం తప్పించారు! అంతేగాక ఈ హత్యనుంచి నా చెల్లెల్ని కూడా రక్షించారు! ఆమె కోలుకున్నాక మీ గురించి చెప్పి—"

"ఈ హత్య గురించి ఆమెకు తెలియనివ్వకండి!" లాల్ వారించాడు,

"ఆమెకు తండ్రి లేనిలోటు మా గురించి గొప్పలు చెప్పటంవల్ల భర్తీగాదు! ఆమెకు పూర్తి మానసిక విశ్రాంతి కావాలి-మీ రామెను కంటికి రెప్పలా కాపాడు కోవాలి."

లాల్ రిసీవర్ పెట్టేసి, డాక్టర్ వైపు తిరిగి, "ఇంకే మిటి?" అన్నాడు అలసటగా.

డాక్టర్ కాళ్ళు కృతజ్ఞతాభావంతో మెరుస్తున్నాయి.

—:ఐపోయింది:—

# (నాల్గవ భాగము)

టీచర్ ఆకారం మూడడుగుల దగ్గరగా వచ్చినపుడు అతన్ని స్పష్టంగా చూడగలిగాడు రాణా.

సన్నగా పొడుగ్గా ఉన్నాడతను.

ఒక చేయి మాత్రమే పూర్తిగా వుంది.

రెండోది-మొండిచెయ్యి.

మోచేతి దగ్గర అంతమయ్యింది.

"అంతా ఆ డ్రైవర్ దే తప్పండి. ఆ వెధవకి నేను చెబుతూనే ఉన్నాను. కాని... వింటేనా? పిల్లల్తో జోకులు వేస్తూ పాగ మంచుని చూడనేలేదు లోపలికి ప్రవేశించేదాకా. సమయాన్ని స్లో చెయ్యలేకపోయాడు. తీసికెళ్ళి పల్లంలోకి గుద్దించాడు. కమీనే" అంటూ ఆగి, వెనక్కి తిరిగి తన చుట్టూ మూగుతున్న పిల్లల్ని గసిరాడు 'పొండ్రా కోతి మూకల్లారా!"

స్కూలు పిల్లలు అల్లరి చేసుకుంటూ తిరిగి బస్సు వైపు వెళ్ళిపోయారు.

"ఒకసారి డ్రైవర్ని చూద్దాం పదండి" అన్నాడు రాణా.

ఇద్దరూ బస్సులోకి నడిచారు.

రక్తసిక్తమైన చేతి రుమాలుతో గాయాన్ని నొక్కి పట్టి, బాధగా మూల్గుతున్నాడు డ్రైవర్, ఓ సీట్లో.

రాణా అతనిమీదకు వంగాడు. "చెయ్యి తియ్యి డ్రైవర్! దెబ్బను చూడాలి."

రక్తంతో తడిసి ముద్దయిన హాండ్ కర్చీఫ్ లాక్కుని బైటికి విసిరేశాడు.

గాయం చాలా పెద్దది.

రక్తం ధారాళంగా కారోంది.

తన జేబులోంచి కర్చీఫ్ బైటకి తీసి, అతని గాయం మీద ఉంచాడు రాణా. గట్టిగా పట్టుకొని వుండమని డ్రైవర్ కి చెబుతూ "కొద్దిదూరం పోతే టౌన్ లో ఓ డాక్టరు వుండాలి" అన్నాడు అసహనంగా టీచర్ "కాని అక్కడికి వెళ్ళడమే ప్రాబ్లెం"

"మీరు పిల్లలతో యిక్కడే వుండండి. ఇతన్ని మాతో డాక్టరుదగ్గరికి తీసుకువెళ్తాం. అక్కడి పోలీసులకి రిపోర్టుయిస్తే-వాళ్ళు యిటుగా వచ్చే లారీనిగాని మరేదైనా వెహికల్ నిగాని ఎరేంజ్ చేస్తారు పిల్లల్ని తరలించడానికి. అన్నాడు. రాణా

"ఓహ్! థాంక్యూ వెరీమచ్ సర్! త్వరగా యేదో అరేంజ్ చేయాలి పిల్లలకి"

తల ఊపాడు రాణా.

ఇద్దరూ, డ్రైవర్ ని కారు దగ్గరికి నడిపించి వెనక సీట్లో కూర్చోబెట్టారు.

పిల్లల బస్సు ప్రయాణం గురించి చెప్పసాగాడు టీచర్.

"మాది కాంబేలో ఓ ప్రైవేట్ బోర్డింగ్ స్కూల్. పేరు రణధావే ప్రైమరీ స్కూలు. ఎక్స్కర్షన్ కోసం బొంబాయి బయలుదేరాం. ఆ ప్రోగ్రాం ఈ విధంగా చెడిపోయింది. నా పేరు పరంజ్యోతి. అవ్ కా నామ్.."

"రాణా....మిస్టర్ పరంజ్యోతి! మీ పొజిషన్ లో నేనుంటే ఆ పిల్లల్ని బస్సుల్లో ఉంచి అద్దాల కిటికీలన్నీ బంద్ చేయిస్తాను."

ప్రశ్నార్థకంగా చూసాడు టీచర్ "ఎందుకు?"

"పొంగమంచు వాళ్ళ ఆరోగ్యానికి మంచిది కాదు. అంతే చెప్పగలను. మీరు కూడా బస్సులో కూర్చోండి! నేను దగ్గర్లోని టౌను చేరుకోగానే తప్పకుండా మీ

అందర్నీ తరలించే ఏర్పాటు చేస్తాను." కార్లో కూర్చొని యిగ్నిషన్ తిప్పాడు రాణా. తల త్రిప్పి మళ్ళీ అన్నాడు. "పిల్లలందరిన్నీ బస్సులోవుంచి కిటికీతలుపులు మూయండి."

"పొగమంచు పిల్లలకి పెద్ద ప్రమాదమనుకోనుసార్. బయట వెచ్చగానే...."

ఇంజన్ని స్టార్ట్ చేసి కార్ని ముందుకు దూకించాడు రాణా, జాగ్రత్తగా.

ఎదురుగావున్న పొగమంచు గురించి, దాని వాసన గురించి యింకా ఇబ్బందిగానే ఫీలవుతున్నాడు రాణా.

అటువంటి వాసన వుంటుందని, అతనికి భూకంపానికి గురికాకముందు ఎప్పుడూ తెలీదు. అలాగని పొగమంచు....

వెనక సీట్లోంచి వెలువడ్డ మూలుగు రాణా ఆలోచనల్ని భగ్నం చేసింది. "తల భారంగా వుంది." గొణిగాడు డ్రైవర్ బాధగా.

"అర గంటలో నిన్ను డాక్టరు దగ్గరికి చేరుస్తాం. కొంచెం ఓర్చుకో" ధైర్యం చెప్పింది లూసీ.

నిముషం తర్వాత రాణా మీదకి ఒరుగుతూ అన్నది లూసీ "రాణా! ఒకసారి కారాపు!"

తల త్రిప్పి ప్రశ్నార్థకంగా చూడసాగాడు రాణా. "ఎందుకు?"

సిగ్గుపడుతూ చిటికెనవ్రేలు చూపించింది.

తల అడ్డంగా తిప్పాడు రాణా. "అయామ్ సారీ! యిప్పుడు కాదు."

"కారణం?"

"పొగమంచు. నువ్వు కారు దిగి అందులోకి నడవటం నా కిష్టంలేదు."

ఆమె ముఖంలో రంగులు మారాలు. "ఆర్ యూ

షూర్?"

"నో" అద్దంలోంచి బైటికి చూస్తూ చెప్పాడు రాణా "ముందు జాగ్రత్త."

కొంతసేపు మౌనం.

ఎదురుగావున్న పొగమంచు దట్టంగా మారుతున్నట్లు కొద్దిసేపట్లో గ్రహించాడు రాణా.

దీనికి అంతం లేదా?

ఎన్ని మైళ్ళు ఆవరించింది యిది??

వేగం యింకా తగ్గించాడు. "రాణా! ఏవిటది??"

హఠాత్తుగా అతని చేయిని పట్టుకుంది లూసీ. ఆమె కళ్ళు భయంగా, అతని కుడివైపు కిటికీలోంచి దేన్నో చూస్తున్నాయ్.

రాణా ఉలిక్కిపడి, తలత్రిప్పి, అటువైపు చూసాడు. సుడులు తిరుగుతున్న పొగమంచు తప్ప ఏమీ కనబడ లేదు అతనికి.

"వాటీజిట్ లూసీ? నాకేం కనపడ్డంలేదు."

"అది మాయమైపోయింది. అది ఏమీ కాకపోవచ్చు. కానీ నా కళ్ళకు ఏదో తళుక్కున మెరిసిన వెలుగుని చూసినట్లయింది! తెల్లగా, పొగమంచు మధ్యగా మెరుస్తూ!

"కాని అది క్షణంలో మాయమైపోయింది! బహుశా మరో పొగ దొంతర దానిమీదుగా పాకివుండాలి."

"బహుశా, సూర్యకాంతి దాని మధ్యగా ప్రసరి స్తూండడవల్ల అలా కనిపించి వుండాలి" అన్నాడు రాణా.

"ఏమో."

వెనకాల డ్రైవర్ ఏదో గొణుక్కోవటంతో వారి దృష్టి మళ్ళింది.

"దరిద్రగొట్టు వాతావరణం. ఒక నిముషం ప్రకాశ వంతంగా వుంటోంది. మరోనిముషం దట్టమైన ఆ పొగ మంచు. కలికాల మహత్యం. దానికి తగ్గట్టు విచిత్రమైన హత్యలు...."

రాణా తల విదిలించాడు, డ్రైవింగ్ మీద దృష్టి లగ్నం చేస్తూ.

"హత్యలేవిటి డ్రైవర్?" అడిగింది లూసీ, తల వెనక్కి తిప్పి.

"నిన్న పేపర్స్ చూడలేదా మేమ్‌సాబ్? ఈ ప్రాంతా లకి ఏదో వినాశకాలం దాపురించినట్లుంది" నుదుటిమీద గాయపు బాధను ఓర్చుకుంటూ కళ్ళు మూసుకుని చెప్ప సాగాడు డ్రైవర్.

"భూకంపం ఏర్పడిన భావ్‌నగర్ ప్రక్క గ్రామంలో విచిత్రమైన హత్యలు జరిగాయ్. ఎవరో మాజీ మిలట్రీ మనిషట. ధనవంతుడట. అతన్నీ, అతని భార్యనీ.... ఇంకా ఆ యింట్లో పనిచేసే వంటమనిషినీ....పనిమనిషిని కూడా అనుకుంటా, మూకుమ్మడిగా ఖూనీ చేసేసాడు, ఓ వ్యక్తి 'గొడ్డలితో'. తర్వాత ఆ దరిద్రుడు తన కాళ్ళనీ, చేతుల్నీ చచ్చిపోయేదాకా, తనని తానే నరు క్కున్నాడట అదే గొడ్డలితో.

రాణా కూడా మౌనంగా విన్నాడా కథని.

"మేమ్ సాబ్! యిప్పుడు నా ఉద్యోగం వూడు తుంది."

"ఎందుకు?" అడిగింది లూసీ.

"మా హెడ్మాస్టర్ సంగతి మీకు తెలీదు. నేనంటే

ఆయనకి యిష్టం లేదు. అలాగే టీచర్ పరంజ్యోతికూడా వాళ్ళ ఇంట్లో పనులు చేయనన్నానని-కసి పెట్టుకున్నారు. ఇప్పుడు ఈ యాక్సిడెంట్ చేశానన్న వంకతో నన్ను వుద్యోగంనుండి ఊడపీకిస్తాడు."

"మరో పదిహేను నిమిషాలు వారు ముగ్గురూ దట్టమైన పొగమంచులో ప్రయాణించారు.

కారు అకస్మాత్తుగా పొగమంచులోంచి బైట పడింది.

ఇప్పుడు ముందు రోడ్డంతా సూర్యరశ్మితో క్లియర్ గా వుంది!

తలుపు తెరుచుకుని బైటకు వెళ్ళినట్టు ఆ మార్పు [illegible]ణాల్లో జరిగిపోయింది.

రాణా, లూసీ వెనక్కి చూసారు ఆశ్చర్యంగా!

తలమీంచి దుప్పటి తొలగించినట్లు విచిత్రంగా అది పోలాలమీదుగా ప్రయాణించసాగింది....

ఇద్దరూ సంతృప్తిగా నిట్టూర్చారు.

"చాలా ఆశ్చర్యంగా వుంది కదూ," గొణిగింది లూసీ.

రాణా ఏమీ వాఖ్యానించలేదు.

కారు రాకెట్ వేగాన్ని పుంజుకుంది!

కొద్దిసేపట్లో రోడ్డు వారగా వారికి ఓ పోలీస్ స్టేషన్ ఎదురయింది. లోపల వివరాలు చెప్పి హెల్ప్ అడిగాడు రాణా.

ఒకవంక పిల్లలు గాయపడలేదని చెబుతూ, రాణా అంత గాభరా యెందుకు పడుతున్నాడో అర్థం కాలేదు సబిన్స్పెక్టర్ కి.

పిల్లల్ని తరలించడానికి వెంటనే పోలీస్ వేన్ పంపే ఏర్పాటు చేస్తానని ప్రామిస్ చేశాడు.

అతనే దగ్గర్లో వున్న డాక్టరు వివరాలు చెప్పాడు.

కారు మళ్ళీ బయలుదేరింది.

డ్రైవర్ని డాక్టర్ సురక్షిత హస్తాలకి అప్పగించి, సంతృప్తిగా ఫియట్ని బొంబాయివైపు వురికించాడు రాణా.

* * *

మెరైన్ డ్రైవ్లో ఓ పెద్ద బిల్డింగ్లోని ఒక ఫ్లాట్ని అద్దెకు తీసుకుని వుంటున్నాడు రాణా.

కారు కాంపౌండ్లో ఆపి, లిఫ్ట్ పై అంతస్థులో వుండడంతో, మెట్లు ఎక్కి పైకి వెళ్ళారు ఇద్దరూ.

తనఫ్లాట్ ముందు నిలబడి, తలుపు తెరిచాడు రాణా.

ఇద్దరూ లోనికి అడుగు పెట్టారు.

లోపల అందమైన పెయింటింగ్స్ గోడలకు అలంకరించబడి వున్నాయి.

మోడరన్ ఫర్నిచర్తో అందంగా అలంకరించబడి వుంది సిట్టింగ్ రూమ్.

అలసటగా నిట్టూరుస్తూ కుషన్డ్ ఛేర్లో కూలబడ్డాడు రాణా, బూట్లని చిరాగ్గా విప్పేస్తూ.

రెండు నిముషాల్లో లూసీ రెండు కాఫీ కప్పులతో బైటికి వచ్చింది, వంట గదిలోంచి.

అతని కాళ్ళదగ్గర కూర్చుంది, కాఫీ కప్పుల్ని నేలమీద వుంచుతూ.

అతని మోకాళ్ళపై చేతులాన్చి, తలెత్తి చూసింది లూసీ.

"హౌ డు యు ఫీల్ నౌ డార్లింగ్?"

"ఓహ్!" పెదిమలపై నవ్వు తెచ్చుకుంటూ భుజాలెగరేశాడు రాణా.

"ఎ లిటిల్ బిట్ టైర్డ్. దట్సాల్. పోస్ట్ హాస్పిటల్ డిప్రెషన్ అంటారు దీన్ని."

వెనక్కి జరిగి, సాలోచనగా అతని పాదాలని వేళ్ళతో రుద్దుతూ అంది లూసీ "డాడీకి నేను నిన్ను పెళ్ళి చేసుకోవటం యిష్టంలేదు. కావున డాడీనే వదిలివేయడానికి నిశ్చయించుకున్నాను."

"వదిలి....?" త్రుళ్ళిపడ్డాడు రాణా.

"ఎస్ రాణా! నువ్వు హాస్పిటల్లో వుండగా నేనెన్నో గుణపాఠాలు నేర్చుకున్నాను. ఊహించినదానికంటే ఎక్కువగా నిన్ను ప్రేమిస్తున్నానని తెలుసుకున్నాను. నా తండ్రికంటె నువ్వే ఎక్కువన్న నిర్ణయానికి వచ్చాను. ప్రపంచంలో అతనికంటె విలువైనది నువ్వే అని గ్రహించాను. కానీ, అంతకుముందు నా హృదయం చలించింది. నిస్సహాయంగా నువ్వు పడివున్నప్పుడు ఒకసారి నేను నీ నుండి దూరంగా పారిపోదామనుకున్నాను"

అతను ఆమె దగ్గరగా జరిగాడు.

ఆమె ముఖాన్ని ప్రేమగా చేతుల మధ్యకు తీసుకుంటూ మౌనంగా వుండిపోయాడు.

"నువ్వు ప్రవర్తించిన తీరు...." గాద్గదికంగా పలికిందామె కంఠం. "నువ్వు మాట్లాడిన దారుణమైన మాటలు అన్నీ నన్ను భయపెట్టాయి—అసలు ఆ వ్యక్తి నువ్వేనని నమ్మలేకపోయాను."

"అప్పుడు నిజంగా నేను-నేను కాదు లూసీ" గంభీరంగా పలికాడు రాణా.

"ఐ అండర్స్టాండ్ రాణా! కాని అదంతా భయంకరమైన పీడకలగా గడిచిపోయింది. నువ్వు బెడ్మీద అసాధారణంగా ప్రవర్తించిన రోజు—నా భవిష్యత్తు

శూన్యంగా కనబడింది. త్వరలో మళ్ళీ ఈ విధంగా నన్ను దగ్గరగా తీసుకుంటావని - ఖచ్చితంగా ఊహించలేదు. నీ నుండి పారిపోదామని డాడీకి ఫోన్ చేసాను. కానీ ఆయనతో మాట్లాడుతుండగా అకస్మాత్తుగా నా అంతరాత్మ ఎదురు తిరిగింది. నువ్వు లేకుండా జీవించలేనని అప్పుడు గుర్తుకొచ్చింది. నీముందు యెవరూ నాకు ముఖ్యం కాదనీ, నా తండ్రి కూడా ముఖ్యం కాదనీ, ఆయన డబ్బూ, హోదా...."

"లూసీ!"

"బిలీవ్ మీ రాణా."

"లూసీ! నేను చెప్పేది విను. రెండు వారాల్లో ఆగు. ఇప్పుడే నిర్ణయం తీసుకోవద్దు."

"అవసరం లేదు. నా గురించి నాకు తెల్సు."

"ఓ. కే. హనీ! నామీద నిజంగా ప్రేమ వుంటే ఓ పని చెయ్. ఈ వారం రోజులు నువ్వు తీవ్రంగా ఆలోచిస్తూ మానసికంగా అలిసిపోయావ్. నువ్వు ఖచ్చితమైన నిర్ణయం తీసుకున్నావని నాకు అనిపించాలి. అది యిద్దరికీ క్షేమం."

"అండ్ వాట్ ఎబౌట్ యూ డార్లింగ్? నీకు స్థిరమైన అభిప్రాయం వుందా నా మీద?"

అతను బరువుగా కుర్చీలో వెనక్కివాలాడు. "నీ మీద స్థిరమైన అభిప్రాయాలున్నాయి లూసీ. కాని నామీద నాకే లేవు. నాకు కొంత గడువు కావాలి. ఖచ్చితమైన నిర్ణయాలు తీసుకోకుండా చేస్తున్నాయి గత పదిరోజుల్లో జరిగిన సంఘటనలు...."

ఆ మాటల్లోని లోతు అర్థం గ్రహించలేదు లూసీ.

"అందుకేనా నన్ను ఆలోచించుకోమంటున్నావ్?-

నీకు హైం కావాలి కనుకనా?" అతని ప్రేమపై ఒక్క క్షణం అపనమ్మకం ఏర్పడిందామెకి.

"ఒక విధంగా నువ్వు చెప్పిందే నిజం," గుంభనంగా అన్నాడు రాణా. "నన్ను నేను లోతుగా అవలోకించుకోవాలి."

ఆమె నీలి కళ్ళల్లో కన్నీళ్ళు చిమ్మాయి.

ఇద్దరి మధ్యా కొద్ది నిముషాలు మౌనం రాజ్యం చేసింది. ఆమె అకస్మాత్తుగా తల పైకెత్తి అతని ముఖంలోకి చూసింది. "రాణా! నన్ను ఈ రాత్రికి యిక్కడే వుండనీ."

"నీ ఫాదర్ ...."

"నీకు యిప్పుడే చెప్పాను ఆయన విషయం నా కంత ముఖ్యం కాదని. నీకు దూరంగా వుండటం నాకు యిష్టం లేదు. కనీసం ఈ రోజు."

"ఓ. కే. హనీ! దాని గురించి వాదన యెందుకు?" అన్నాడు రాణా వాతావరణాన్ని చల్లబరుస్తూ.

"డాడీకి తర్వాత ఫోన్ చేసి చెప్తాను." అతని ముఖం మీద తన ముఖం ఆన్చిందామె. "నాకు గడువు అక్కర్లేదు రాణా! కాని తీసుకుంటాను. నువ్వు త్వరగా నిర్ణయం తీసుకోవడమే నాకు కావలసింది. అంతగా నేను నీకు అక్కర్లేదు అనుకుంటే...." పంటి బిగువున దుఃఖం దిగమింగుతూ చెప్పింది...."నీకు దూరంగా పోతాను."

అతను ఆమె పెదాలను బలంగా ముద్దు పెట్టుకున్నాడు.

ముసురుపట్టిన ఆమె ముఖాన్ని చూసి ఒక్కసారిగా

నవ్వుతూ అన్నాడు. "ఓ. కే. లవ్! అది మన ఒప్పందం."

ఇద్దరూ కాఫీ తాగుతూ, కాసేపు ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయారు.

క్రమంగా రాణా హృదయం తేలిక పడింది.

* * *

బొంబాయి నగర వీధులు రద్దీగా వున్నాయ్.

ట్రాఫిక్ కోలాహలాన్ని తప్పించుకుంటూ, ప్రెసిడెంటు స్ట్రీటులోకి మలుపు తిరిగాడు రాణా.

అసంఖ్యాకమైన వుద్యోగులు, కార్మికులు, హడావుడిగా కార్యాలయాల్లోకీ, ఫాక్టరీల్లోకి చేరుకుంటున్నారు.

ఆ దృశ్యం పెద్ద కొండరాయికింద సందు చేసుకుని దూరే చీమల్ని గుర్తుకు తెస్తోంది....

ఎన్విరాన్మెంట్ బిల్డింగ్‌లో అడుగు పెట్టి లిఫ్ట్ ద్వారా, ఎనిమిదో అంతస్తు చేరుకున్నాడు రాణా.

హాల్లో ప్రవేశిస్తూ లేడీ సెక్రటరీ లోలాను విష్ చేసాడు నవ్వుతూ.

ఆశ్చర్యపోతూ ఆమె కురిపిస్తున్న ప్రశ్నల వర్షానికి జవాబుగా, తన ఆరోగ్యం బాగానే వుందనీ, మిగతా కథ తర్వాత చెబ్తానని చెప్పి, బాస్ గదివైపు నడిచాడు.

తలుపు టకటక లాడించి లోపలకు నడిచాడు రాణా. ముందున్న కాగితాల్లోంచి బైటికి తొంగి చూసాడు కళ్ళద్దాలగుండా రామ్‌కింకర్. "ఆహ్! రాణా! ఫీలింగ్ ఓ. కే.? గుడ్! అలా కూర్చో ఒక క్షణం."

రిపోర్టు చదువుతున్న బాస్, బట్టతలని పరిశీలిస్తూ కుషన్డ్ సీట్లో కూలబడ్డాడు రాణా.

రెండు నిముషాల తర్వాత రామ్‌కింకర్ తన పని ముగించి, కాగితాల్ని జాగ్రత్తగా సర్ది నీట్‌గా ఓ ప్రక్క పెట్టి రాణాకేసి చూసాడు.

"వెల్ రాణా!" పొడిగా దగ్గి ప్రారంభించాడు. "నువ్వు పంపిన ఫోటోగ్రాఫ్స్ ప్రాసెస్ చేయించి పరీక్షించాను. అందులో కొన్ని ఐటెమ్స్ వింతగా వున్నాయి. కానీ వాటికీ, మన డిపార్టుమెంటుకి సంబంధం లేదు. ఖుల్నా ఏరియాలో లోపలిభాగంలో నువ్వు తీసిన ఫోటోగ్రాఫ్స్ చాలా ఇంటరెస్టింగ్‌గా వున్నాయి. అయితే ఆ విషయం గురించి తర్వాత చర్చించుకోవచ్చు. ముందుగా నువ్వు ఇన్వాల్వ్ అయిన భూకంపం గురించి మరోసారి పూర్తిగా చెప్పు. మొదట్నించీ, ఒక్క విషయం కూడా వదిలిపెట్టకుండా...."

రాణా తనకు జ్ఞాపకమున్న అన్ని విషయాలూ, వరుసగా, పూసగుచ్చినట్లు చెప్పసాగాడు....

కాని, ఆ చిన్న అమ్మాయిని రక్షించిన సన్నివేశం వివరిస్తుండగా హఠాత్తుగా అతని మెదడు శూన్యం అయింది.

"రాణా!" రామ్‌కింకర్ టేబుల్ మీద ముందుకు వంగాడు.

"జ్ఞాపకం తెచ్చుకోవడానికి ప్రయత్నించు.... నేల తెరుచుకోకముందు ప్రేలుడు లాంటిది ఏమైనా వినపడిందా?...."

"నో సర్. డెఫినిట్లీ నాట్. భూమిలో బయలు దేరిన రణగొణధ్వని విన్నానంతే. తర్వాత క్రాక్ ఏర్పడ్డం నేల రెండుగా చీలిపోవడం... నో బాస్! ప్రేలుడు జరగ

లేదని నేను ఖచ్చితంగా చెప్పగలను."

రామ్‌కింకర్ నిరుత్సాహంగా వెనక్కి జారబడ్డాడు. కళ్ళద్దాలు తీసి కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు.

చిన్నగా దగ్గి, సాలోచనగా చూపుడువేలు, బొటన వేళ్ళతో ముక్కు పై భాగాన్ని రుద్దుకున్నాడు.

కళ్ళద్దాలు తిరిగి తగిలించి, మళ్ళీ ముందుకు వంగాడు.

"యు సీ రాణా! నిన్న అగాధంలోంచి పైకి తీసుకు వచ్చిన కొద్దిక్షణాల్లో లోపల్నుంచి మేఘంలాంటి పొగ వెలువడిందని చెప్పబడింది."

"అందుకే గ్రౌండ్‌లో ఎక్స్‌ప్లోషన్ జరిగిందని భావిస్తున్నారా??

"అది ఒక కారణం కావచ్చు."

"ఆ సంఘటనకీ, ఖుల్నా మిలటరీ బేస్‌కీ సంబంధం వుందని భావిస్తున్నారా?"

"నో....నో........అలా అనుమానించడానికి తగిన ఆధారాలు మనదగ్గరేమీ లేవు. నీకు నువ్వే చెప్పావు కూడా దానికి, దీనికీ సంబంధం లేదని."

"చెప్పాను. నిజమే. కాని ఈ విషయంలో నాకింకా అనుమానాలు లేకపోలేదు.

నిన్న కాంబేసునుంచీ తిరిగి వస్తుండగా పొగమంచులోకి ప్రవేశించాను. బాస్! ఐయామ్ టాకింగ్ ఎబౌట్ ఎ మిస్టీరియస్ క్లౌడ్! ఆ మేఘం పసుపు రంగులో వుండడం యెంత విచిత్రం? మిలటరీ ప్రయోగాల్లో వాళ్ళు వుపయోగించిన స్మోక్ స్క్రీన్‌లాంటిది ఏమైనా తేలుకుంటూ వస్తోందా?"

(సశేషం)

## "ముఖచిత్ర వాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపుతాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగడం సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును. ●



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురింపబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## రంగు మార్పు?

“అమ్మా .... నేను రేపటినుండి నల్లగా కనపడను.”

“మరి యెలా కనిపిస్తావు బాబూ?”

“ఎఱ్ఱగా కనిపిస్తానమ్మా! మా మాస్టర్, చెప్పిన ప్రశ్నలకు రేపు సరియైన జవాబులు చెప్పకపోతే నీ చర్మం వొలిచేస్తానన్నాడు” —కె. నాగభూషణం, బత్తలపల్లి.

## కొండ గుర్తు?

తన ఎదురుగా నిలబడ్డ ముసలమ్మనుచూస్తూ, తన బొంగురుగొంతును సవరించుకొని “ఏమిటి కావాలి?” అని ప్రశ్నించాడు డిటెక్టివ్ భోగారావు.

“నా బఱ్ఱె కన్పించకుండా పోయింది బాబూ?”

“దానికి గుర్తులేమన్నా వున్నాయా?”

“ఉన్నాయి బాబూ నాలుగు కాళ్ళు, నలుపు రంగు, వంకర కొమ్ములు....”

“అదికాదు నేనడిగింది. కొండగుర్తులేమన్నా వున్నాయా అని?”

ముసలమ్మ కొద్దిక్షణాలు ఆలోచించి, ఏదో గుర్తుకొచ్చినట్లుగా, “ఆ! దాని గొంతు అచ్చం మీరు మాట్లాడినట్లుగానే వుంటుంది బాబూ!” అన్నది.

—ఎ.ఎల్. నారాయణ్, శ్రీకాకుళం.

# మతిమరుపు?

సురేఖ తన భర్త చిదానందంతో విజయవాడకు ప్రయాణమయ్యింది. పెళ్ళయిన క్రొత్తలో చిదానందానికి విపరీతమైన మతిమరుపు వుందని తెలుసుకుని సురేఖ ఎంతో బాధపడింది. ఆ తర్వాత సర్దుకుపోవడం నేర్చుకుంది.

కృష్ణా ఎక్స్‌ప్రెస్ రిజర్వేషన్ బోగీలో కిటికీ ప్రక్క ఎదురదురు సీట్లు లభించాయి భార్యాభర్తలకు.

కృష్ణా ఎక్స్‌ప్రెస్ సికింద్రాబాద్ స్టేషన్ వదిలి వేగం అందకుంది. సురేఖ గట్టిగా వూపిరి వదిలి, ప్రకృతి సౌంద ర్యాన్ని ఆస్వాదిస్తూ కూర్చుంది.

ప్రక్క సీట్లలో వున్న ఆడవాళ్ళు సురేఖని పలకరించి, మాటల్లోకి దింపారు. పావుగంట గడిచిన తర్వాత.

"ఇంతకీ మీ పేరేమిటో చెప్పనేలేదు" అడిగారు వాళ్ళు.

"నా పేరు రాజ్యలక్ష్మి అండీ...."

మతిమరుపు చిదానందం వులిక్కిపడ్డాడు.

"ఏవిటీ....నాకు తెలియకుండా నువ్వు పేరెప్పుడు మార్చుకున్నావు?" ఆశ్చర్యంతో అడిగాడు చిదానందం.

"లేదు....నా పేరు రాజ్యలక్ష్మే....!" స్థిరంగా చెప్పింది.

"ఏవిటి....నువ్వెవరు....?" ఈసారి మరింత ఆశ్చర్య పోయాడు మతిమరుపు చిదానందం.

"క్షమించాలి! మీరు పొరపడుతున్నారు. కిటికీ ప్రక్కన కూర్చుంటే కాస్త గాలి ఆడుతుందని అవతలి సీటునించి వచ్చి ఇక్కడ కూర్చున్నాను. ఇంత క్రితమే మీ ఆవిడ లావెటరీకి వెళ్ళింది" చెప్పింది ఆవిడ.

—యం. వీరాస్వామి, మల్కాజిగిరి.

# ఫారము-4

| | | |
|---|---|---|
| 1. ప్రచురణ స్థలము | : | హైద్రాబాదు-29. |
| 2. ప్రచురణ కాలము | : | మాసపత్రిక. |
| 3. ముద్రాపకుని పేరు | : | శ్యామ దామోదరరెడ్డి. |
| జాతీయత | : | భారతీయుడు. |
| చిరునామా | : | హైద్రాబాదు-29. |
| 4. ప్రచురణకర్త పేరు | : | -డిటో- |
| జాతీయత | | |
| చిరునామా | | |
| 5. సంపాదకుని పేరు | : | -డిటో- |
| జాతీయత | | |
| చిరునామా | | |
| 6. వార్తాపత్రికపై యాజమాన్యముగల వ్యక్తులు, భాగస్తుల పేర్లు, చిరునామాలు | : | శ్యామ దామోదరరెడ్డి 3-4-554 నారాయణగూడ హైద్రాబాదు-29. (సోల్ ప్రొప్రయిటరు.) |

శ్యామ దామోదరరెడ్డి అయిన నేను, పైన తెలిపిన వివరములు నాకు తెలిసినంతవరకు, నేను విశ్వసించినంత మేరకు సత్యమైనవని, ఇందు మూలముగా ప్రకటించుచున్నాను.

శ్యామ దామోదరరెడ్డి

తేది: 1-3-80 ప్రచురణకర్త సంతకం



